# బొబ్బిలి యుద్ధము

వీరరౌద్రభీభత్సభయానక రసములకు ఆటపట్టయిన బొబ్బిలియుద్ధకథ ఆంధ్రదేశీయులకు ఆబాలగోపాలముగఁ దెలియనిది గాదు. ఇదియే ఆంధ్రవీరుల సమధికప్రతాపమునకు అత్యంతప్రదర్శనము. ఇది బ్రహ్మశ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రులవారిచే మనోహరమగు శైలిలో వ్రాయఁబడుచున్నది. మిథునానురాగము, వీరపూజ, శ్మశానవాటిక మున్నగు గొప్పగ్రంథములను వ్రాసి వన్నెకెక్కిన శ్రీశాస్త్రులవారి రచనాసామర్థ్యము ఆంధ్రుల కెల్లరకును విదితమే. ఇందు బొబ్బిలి, విజయనగరము వీరుల చిత్రపటములు సంపాదింపఁబడుచున్నవి.

కళాభివర్ధనీ గ్రంథనిలయము
రాయవరము - గోదావరిజిల్లా

కలాభివర్ధనీ గ్రంథనిలయము

# వీరపూజ

ప్రథమభాగము భారతశౌర్యము

## శ్రీపాదసుబ్రహ్మణ్యశాస్త్రి ప్రణీతము

సర్వస్వామ్య సంకలితము

రెండవకూర్పు

౧౯౨౫

కలాభివర్ధనీ గ్రంథనిలయము

రాయవరము - గోదావరిజిల్లా

# పోషకులు

మ-రా-శ్రీ దామెర పార్థసారథి వేంకటరావుగారు

వీరవరము

,, సబ్బెళ్ల పద్దయ్యారెడ్డిగారు

కొంకుదురు

,, వాసిరెడ్డి వెత్రన్యగారు

చేబ్రోలు

,, వావిళ్ల వేంకటేశ్వరులుగారు

మదరాసు

,, గొముల్లూరి శివరామయ్యగారు బి.ఏ.బి.ఎల్

ప్లీడరు, నెల్లూరు

,, పోణకా శేషారెడ్డిగారు

పోట్లపూడి

,, చిక్కవరపు రామరెడ్డిగారు

పాట్పపాళెము

,, పోణకా పేరారెడ్డిగారు

అల్లూరు

,, మల్లిడి సత్యనారాయణరెడ్డిగారు

కుతుకులూరు

,, ద్వారంపూడి రామరెడ్డిగారు

అనపర్తి

*

# ఇదివఱకు వెలువడిన గ్రంథములు

| | | | | |
|---|---|---|---|---|
| వీరపూజ | (చరిత్ర) | ౧ | ౦ | ౦ |
| శ్మశానవాటిక | (నవల) | ౧ | ౦ | ౦ |
| మిథునానురాగము | (నవల) | ౦ | ౧౨ | ౦ |
| రామదేవవిజయము | (నాటకము) | ౦ | ౬ | ౦ |
| సాహసిక రాజపుత్రము | ( ,, ) | ౦ | ౬ | ౦ |
| శృంఖల | (విమర్శగ్రంథము) | ౦ | ౬ | ౦ |

# అచ్చుకానున్న గ్రంథములు

వారకాంత

బొబ్బిలియుద్ధము

అనాథబాలిక

కడపటిముద్దు

పూలదండ

# కళాభివర్ధనీ గ్రంథనియము

రాయవరము గోదావరిజిల్లా

# బాలురే వీరులు

మనపిల్లలు చదువుకొనుటకు సులభమైన చరిత్ర కథలు ఇదివఱకు తెలుగులో లేవు. పిల్లలు దేశాభిమానులు కావలయునన్న వారు, ముందు చరిత్రకథలు చదువవలెను. ప్రకృతము మేము ఈకథలు ప్రకటించినాము.

| | | | |
|---|---|---|---|
| విజయనగర రాజులకథలు | ౦ | ౩ | ౦ |
| చిత్తూరు రాజులకథలు | ౦ | ౪ | ౦ |
| ఢిల్లీ చక్రవర్తులకథలు | ౦ | ౪ | ౦ |
| గోల్కొండ నవాబులకథలు | ౦ | ౨ | ౦ |

## కలాభివర్ధనీ గ్రంథనిలయము

రాయవరము గోదావరిజిల్లా

# విషయసూచిక

## ౫. సంగరాణా. ౧౫౫

ఈతని జననకాలము తెలియదు. రాజ్యారోహణము క్రీ. శ. ౧౫౦౯. బాబరుచే నంపఁబడిన ౧౫ వందల యాశ్వికబలము నీతనిని క్రీ. శ. ౧౫౨౭-వ సంవత్సరము శ్రావణమాసమునఁ దాఁకెను. సిక్రీ యుద్ధము క్రీ. శ. ౧౫౨౭-వ సంవత్సరము మార్చి ౧౬ తేదీని జరిగెను. సంగుఁడు క్రీ. శ. ౧౫౩౦ లో గతించెను.

## ౬. ప్రతాపసింహుఁడు. ౧౬౩

ఈతని జననకాలము తెలియదు. క్రీ. శ. ౧౫౭౨ లో రాజ్యారూఢుఁడయ్యెను. హాల్దీఘాట్టనుచోట జరిగిన యుద్ధము క్రీ. శ. ౧౫౭౬-వ సంవత్సరము శ్రావణమాసము. క్రీ. శ. ౧౫౯౭ లో నీతఁడస్తమించెను.

# రెండవ కూర్పు పీఠిక

ఒక సంవత్సరము క్రిందట దీనిని రెండవమారు ముద్రింపవలసిన యవసరము తటస్థించెను; గాని కార్యాంతరమువలన వీలు అయినది కాదు. దీనిని మద్రాసు విశ్వవిద్యాలయమువారు ఇంటర్మీడియేటు పరీక్షకు పాఠ్యగ్రంథముగా నేర్పఱిచి గౌరవించినారు. వారికిఁ గృతజ్ఞుఁడను. మా గ్రంథ నిలయమునకు క్రొత్తగా పోషకులుగాఁ జేరి మాకు చేయూత నొసంగిన అనపర్తి నివాసులు, శ్రీయుత ద్వారంపూడి రామిరెడ్డిగారికి కళాభివర్ధని గ్రంథ నిలయము పక్షమునఁ గృతజ్ఞతను విన్నవించుచున్నాను.

కాళయుక్తి జ్యేష్ఠ పూర్ణిమ
మహేంద్రవాడ
నందనవనము

ఇట్లు
గ్రంథకర్త

# పీఠిక

హిందూదేశ కథాసంగ్రహాఖ్యం బ్రథమ ద్వితీయభాగము లగు హిందూమహాయుగమును, మహమ్మదీయమహాయుగమును, చంద్రగుప్తచక్రవర్తియను చిన్న చరిత్రగ్రంథమును, సంస్కృతము నందలి ముద్రారాక్షస మను నాటకము నాధారము గావించుకొని నే నీ గ్రంథమును వ్రాసితిని. కావున నా గ్రంథకర్తలకు నేను కృతజ్ఞుఁడను.

ఈ గ్రంథమును దమ ముద్రాక్షరశాలలో ముద్రించి యుపోద్ఘాతము గూడ వ్రాసి దీనికి వన్నె దెచ్చిన యాంధ్రపత్రికాధిపతు లగు బ్రహ్మశ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు గారికిని, ఈ గ్రంథమును విని నాయెడల నెంతో యాదరము చూపి ప్రోత్సహించిన నామిత్రులు ప్రియులు సబ్బెళ్లపద్ద్యారెడ్డిగారికిని, దామెర పార్థసారథి వేంకటరావుగారికిని, ఇందలి చిత్రపటముల నొసంగిన విజ్ఞానచంద్రికా గ్రంథమండలి వారికిని కృతజ్ఞుఁడను.

ఈ గ్రంథము నాయాంధ్రసోదరుల కుపయోగపడు నేని అచిర కాలమున దీని తరువాతి భాగములుగూడఁ బ్రకటింపఁగలను.

చెన్నపట్టణము
రాక్షసవత్సరాశ్వయుజబహుళ ౯
౧ స్థిరవారము
(౨౩-౧౦-౧౯౧౫)

ఇట్లు
విన్నవించు
విబుధవిధేయుఁడు
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

# ప్రస్తావన

వీరపూజ మానవులకు జాతీయధర్మములలో నుత్తమధర్మము. వీరులు లోకపరిణామప్రాప్తికై యవతరించెడి మహానుభావులు. వీరులసంకల్పము లుదారములు ; భావములు విశాలములు ; ఆదర్శములు పవిత్రములు ; భక్తి యవిభక్తము ; ఆచరణములు ధర్మసంస్థాపనానుకూలములు. వీరులు దేవాంశసంభూతులు. వీరుల చరిత్ర మున్నతమైన కైలాసశిఖరమువలె గంభీరము ; దివ్యమైన గంగాజలమురీతి నాహ్లాదకరము ; మహత్తరంబైన దీపప్రభవలె భాసమానము ; ఉద్యానోద్భూతంబైన మలయానిలంబు పగిది సువాసనా సంకలితము. వీరుల జననమన్ని దేశములందును సర్వకాలములందును సాధ్యము. వీరసంభవమునకు దేశము కాలము పాత్రలు ప్రతిబంధకములు గావు. వీరోదయమునకు ప్రాక్పాశ్చాత్యదేశభేదము గాని భూతవర్తమానకాలభేదము గాని కులీన సామాన్య కుటుంబభేదము గాని యాటంకములు గావు.

ప్రపంచవిజయమున కుపక్రమించిన యలగ్జాండరు మహామహుఁడు వీరాగ్రేసరుఁడు. బౌద్ధయుగమునందు మహాసామ్రాజ్యమును స్థాపించిన చంద్రగుప్తుఁడు వీరనాయకుఁడు. మహమ్మదీయ ప్రతాపాగ్ని నార్పుట కాత్మసమర్పణము చేసిన పృథ్వీరాజు వీరశిఖామణి. పాశ్చాత్యరణరంగములందు శౌర్యప్రతాపములను ప్రదర్శించుచున్న భారతయోధులు వీరసింహులు. క్షత్రియకులసంజాతుండైన భీష్ముఁడు వీరశ్రేష్ఠుఁడు. సూతకులజుండైన నెపోలియను వీరసామ్రాజ్యమునకుఁ బట్టభద్రుఁడు.

వీరధర్మప్రకర్షణంబునకు దేశ కాల పాత్రములవలె గుణభాగ భేదము వృత్తిభేదము వైరుధ్యములు గావు. వీరధర్మప్రతిపాదనమునకు విజ్ఞానగుణశీలములు సాధనములు. భావప్రపంచవిహారులైన మహాకవులు, కళాభిజ్ఞులైన యంత్రనిర్మాతలు, విజ్ఞానసంపన్నులైన శాస్త్రజ్ఞులు, భావోద్దీపకులైన గాయకశ్రేష్ఠులు, తత్త్వజ్ఞులైన మతస్థాపకులు, యుద్ధవిశారదులైన శూరులు వీరగుణసంపన్నులు. లోకకల్యాణమునకై యుగధర్మానుకూలముగ వీరధర్మములును మాఱుట సృష్టివైచిత్ర్యము. లోకాభ్యుదయమున కొకయుగమునందు రాజసము వేఱొకయుగమునందు సాత్త్వికము ప్రబలుట భగవన్నిర్ణయము. యుగప్రభావము ననుసరించి వీరులను రాజసభావ మావహించినపుడు సంగ్రామకోలాహలంబును సాత్త్వికభావ మావహించినపుడు జిజ్ఞాసాభిలాషయును ప్రబలుట లోకచరిత్రవలన విశదమగుచున్నది. భరతవర్షమునం దనేకపర్యాయములు యుగధర్మములు మాఱినవి. శూరులైన అజాతశత్రుఁడు, చంద్రగుప్తుఁడు, సముద్రగుప్తుఁడు, శాలివాహనుఁడు, శ్రీహర్షుఁడు, పృథ్వీరాజు, శ్రీకృష్ణదేవరాయలు, శివాజీమహారాజు సామ్రాజ్యములను నిర్మించి పూజార్హులైరి. బుద్ధదేవుఁడు, శంకరుఁడు, రామానుజుఁడు, చైతన్యుఁడు సాత్త్వికసామ్రాజ్యమును స్థాపించి ఆరాధనయోగ్యులైరి.

రాజస సామ్రాజ్యస్థాపకులైన చంద్రగుప్త పృథ్వీరాజాది వీరశ్రేష్ఠుల చరిత్రము లీగ్రంథము నందు వర్ణింపఁబడినవి. మహాపురుషుల జీవితచరిత్రకథనమునందు కవికల్పనలకు విశేషమైన యవకాశము లేదు. చరిత్ర పురుషులజీవితచరిత్రములు చిత్రకల్పనా రాహిత్యములై సచ్చరితశీలాభివర్ణనంబులైన పాఠకులకు భ్రమసంజనకంబులు గాక సత్యప్రకాశాశ్రయంబులై యనుష్ఠాన యోగ్యంబులుగ నుండఁగలవు.

చంద్రగుప్త పృథ్వీరాజ ప్రతాపసింహాదులు చరిత్రపురుషులు. ఆ మహాపురుషుల చరిత్రకథనమును జరిత్రాత్మకమై యొప్పియుండుట సమంజసము.

ఈగ్రంథమునందు చంద్రగుప్త చరిత్రము, పృథ్వీరాజ చరిత్రము, భీమసింహచరిత్రము, హామీరసింహచరిత్రము, సంగరాణా చరిత్రము, ప్రతాపసింహచరిత్రము వీరరసము వెల్లువయై పొంగున ట్లులు రమ్యముగ వర్ణింపఁబడినవి. చంద్రగుప్తుఁడు మురాతనయుఁడు. యుద్ధతంత్రజ్ఞుఁడు. వ్యవసాయపరాయణుఁడు. అప్రతిహతంబైన స్వీయపౌరుషాశ్రయంబునను ప్రజ్ఞానిధియైన చాణక్యుని సహాయమువను మహత్తరంబైన మౌర్యసామ్రాజ్యమును సుస్థిరముగ స్థాపించిన మహావీరుఁడు.

పృథ్వీరాజు చౌహానువంశజుఁడు. విశాలదేవుని పౌత్రుఁడు. మహమ్మదుఘోరితో పదుమూఁడుసారులు పోరాడి వానిని పెక్కుసారులోడించిన ధీరోత్తముఁడు. పృథ్వీరాజు ౧౧౯౨ నందు తిలావరి సమీపమున పరాజితుండైనపిదప ఢిల్లీశ్వరత్వము పరరాజుల పరమైనది. పృథ్వీరాజచరిత్రము సంయుక్తపరిణయమువలన హృదయరంజకమై వీరదాంపత్యమునకుఁ దార్కాణమైనది.

లక్ష్మణసింహుఁడు మేవాడు సంస్థానమున కేలిక. భీమసింహుఁడు లక్ష్మణసింహుని పినతండ్రి. మోహనాంగియైన పద్మిని భీమసింహుని సతీతిలకము. అల్లాయుద్దీనుఖిల్జి కామాంధుఁడు. పద్మిని నపహరించుటకై చిత్తూరుకోటను ముట్టడించి పాడుచేసెను. దుర్గసంరక్షణ మలవిగానపుడు స్త్రీ లగ్నికుండంబులందును పురుషులు రణరంగములందును మానసంరక్షణమునకై మేనుల బలియిచ్చిరి.

మేవాడువంశజులైన హామీరసింహుఁడు సంగరాణాయును

పౌరుషసంపన్నులు. చిత్తూరుకోటను స్థిరముగ కలిపియుంచుకొనుటకై యనేకప్రయత్నములను జేసి విఫలమనోరథులైరి.

మేవాడు రాజ్యమునకు ౧౫౭౨-౯౭ వరకు ప్రతాపసింహుఁడేలికగనుండెను. ప్రతాపసింహుఁడు నిద్రాహారములను, భాగ్యభోగ్యములను, విసుగు విరామములను పరిత్యజించి యిరువదియైదేండ్లక్బరు చక్రవర్తియొక్క మహాసైన్యములతో పోరాడిన మహాశూరుఁడు.

దైవము ప్రాతికూల్యము వహించినప్పుడు పురుషప్రయత్నములు నిర్వీర్యములగుట సహజము. రాజసము సంగరహితంబైనప్పుడు సంగ్రామములు ధర్మసంస్థాపనానుకూలములై పరిణమించుటయును, రాజసము సంగభరితంబైనప్పుడు సంగ్రామములు కులాభిమానముగను జాతీయదురభిమానముగను పరిణమించుటయును సహజము. రాజపుత్రవీరుల యంతఃకలహములందును ఆత్మవినాశమునందునువలె వర్తమానమహాసంగ్రామమునందును ఈధర్మము వ్యక్తము. ఆసియాఖండమునందు శాంతియుగముపోయి తిరిగి వీరయుగము స్థాపితమగుననుటకు సూచనలుగలవు. వీరయుగమునందు వీరావేశము, భావోద్రేకము గలుగుట సహజము. యుగసంధియందు యూరపుఖండమువలె ఆసియాఖండము విపత్పరంపరలపాల్పడి వినాశము నొందకుండుట క్షేమకరము.

వీరపూజ భారతీయుల కితరజాతులకువలె సాంఘికధర్మము గాక మతధర్మము. భారతీయులకు పితృదేవతారాధనము వీరారాధనము నియతకర్మలు. నియతకర్మలు కామితార్థములను పడయుటకు సాధనములు. వీరులు కర్మపరతంత్రులు, భాగ్యప్రకాశకులు. వీరులు నాయకులు, ధర్మనిరతులు, విజ్ఞానధనులు, జాతీయోద్ధారకులు.

జాతీయాత్మకు వీరహృదయములు క్షేత్రములు. వీరహృదయభావము పండుగలందును, క్షేత్రములందును, తీర్థములందును, గ్రంథములందును వ్యక్తీకృతమగుచున్నది. వీరులు జాతికి నాయకులు, పోషకులు, మూలకారకులు. శ్రీరామకృష్ణులు, వీర్యము ప్రతాపము ధర్మములవలన నారాధనయోగ్యులైరి. వీరపూజ సహజధర్మమైనను సామాన్యులకు దురారాధ్యము.

పూజకు శ్రవణము, మననము, ధ్యానము, సంకీర్తనము, సమర్పణము సాధనములు. వీరపూజకు వీరులచరిత్రమును చదువుట, చరిత్రల తత్త్వమును గ్రహించుట, తత్త్వార్థము ననుభవమునకు దెచ్చుకొనుట, తన్మయత్వమును బొందుట మార్గములు. తన్మయంబైన వీరపూజయందు వీరసత్త్వము సర్వత్ర సందర్శనీయంబై ప్రత్యక్షముగ నుండును. వీరసత్త్వము ప్రత్యక్షమైనపుడు కథలు కావ్యములగును. ప్రాకృతపురుషులు ప్రతిభావంతులగుదురు. కుగ్రామంబులు పుణ్యక్షేత్రంబులగును. సామాన్యదినంబులు పండుగ దినంబులగును. ఆంధ్రలోకము వీరపూజాదర్శమును గ్రహించి మాతృదేశమునందలి గాథలందును, స్థలములందును నిక్షిప్తంబైన వీరభావమును వ్యక్తీకరించుచు దేశమును, జాతిని, భాషను నుద్ధరించుటకు వీరపూజా నిమగ్నమగుంగాత !

మద్రాసు — ఇట్లు

౮-౧౨-౧౯౧౫ — కాశీనాధుని నాగేశ్వరరావు

శ్రీరస్తు

# వీర పూజ

## ప్ర థ మ భా గ ము

---

### చంద్రగుప్తుఁడు

మహాపద్మనందుఁడు మగధసింహాసనము నధిష్ఠించి ప్రజాపాలనము గావించుచుండెను. రాజకార్యధురంధరుఁడని ప్రఖ్యాతివహించిన రాక్షసుఁడను నతఁడు నందునకు ముఖ్యమంత్రియై రాజకార్యముల నతినిపుణతతో నిర్వర్తించుచుండెను. బొక్కసమున ధనము కోట్లకొలఁదిగఁ గుప్పలు వడి మూల్గుచుండెను. చతురంగబలమసంఖ్యాకమై పరభయావహమై యుండెను. ప్రభుత్వ మెచ్చటను దిరుగుఁబాటులు లేక శాంతమై నిరంకుశమై యుండెను. ప్రజ లెల్లరును కృషివాణిజ్యాది స్వకర్మనిరతులై హాయిగఁ గాలము గడపుచుండిరి.

కాని కొంత కాలము జరుగునప్పటికి దేశము నందీ స్వస్థత నిలిచినది గాదు. విధివశంబునఁ బద్మనందుని మతి సంచలించెను. ప్రభుత్వము మేర మీరి పోఁ జొచ్చెను. ప్రజాసౌఖ్యము నెడల రాజునకు వైముఖ్యము పొడసూపెను. సన్నసన్నముగఁ బ్రజలలో నసంతృప్తి తలయెత్తెను. కాని కొంతకాలమువఱకు నది బహిరంగము గాలేదు. ఈ యాంతరంగికస్థితి వలన నది లెస్సగఁ బ్రవృద్ధం

బయ్యెను. ప్రజ లూరకుండుటఁ జూచి రాజు మఱింత చెలరేఁగెను. సూర్యమండలము తిరోహితం బగు నంత దనుక నాకసమున నీలమేఘములు క్రమ్ముకొనె నని స్వవ్యాపారనిమగ్ను లగు ప్రజల కెట్లు తెలియదో యట్లే యది ప్రజ లటనటఁ జేరి గుసగుసలు పోఁదొడఁగు నంత దనుక రాజచారుల శ్రవణపథము నధిగమింప లేదు.

తుద కెప్పు డది బహిర్గత మయ్యెనో యప్పుడు సంఘర్షముగ రాజద్వేషానలావతారమును దాల్చి యుండెను. అమాత్యాదులు దాని వారని కిచ్చ వడిరి. రాజు విని మహోగ్రముగ మండిపడెను. అతనికిఁ బ్రజల నందఱ నొక్క పెట్టున సంహరించి వేయవలయు నను నంతటి కోపము వచ్చెను. కోపగ్రహావేశమువలనఁ బ్రాపంచికజ్ఞానభ్రష్టుఁడై నందుఁడు ప్రజలయందలి రాజద్వేషానలమును జల్లార్చ దండోపాయము నవలంబించెను. ఇది యంతయుఁ జూచి రాజనీతిధురంధరుఁ డగు మహామంత్రి రాక్షసుఁడు రాజుబుద్ధి మఱలింప ననేకవిధములఁ బ్రయత్నించెను; గాని సఫలప్రయత్నుఁడు గాఁడయ్యె.

అంతకంతకుఁ బ్రజలలో గుసగుసలు మెండయ్యెను. శాసనధిక్కార మారంభ మయ్యెను. కాలక్రమమునఁ బ్రజల యెడల రాజునకును, రాజునెడలఁ బ్రజలకును నసూయ పెరిఁగి పోఁజొచ్చెను. మంత్రి, రాజు మనస్సును మఱలించుటకుఁ జేసిన ప్రయత్నములు విఫలము లగుటయుఁ బ్రజలలో నశాంతి హెచ్చయి పోవుచుండుటయుఁ దిలకించి నిర్విణ్ణుఁ డయ్యెను.

దంపతులలో నంతఃకలహములు పుట్టకయే యుండవలెను. పుట్టినచో నవి క్రమక్రమముగ వృద్ధి పొందునే గాని యంతరింపవు. దైవయోగమువలన వాని కవి యంతరింపవలెనే గాని వేఱొక రట్లు

చేయఁ బ్రయత్నించుటవలనఁ బ్రయోజనము కలుగఁ బోదు. అట్టి ప్రయత్నములవలన నొక్కొక్కప్పు డది వృద్ధి పొందుట గూడ సంభవింపవచ్చును. అట్లుగాక యే కారణమువలననైన నా కలహములు శాంతివహించినను నా శాంతి తాత్కాలికము గాని సార్వకాలికము గాఁజాలదు. ప్రజాప్రభువులయెడలఁ గూడ నీన్యాయమే చెల్లుచున్నది.

రాక్షసునిపై నిప్పు డెంతయో భారము పడినది. ఈ సందర్భమునఁ జాల మెలఁకువతోఁ బ్రవర్తింపకున్నఁ గార్యము చెడును. మగధరాజ్య మంతయు విచ్ఛిన్నమై పోవును. రాజు పట్టిన పట్టు విడువకుండెను. ప్రజలలో శాంతి నెలకొనినఁగాని ప్రభువు శాంతింపఁడు. తన ప్రయత్నము వలనఁ బ్రభు వపరాధి యని యెంతమాత్రము ప్రకటితమైనను బ్రజలు రాజును లోఁకువ జేసి మఱింత బిఱ్ఱబిగిసెదరు. పాపము రాక్షసుఁ డట్టి చిక్కు లేవియుఁ ఘటిల్లింపకుండ నుండునట్లతిజాగరూకతతోడనె ప్రవర్తించుచుండెను. కాని ప్రభువనపరాధి యని నిర్ధారించుట యెట్లు? ప్రథమాపరాధము ప్రజలదే యని యెట్లు నిరూపింపఁ గలఁడు? ఏమియుఁ బ్రయోజనము కాన్పింప దయ్యెను. విధిప్రాతికూల్యము వలన రాక్షసుని ప్రయత్నము లన్నియు భగ్నములై పోయెను.

చాణక్యప్రభృతు లగు నప్పటి రాజ్యతంత్రజ్ఞుల యభిప్రాయమున రాజనీతిప్రవృత్తి యిట్టి దని నిశ్చయించుటకు వలను పడదు. అది సర్వతోముఖము. దానికి న్యాయాన్యాయము లనియుఁ, గ్రౌర్యసౌమ్యములనియుఁ, గ్రమాక్రమములనియు భేదము లేదు. ఎట్లు ప్రవర్తించినను సరియే పరవినాశము నాత్మోదయమును గాంచుటయే దాని ప్రధానప్రయోజనము. " చతురంగబల సమృద్ధిని గలిగి

యుండవలెను. శత్రువులను సంగరరంగమున సంహరించి విజయమును గాంచవలయు" నని దాని సామాన్యవిధి. "సమయాసమయములను జక్కఁగ గుఱుతెఱింగి సామదానభేదదండములలో నప్పటికిఁ దగు నుపాయము నవలంబింపుఁ" మని దాని విశేషవిధి. న్యాయాన్యాయము లీ విశేషవిధి ముందుఁ జెల్లాచెదరై పోవును. ధర్మజ్ఞులు రాజనీతిని ధర్మముతో ననుసంధింపవలె నందురు. రాజ్యతంత్రజ్ఞులు దీనినిఁ గేవలము వలదనరు; గాని సమయము తప్పవచ్చినపుడు మాత్రము కేవలము రాజనీతినే యవలంబింతురు. ధర్మపరావతారుఁ డయ్యు శ్రీరామచంద్రుఁడు వాలిసంహారకాలమునఁ గేవలము రాజనీతి నాశ్రయించెను. శ్రీరాముఁ డొక్కఁడే దీనికిఁ దార్కాణ గాదు. విధాత సృష్టి సేయఁ బ్రారంభించిన నాఁటి తొలి నిమిషము మొదలుకొని యీక్షణము దనుకఁ బ్రపంచవృత్తి యంతియు దీనినే దృఢపఱచుచున్నది. ఈ చర్చ వలన మనకుఁ గలిగిన పరమ ప్రయోజనము రాజనీతిధురంధరుఁ డన సమయజ్ఞుఁ డగు కార్యవాది యని యర్థ మను విజ్ఞానము.

పద్మనందుఁడు స్వార్థపరుఁడు; గాని యాతనికిఁ జక్కని సమయజ్ఞానము లేదు. ఖడ్గవాది; మఱియు నాతఁడు రాజ్యతంత్రము నెఱుంగును; గాని విరోధులను జక్కఁగ నెఱుంగని తీవ్రచిత్తుఁడు. అగుటవలననే యాతఁడు తన యవిచారప్రవర్తనచే నసంతృప్తులై యున్న ప్రజలమీఁద దండోపాయము నవలంబించెను. రాజదండనమువలనఁ దల్లడంపడు ప్రజలమీఁద రాక్షసుని సామోపాయ మేమి పనికి వచ్చును?

ఇట్లు కొన్ని దినములు గడచునప్పటికి మహారాజు దండోపాయము నవలంబించుటయు, మహామాత్యుఁడు మాయఁ జేసి

యాతడింపఁ జూచుటయుఁ జూచి ప్రజలు రాజసభలో నాంత రంగిక వ్యవస్థ చక్కఁగ లే దని యూహించి మతింత విజృంభింప సాగిరి. అంతకంతకు మహారాజున కుశా కతిశయింపఁ జొచ్చెను. రాక్షసుని హృదయావేదన మతింత కా సాగెను. ఇతరోద్యోగు లెల్లరును జాలఁ దహతహపడసాగిరి. రాష్ట్రమునందలి యనధికారు లగు రాజనీతిధురంధరు లసాయమును శంకింపఁ దొడఁగిరి.

ఈ ప్రజాద్వేష ముప్పతిల్లుటకుఁ గేవలము పద్మనందుఁడే హేతుభూతుఁ డని చెప్పుటకు వీలు లేదు. రాజ్యతంత్రమునం దసమర్థులై, యౌవనమదంబున నున్నను మిన్నను గానక సంచ రించు నాతని యనమంత్రులు కుమారులును దండ్రి కీ విషయమునఁ గొంతవఱకుఁ దోడ్పడిరి; గాని సర్వాధికారమును బద్మనందుని యందే యుండుటవలన దోష మంతయు నాతనిదిగనే పరిగణింపఁ బడెను. దోషు లైనప్పటికి నవభిషిక్తులగుట నందపుత్రులు ప్రోత్సా హకాపవాదమునకు మాత్రము పాల్పడిరి.

ఏది యెట్లయిన నేమి? ప్రజల బాధల కంతము గాన్పింప దయ్యెను. దినములు గడచిపోయిన కొలఁది నవి యంతకంతకుఁ బెరిఁగిపోవు సందర్భములే పొడసూపించుచు వచ్చెను. ఆ బాధలవలన ననేకులు నలమల మాడిపోయిరి. లోకోత్తర మగు నీ చల్లని బ్రిటిషు పరిపాలనమున నపూర్వసుఖములను బడయుచు హాయిగఁ గాలము గడపుచున్న మనకు, దుష్పరిపాలనము వలనఁ బ్రజలకు సంభవించు కష్టము లెంత దుస్సహములై యుండునో యేమి తెలియును? తుదకుఁ బ్రజలు, విశేషించి పాటలీ పుత్ర పౌరులు, రాజు నెడల ద్రోహమును దలంచిరి. పద్మనందుని సింహాసనభ్రష్టునిఁ గావించుట కుపాయములు పన్నఁ జొచ్చిరి

కాని యనంతసేనాసంపన్నుఁ డగు మహీపతిని వా రేమి సేయఁ గలరు? వారు చెప్పినట్లు చేయఁ గలరు; గాని స్వయముగ వ్యవహారము నడుపఁజాలరు. వారి కప్పు డొక నాయకుఁడు కావలసి వచ్చెను. నాయకుఁ డెక్కడ నున్నాఁడు?

“అందఱు ప్రజలలో నాయకత్వము వహింపఁ దగు వాఁ డొక్కఁడును లేఁడా?” యని ప్రశ్నించుట కవకాశము లేదు. రాజ నియుక్తు లైనచో బుద్ధిబాహుబలంబులఁ బరబలంబులఁ జెల్లాచెదరు గావింపఁ గల పోటుబంట్లుం దనేకులు గలరు. వారు తిరుగుబాటు నడుపఁ జాలరా? వా రంతటి యాత్మవిశ్వాసము లేని వారా? కారు. తిరుగుఁబాటు నడుపఁజాలగనుట భారతీయులకు లజ్జాకారణము గాదు. భారతీయులు పృథివీపతికి విష్ణ్వంశ నాపాదింతురు. అక్కతన వారు ప్రభువు నెదిరించి కత్తి కట్టఁ జాలరు. దానికిఁ గారణము గౌరవభావమే గాని పౌరుషాభావము గాదు. భారతవర్షేతర దేశచరిత్రములం దిలకింపుఁడు. సాధారణముగఁ బుట కొక్క విప్లవచరిత్ర ముండు ననుట సాహసము గాని యతిశయోక్తి గాని కాఁ జాలదు. ఎన్నియో వేల యేండ్లకుఁ బూర్వము మొదలు నేఁటిదనుక జరిగిన భారతదేశచరిత్రమున నొకటిరెంటికంటె నెక్కుడు తిరుగుఁబాటులు గాన్పింపవు. అవి యైనను భారతీయేతరులు గావించినట్టివి గావు. భారతీయేతరులు గావించిన విప్లవములు వీలయి నప్పుడెల్ల మాటిమాటికి నేదో వంక మీఁదఁ బ్రసక్తములై ప్రభువుల సర్వాధికారములను దొలంగించి ప్రజాప్రభుత్వమును స్థాపించుట కేర్పడినవి. భారతీయులు గావించినవో; విధ్వస్తములై పోవు దేవాలయములను నిలుపుట కేర్పడినవి. గోబ్రాహ్మణులను సంరక్షించుటకును, రమణీమణుల మానమును గాపాడుటకును బ్రారంభింపఁ బడినవి. స్వమత

గౌరవము భ్రష్టమైపోవుచున్నదను నిశ్చయమువలననో, భ్రాంతి
వలననో దానిని గాపాడుకొనుటకొఱ కేర్పడిన వనివచో దుర్వ్యక్త
మగును. క్రొత్తగ సంభవించిన కష్టములను దొలంగించుకొనుటకే
భారతీయులు తొల్లి విప్లవములను గావించి యుండిరి గాని లేని సౌఖ్య
ములు తెచ్చిపెట్టుకొనుటకొఱకుఁ గాదు. రక్తపాతమును గావించు
టయు, దేశము నల్లకల్లోలముఁ జేయుటయు సాత్త్వికగుణప్రధాను
లగు భారతీయులకుఁ గిట్టవు. గంగా గోదావరి కృష్ణవేణ్యాది పావన
తరంగిణీజలములయందుఁ గ్రౌర్యము నుదయింపఁ జేయు గుణము
లేదు. అట్టితన భారతీయులలోఁ దిరుగుఁబాటు సేయువారలకు
నాయకుఁడు దొరకుట కష్టము.

ఇంతవఱకుఁ దమ దివ్యతేజస్సులను మగధదేశమును బ్రకాశ
వంతము సేయు మహాత్ములందఱును బద్ధనందునకు బాసటై
యున్నారు. ఇఁక బాలభానునివలె నిప్పుడిప్పుడే నవీనతేజమును
బ్రకటనము సేయు నూనూఁగు మీసాల వారిని వెదకవలెను. ప్రాయ
ము వచ్చిన పిదప దేశము నుద్ధరించు మహాత్ముల తేజము బాల్యమున
దౌర్భాగ్యప్రతిసీరచేఁ దిరోహితమై యుండును. అట్టితన సామాన్యు
లా బాలుఁడు మహాపురుషుఁ డగు నని భావింపఁ జాలరు. వాని
కుశాగ్రబుద్ధినిఁ జూచుకుఁదనము నారసి తెలివి గలవాఁ డగు నని
మాత్ర మూహింతురు. అతఁడు విద్యాభ్యాసమునందు, నాటపాటల
యందుఁ బ్రవర్తనము నందును దోడి బాలురతో సామ్యమును
వహించి యుండెఁడు. ఆ బాల్యప్రాయమునఁ గూడ వాని భావన
లత్యుదారములును, చేఁత లత్యద్భుతములును, మాటలు గంభీరములును,
హృదయము విశాలమును, చూడ్కులు పరేంగితజ్ఞానధురీణములును,
ప్రారంభములు మహోన్నతములు నై యుండును. అతని చిత్తవృత్తి

మొదటి నుండియు నితరులను బోషింపఁ గోరునే గాని తా నొరుల పోషణమును వాంఛింపఁడు. మహాపురుషునకు బాల్యమున సంభవించు నిక్కట్టులకును, నిరుత్సాహములకును, విఘ్నములకును, సాహసములకును లెక్క యుండదు. కాని వాని నన్నిటి నాతఁడు లెక్క లేనివిగనే భావించి చిత్తవైకల్యమునకుఁ బాల్పడక తన నిశ్చిత మార్గమునందే యుండును. అవి యన్నియు నాతని మనోదార్ఢ్యమును, దృఢదీక్షను వృద్ధిచేయుటకుఁ దటస్థించునవి గాని వేఱు గాదు. ఈ రహస్యము నెఱుంగని మందబుద్ధు లాపత్కాలమున నాతనినిఁ బరిహసింతురు. అతని మాటలు శత్రువులకు హృదయభేదకములై, మిత్రుల కానందసంధాయకములై యుండును. అతఁడు యౌవనము ప్రాపించు నప్పటి కొఱనుండి తీసిన బాఁకువోలెఁ బ్రకాశించుచుండును. ఈ కల్లోలసమయమున మాగధులకు హృదయావేదనఁ బాపి సుఖస్థితి గలుగఁజేయఁ గలతేజస్వి యెందైనఁ గలఁడా! కలఁడు. పద్మనందుని యాంతరంగికమర్మము లెల్ల నెఱింగి యాతని ప్రక్కలోని బల్లెమై మెలంగుచు రాజభవనమందే గలఁడు. ఎవఁడాతఁడు? రాజనీతి ధురంధరుఁడు, నిస్తుల బాహుబల సంపన్నుఁడు, మహావక్త, గంభీరదర్శనుఁడు, శూరుఁడు, ధీరుఁడు, పట్టుదల గల వాఁడు, విపత్తులయందు వెనుదీయకుండు వాఁడు, పరభయంకరుఁడు, కృత మెఱుఁగు వాఁడు, దాత, ప్రయోగనిపుణుఁడు, నగు చంద్రగుప్తుఁ డను యువకుఁడు.

‘చంద్రగుప్తుఁడు మురాకుమారుఁడు. మురశూద్రస్త్రీ. మఱియుఁ బద్మనందుని యుంపుడుకత్తె. పద్మనందునకుఁ బట్టమహిషి యగు నిళాదేవియం దెనమండ్రు పుత్రులు గలిగిరి. కాని యాతఁడు మురపైఁ గల యనురాగము పెంపున నామె యామోదమును బడయఁ గోరి

పట్టమహిషి కన్న కుమారులకంటెఁ జంద్రగుప్తు నధికప్రేమతోఁ జూచుచుండెను. చంద్రగుప్తునిజననసమయమున నచటనున్న సిద్ధాంతులాతఁడు సార్వభౌముఁడు కాఁగలఁ డని గ్రహించి యచ్చెరువడి యా విషయమును బ్రకటన గావింపక యూరకుండిరి. అయిన నాతని విశాలలలాటఫలకము మీఁదను, నాకర్ణాంతనయనయుగళముమీఁదను, దరహాసకటాక్షములయందు, నధిజ్యశరాసనములఁ బోలు కనుబొమల మీఁదను దాండవము గావించు దివ్యతేజోరూపమున నది సువ్యక్తమగుచు నేయుండెను. దాని నారసి తత్త్వజ్ఞులు కడు నబ్బురంపడుచు నేయుండిరి. కాని యిట్టి తేజము నందుని యౌరసపుత్రులయందుఁ గాన్పింపమిం జేసి, వారు, నందుని యనంతరము మగధరాజ్యలక్ష్మి చంద్రగుప్తుని విశాలవక్షఃపీఠమునందే విశ్రమించునా యని యాలోచింప సాగిరి.

అట్టి మహాతేజసంపన్నుం డగుటవలనఁ జంద్రగుప్తుఁడు రాజానుగ్రహమును వ్యర్థము సేయక పయింబయి దానిని వృద్ధి చేసెను. రాకుమారులతోఁ గూడ నాతఁడు విద్యాభ్యాసార్థము గురునికటమున కంపఁబడినప్పటినుండియు వారి కంటె నెక్కుడు తెలివితేటలు కనఁబఱుచు చుండెను. అది చూచి మల్లవిద్యాగురువు లీ దాసీపుత్రునకు యోధానుయోగ్యుఁడు కాఁ దగిన యోగ మున్నది కాఁబోలు ననియు, రాజ్యతంత్రోపదేష్టలు మహామాత్యపదవి నందుటకుఁ దగిన యోగ మున్నది కాఁబోలు ననియు నూహించు చుండిరి. మఱియు నాతని శక్తిసామర్థ్యముల నాలకించి కొంద ఱల్పబుద్ధు "ఈ దాసీపుత్రుఁడు వింజామరలు వీచుట నేర్చుకొనక యీ మహావిద్య లభ్యసింపనేల ?" యని తమలోఁ దా రెకసక్కెముగఁ బలుకుకొను చుండిరి. మఱియుఁ దమకంటె నన్ని విషయములయందును మిగులఁ

గుణశీలుం డగుటవలనఁ గాలక్రమమున నశక్తిదుర్గనులై రాకుమారులు చంద్రగుప్తునెడల నసూయాభావమును గాంచిరి.

తూలరాశిం బడిన యగ్నికణమువోలె నా యసూయ స్వల్పకాలమునందే వృద్ధి యయ్యెను. ఈ విషయమును జంద్రగుప్తుఁడు గ్రహింపక పోలేదు; గాని దానివలన వానికేమియు మనోవైకల్యము నంటలేదు. అవసరమేమి? అసూయయు నగ్నియు నాశ్రయములనే దహించి వేయును. అల్పబుద్ధులీ సంగతి నెఱుంగక బాలిశ తొట్రుపడియెదరు. స్త్రీచిత్తులీర్ష్యాళువులను మఱింత యేడ్పింతురు. దాని వలన దమకై నెదుటి వారి కసూయ పెరుఁగవలె ననియే వారి వాంఛ. అది వారికిఁ గార్యసాధకమై పరిణమింపఁగలదు. చంద్రగుప్తుఁడు సమయమైనప్పుడెల్ల నెట్లు మాటాడినచో నసూయాగ్ని వారి హృదయాంతరాళములను దగ్ధము గావించునో, యేమి చేసినచో రహస్యమున వారి కన్నుల నుండి యశ్రులహరి ప్రవహించునో, యట్లే మాటాడుచు, నట్లే చేయుచుండెను.

కొన్ని దినములకు విద్యాభ్యాసము పూర్తి యయ్యెను. చంద్రగుప్తుఁడు సకలకళాకోవిదుఁ డయ్యెను. రాకుమారుల విజ్ఞానాంకురములు క్షణక్షణప్రవర్ధమానం బగు నసూయానలమువలనఁ గొంత వఱకు మాడిపోయెను; గాని తండ్రి వృద్ధుఁ డగు చుండుటయు, రాష్ట్రమునఁ దమ యాజ్ఞలు తిన్నతిన్నగఁ జెల్లుబడి యగు చుండుటయుఁ దటస్థించుటవలన వారి కా విచారము లేక పోయెను. అంతకంతకుఁ జంద్రగుప్తుని బాధించుటకుఁ దగు నవకాశములు లభించు చుండుట వలనఁ బయింబయిగ వారి కొక విధ మగు నూతనోత్సాహము గూడఁ గలిగెను. ఇఁక నేమి కావలెను? చంద్రగుప్తుని బాధించుటయే వారికిఁ బదివేలు.

తొంటి వలెఁ గాక యిప్పుడు చంద్రగుప్తుని నిరంకుశప్రవర్తన కొకింత యడ్డంకులు కలుగఁ దొడఁగెను. సేవకులలోఁ గొందఱు బహిరంగముగ నాజ్ఞలను జవదాఁట సాగిరి. కోటయందలి కొన్నిస్థలములు త్రొక్కి చూడరా దని నిషేధము లేర్పడియెను. నందులు నిర్భయముగ నీచప్రసంబోధనములు సేయఁ గడఁగిరి. ఇంక నిట్టి వనేకములు సంభవించెను. చంద్రగుప్తుఁడు, నందుల యీర్ష్య యీ విధముగఁ బరిణమించెఁ నని గ్రహింపక పోలేదు. అతని "కింక వీరివలన నేమగు నని యుపేక్షించి యుండ రా" దని తోఁచెను. దాసీపుత్రుఁ డైనను జంద్రగుప్తుఁ డభిమానభూషితుఁ డగుటవలన నందులకుఁ బ్రతిఘటించి నిలువ సాగెను. ఈ రూపమున వారి యంతఃకలహములు మఱింత వృద్ధి నయ్యెను.

చంద్రగుప్తునకు నందుల వలన నొత్తిడి యెక్కుడు కాసాగెను. ఇఁకఁ బ్రబలప్రతిక్రియ సేయకున్న లాభము లే దని తలంచి, తన లోపము లేకుండ నాతఁడు, తనకుఁ గలిగిన యగచాట్లను దొలఁగింపు మని పద్మనందునితోఁ జెప్పి చూచెను; గాని దాని వలనఁ బ్రయోజనము గలుగ లేదు. వార్ధకముచేఁ గలిగిన మతివిభ్రమము వలననో, మఱి యే కారణమువలననో పద్మనందుఁ డప్పుడాతని నొకింత తిరస్కరించెను. చంద్రగుప్తుని మనస్సు మఱింత చివుక్కు మనియెను. ఈ తిరస్కార మాతని క్రోధాగ్ని కింధన మయ్యెను. వెంటనే యాతఁడు నందులను సంహరించి మగధసింహాసనము నాక్రమించుటయే యిందులకుఁ బ్రతిక్రియ యని భావించి యట్లు చేసి తీఱద వని దృఢప్రతిజ్ఞ గావించెను.)

దాసీపుత్రుఁ డగు చంద్రగుప్తునకు రాజ్యాశ గలిగినది. అందులకు మీరు నవ్వెదరేని మా యభ్యంతరము లేదు. కాని యాతని

రాజ్యతృష్ణ సామాన్య మైనది గాదు. "ఇదియే నేను చేయ వలసిన విధికృత్యము. ఇదియే నేను సాధింప వలసిన ఫలము. మగధసింహాసనారోహణమే నావంటివాఁడు కోరఁ దగినది" యని యాతఁడు నిశ్చయించుకొనియెను. అతఁ డే యాధారమును జూచికొని యిట్టిప్రతిజ్ఞ దాల్చెనో, దాని పరిణామ మెట్లు కానున్నదో మే మిప్పు డేమియుఁ జెప్పఁ జాలము; గాని మా కీ విషయమున వింత మాత్రము గలుగుట లేదు. తినఁ దిండియుఁ గట్ట గుడ్డయు లేని వారు మహారాజ్యాధిపత్యము దాల్చినట్లును, మహారాజులు కుండయుఁ గఱ్ఱయుఁ గొని బిచ్చ మెత్తికొనినట్లును చరిత్రలు సాక్ష్య మిచ్చుచున్నవి. చంద్రగుప్తుఁడు రా జేల కాఁ గూడదు?

తుద కెట్లు పరిణమించినను చంద్రగుప్తునకుఁ దలపెట్టిన కార్యము ప్రారంభించు దనుక నిద్రపట్టదు. ఎప్పుడో చేయ వచ్చునని యూరకున్న ముందే కార్య మడ్డువచ్చునో యనియు, నట్లే తీటక్షించె నే నప్పుడు రెండుకార్యములును గూడఁ జెడిపోవు ననియుఁ జంద్రగుప్తుని నమ్మకము. ఇట్లు యోచించుట నిజముగ దూరదర్శి లక్షణము. నేఁటి పని రేపటివఱకు నాపఁ గూడదు. ముం దెటుపోయి యెటు వచ్చునో యెరికినిఁ దెలియదు. ముందు చేయ వచ్చునని యేర్పఱుచుకొనినంతదనుక జీవించి యుండుదు మని చెప్ప నెరికినైతె గాదు. ప్రసక్త మైన కార్యమును సమయాంతరమునకు నిలుపుట కాపురుషలక్షణము. ఈ సిద్ధాంతము ననుసరించి చంద్రగుప్తుఁడు నందసంహారమున కుపాయములు పన్న సాగెను.

ఈ సమయమునందే ప్రజల హృదయముల యందు రాజద్వేషానలము తీవ్రముగ రవుల్కొనుచుండెను. ఇది చూచి చంద్రగుప్తుఁడు, తన ప్రయత్నమున కిది యొక శుభసూచక మని తలంచెను.

నందవినాశము దైవోద్దిష్టం బనియు, నందానంతరము మగధరాజ్య లక్ష్మి తన్ను వరించుటయు నట్టిద యనియు నాతఁడు నిశ్చయించు కొనియెను. మఱియు దేశమునఁ బ్రబలి యున్న యీ రాజద్వేషము ప్రాగదండనములవలన నుదితమై, దుర్నయసంస్కారమునే కోరు చున్న దనియు, వక్రుతిన మాగధులు నందసంహారమునకుఁ గేవలము తనకు సాయపడఁజాలరు గాని తన కడ్డు రా రనియుఁ దన యభ్యు దయము వారి కనిష్టము కాఁ జాల దనియుఁ గూడ గ్రహించెను. వెంటనే పని చేయ కున్న నీ యగ్ని చల్లారు ననియుఁ, బిదప ఫలా ఫలము లెట్లున్నను దన ప్రయత్నములు సాగుటయే కష్ట మనియుఁ గూడ నాతఁడు భావించుకొనియెను. వెంటనే తిన్నతిన్నగ నాతఁడు తన యాలోచనము నాచరణమునకుఁ దీసికొనివచ్చెను.

చంద్రగుప్తుని ప్రయత్నములను జూచి ప్రజ లనేకవిధములఁ జెప్పుకొన సాగిరి. నందుల వినాశమును, జంద్రగుప్తుని రాజ్యాభిషే కమును దైవోద్దిష్టము లని కొందఱు తలంచిరి. చంద్రగుప్తుని ప్రయ త్నములకు, నందులు బుద్ధి తెచ్చికొని దేశమున నెప్పటి శాంతిని నెలకొల్పుటయే ఫల మని కొంద ఱనుకొనిరి. క్షత్రియపాలితుల గు మనము దాసీపుత్రునిచేఁ బరిపాలింపఁ బడ వలసినదేనా? యని మఱికొందఱు సందేహించిరి. తుద కెట్లు జరిగినను ప్రస్తుతము దేశ మంతయు మందరఘూర్ణితసాగరము వోలె సంక్షుభితమై పోవు టయుఁ, బ్రజల బాధలు మఱింత వృద్ధియగుటయుఁ, దప్ప వని వేఱొక కొందఱు భావించిరి. విప్లవానంతరము మగధరాజ్యాధి పత్యము చంద్రగుప్తునకు సంక్రమించినను సంక్రమింప కున్నను ప్రభుత్వము మాఱుటకు సందేహము లే దని రాజ్యతంత్రజ్ఞులు స్థిరీక రించిరి. నందవినాశము జ్యోతిర్దర్పణమునఁ బ్రతిబింబితంబగు చున్న

యని సిద్ధాంతులు చెప్పిరి; గాని భావిప్రభు వెవఁడా యను ప్రశ్నకు మాత్ర మింకను బాగుగ నాలోచింపవలె ననిరి. చంద్రగుప్తుని ప్రయత్నము లన్నియు నందుల ప్రతీకారముకలన ఝుంఝూమారుతవిక్షేపముచే మాది పింజె లంధ్మాతము లగునట్లు పరాపంచలై పోవు నని మఱికొందఱు చెప్పిరి.

ప్రజ లనేకులు చంద్రగుప్తుని పక్షము నవలంబించిరి. అనేకు లనేకవిధముల నాతని యాజ్ఞలను చెల్లించిరి. ఈ రూపమున నీ ప్రయత్నప్రారంభమునందే చంద్రగుప్తుని యాజ్ఞలు ప్రజలలోఁ జెల్లి పోఁజొచ్చెను. ఎట్లో దేశమునఁ దీవ్రవిప్లవప్రయత్నములు జరుగు చున్న వని రాక్షసునకుఁ దెలియ వచ్చెను. వెంటనే యాతఁడు దాని యాథార్థ్యమును దెలిసికొనుటకును, దత్కర్తల నెఱుఁగుటకును గూఢచారులను నియమించెను.

చారులవలన రాజులకుఁ గలుగు ప్రయోజనము లనంతములు. రాష్ట్రము నందలి బాహ్యాంతరంగిక సమాచారము లన్నియు రాజునకు వారి మూలముననే తెలియును. వేతనము స్వల్పమే యైనను గౌరవమునందు భారత రాజ్యాంగ తంత్రము వీరి కున్నత స్థానము నొసంగు చున్నది. " రాజులు చారచక్షుష్కులు " లను మాటయం దీ యర్థము విస్పష్ట మగు చున్నది. రాజునకు, వీరు స్వామిద్రోహు లగుచోఁ గలుగు కీడునకును, స్వామిభక్తు లగు నెడల గలుగు మేలునకును మేర లేదు. అక్కారణమున దమయెడల నెల్లప్పుడును భక్తిప్రపత్తులు గలిగి యుండుటకు రాజులు చారులను సేవలమును మాసవేతనముల వలననే గాక యప్పుడప్పుడు బహుమానములచేఁ గూడ గౌరవించు చుండురు. ఈ బహుమతుల కాశించి చారులెట్టి సందర్భములయం దైనను, మిగుల ధైర్యముతోడను, సాహస

ములోదను, నతినిపుణముగఁ బని సేయుదురు. చారు లన్ని వేషములను వేయుదురు. వారి సాంకేతికము లత్యద్భుతములు. వారు నీటిలోఁ గూడ జాడలు తీయఁగలరు.

కోటలోఁ దన విషయమును గుఱించి రాజు మంత్రి మున్నగువారు చేయు చేష్టలను దెలిసికొనుటకుఁ జంద్రగుప్తుఁడు గూడఁ దనస్నేహితులను గొందఱను గూఢచారులుగా నేర్పఱిచెను. కాని చంద్రగుప్తుని చారులకును, రాజచారులకును జాలభేదమున్నది. ఇరువురును రహస్యముగఁ బ్రవర్తింపవలసిన వారే; గాని చంద్రగుప్తుని చారుల రహస్యము బయలుపడు నెడ నపాయము వాటిల్లును. రాజచారులకట్టి బాధలేదు. రాజాజ్ఞాకవచమువలన వారు సురక్షితులు.

వెంటనే వారు దేశ మెల్లయెడలను నతిరహస్యముగ దోషులను గాలించి వెదకసాగిరి. వారిని గికురించి తిరుగ నెవ్వారి తరము? ఆ దీర్ఘవిచారణమున వారు ప్రజలలోఁ గొందఱను, చంద్రగుప్తుని సహచరులను గొందఱను, నపరాధు లని యనుమానించి వారి వృత్తాంతము మహారాజునకు నివేదించిరి. వెంటనే వారి నందఱను రాజు సభలో విచారణ గావించి వారి వారికిఁ దగు నట్లు శిక్షించెను. ఇంతలోఁ జంద్రగుప్తుఁడుగూడ నీకుట్రలో నున్నాఁడని చారులకుఁ దెలియవచ్చెను. అతనిఁ గూడఁ బట్టుకొని రాజు విచారణఁ బ్రారంభించెను.

ఈ విచారణము చాలఁ దీవ్రముగ జరిగెను. ప్రశ్నలును బ్రత్యుత్తరములును జాలఁ దీవ్రముగనే యుండెను. అతనిపై నెట్టి నేరము మోపఁబడినదో, యా నేరము విచారణలో నెంతవఱకు స్థిరపడినదో చెప్పఁ జాలము; గాని నందుఁడు, చంద్రగుప్తుని మగధదేశము నుండి తక్షణము లేచిపోవలయు ననియు, మఱల దేశములో నెప్పుడును బ్రవేశింపఁ గూడ దనియు నాజ్ఞాపించెను.

పద్మనందుఁడు దేశాంతరవాసశిక్ష విధించినప్పుడు చంద్రగుప్తుఁడు తన భాగధేయమును జాల మెచ్చుకొనియెను. రాజపుత్రులు తనయెడల మిగుల నీర్ష్య వహించి యున్నారు. వృద్ధనందుఁడు వారి మాట ద్రోసివేయఁ జాల కున్నాఁడు. తాను గావించిన కృత్యము చాల సాహసమైనది. అగుటం జేసి రాజు తనకు మరణదండనము గాని యావజ్జీవకారాగారవాసశిక్ష గాని విధించిన నేమి చేయ వలసినదే మున్నది? అట్టి మహాపాయములు సంభవింప కుండుటకంటె నదృష్ట మేమి? మారువేసముతో నితరుల దేశములోఁ బ్రవేశించినఁ దన్నెవ రేమి సేయఁ గలరు? తన భావిప్రయత్నముల కిది యెంత శుభసూచకము! ఇట్టి శుభసూచన లొకటి వెనుక నొకటి పొడసూపుట వలనఁ జంద్రగుప్తునకుఁ దనవిజయమునందు నత్యంత దృఢవిశ్వాసము గలిగెను.

చంద్రగుప్తుని గురించి మహారాజు దాసీపుత్రుని వలన నేమి యనర్థము వాటిల్లఁగల దను తృణీకారభావముతో నుండి యుండెను. అయినను చంద్రగుప్తుఁడు రాజద్రోహులలోఁ జేరిన వాఁ డగుట వలన దేశమున, విశేషించి కోటలో నున్నచోఁ గొంతవఱకు బాహ్యక్షోభము నాంతరంగికక్షోభమును గూడఁ గలిగించుటకే మైన నవకాశము లుండునేమో యను తలంపుతో నాతనికి దేశాంతరవాసశిక్ష విధించియుండెను. రాక్షసుఁడు గూడ నట్లే భావించి యుండెను. రాజు నధికానురాగమును బడసి యున్న చంద్రగుప్తుని జనని మురశూద్రజాతిస్త్రీ యగుట, ధనమునందలి కాంక్షచేఁ దనకుమారునకు సంభవించిన యీ స్వల్పశిక్షకు మిగుల వగచి క్రమముగ రాజానుగ్రహమును బడయఁ గోరి తనకుమారునకు బుద్ధులు గఱపి ద్రోహచింతను మానిపింపఁ గల దని గూడ వారు భావించి యుండిరి.

ఏమైనను జంద్రగుప్తున కీ స్వల్పశిక్ష విధించుటలో నా రాజ్యతంత్ర ధురీణులకుఁ గల భావ మేమో మేము స్పష్టముగఁ దెలుపఁజాలము.

ఏది యె ట్లయినను జంద్రగుప్తునకు మగధదేశమును విడిచిపెట్టి పోవుట కిష్టములేకపోయెను. ఈ శిక్షవలన "నందసంహార మవశ్యము చేయ వలయు" ననునాతని సంకల్పము మఱింత బలపడుటయే తటస్థించెను. వివేకమతి యగు ముర, రాజు నాగ్రహము నాతని యవివేకకృత్యమును గాంచితి వని చంద్రగుప్తు నేమైన నిందించెనో, యాతని యుద్యోగకారణములను జక్కఁగ గుఱుతెఱింగి, మగధదేశ మునఁ దన యాజ్ఞ నిర్వ్యాజ్ఞగాఁ జెల్లించిన రాజుపైఁ గత్తి కట్టు మని ప్రోత్సాహపఱిచెనో తెలియదు; గాని చంద్రగుప్తుఁ డొరుల దూషణభూషణములను లెక్కసేయు వాఁడు మాత్రము కాఁడు. అక్కతన నాతఁడు రాజభటుల కన్నుల దుమ్ముగొట్టి తనతల్లితోఁ గూడఁ బాటలీపుత్రమునందే యొక రహస్యస్థలమున మాఱువేసము తో నివసించి యుండెను. ముర సంపాదించిన యమితధన మంతయు నాతని చెంతనే యుండెను.

ఈ కల్లోలసమయమున నొకనాఁ డొకరాజభవనమున ననేక పౌరులు గూడి యుండిరి. ఆ సభయం దొక బ్రాహ్మణుఁడు చక్కని యుపన్యాసము గావించుచుండెను. ఆ యొక బ్రాహ్మ ణుఁ డగ్రాసనమున నతిగంభీరముగఁ గూర్చుండి యుండెను. అతని విశాలవదనమండలము, నాతని బలిష్ఠశరీరము నాతఁ డొక మహా పండితుఁ డనియు, నధిక తేజస్వి యనియుఁ జాటుచుండెను. అతని పేరు విష్ణుగుప్తుఁడు. చణకనందనుం డగుటఁ జాణక్యుఁ డనియుఁ బేరు గలదు. ప్రజ లెల్లరు నాతనినిఁ జాణక్యుఁ డనియే పిలుచు చుందురు. ఆతఁడు చతుర్వేదపారగుఁడు; షట్ఛాస్త్రవిదుఁడు;

దండనీతియం దనుపమానపండితుఁడు; కుటిలోపాయముల యం దతిచతురుఁడు; ముక్కోపి; పట్టిన పట్టు వీడని శూరశిఖామణి; మహాపరాక్రమశాలి; చక్కని సమయస్ఫూర్తియు, నెట్టికార్యముల నైన ననాయాసముగ నెఱవేర్పఁ గల సామర్థ్యమును, నగ్నినైనఁ బిడికిటఁ బట్టు నంతటి సాహసమును గల నిర్భీకచిత్తుఁడు.

ఈ సమయమున రాక్షసామాత్యసహితులై నందు లటకుఁ జనుదెంచిరి. వారి గౌరవార్థము ప్రజలు లేచి నిలువంబడిరి. ఉపన్యాసకుఁ డొక్క క్షణ మూరకుండెను; గాని యగ్రాసనాసీనుఁ డై యున్న చాణక్యుఁడు లేవ లేదు. సభలయం దగ్రాసనాధిపత్యము వహించు వారి కట్టి యధికారము గలదో, లేక యతఁడు నందుల లెక్క యేమి యని భావించెనో తెలియదు. పయింబయిగ నధరస్పంద మైనఁ జేయ లేదు. అపాంగనిరీక్షణములతో నైన స్వాగత మిచ్చుటగాని, కూర్చుండుఁ డని సన్న గాని చేయ లేదు. అతిగంభీరముగ నట్లే కూర్చుండి యుపన్యాసము సాగింపు మని వక్తకుఁ గన్ను గీటెను. వెంటనే యాబ్రాహ్మణుఁడు మేఘగంభీరభాషణములతో నుపన్యాసమును బ్రారంభించెను.

నందు లిది యంతయుఁ జూచి చాణక్యుఁడు తమ్మగౌరవించె నని భావించిరి. వారి కనుబొమలు ముడివడెను. మొగము లెఱ్ఱఁబాఱెను. అంత వారు రాక్షసుఁ డెంత సన్న చేయుచుండినను పాటింపక, కూడ నున్న రాజబంధువు లెంత బతిమాలు చున్నను వినక యత్యుత్కటం బగు కోపభరమ్మున నాబ్రాహ్మణునిఁ గ్రింది కీడ్చి వేయుఁ డని భటుల కాజ్ఞాపించిరి. ఆజ్ఞావచన మింకను ముగియక మున్నే భటు లగ్రాసనమును సమీపించిరి. ఉపన్యాసనిమగ్న

హృదయుం డగుటఁ జాణక్యుఁ డిది యేమియు నెఱుఁగఁడు. అట్టి వానిని రాజభటు లగ్రాసనమునుండి హఠాత్తుగఁ గ్రిందికి లాగివైచిరి.

ఆ లాగుటలోఁ జాణక్యుని జుట్టుముడి విడి పోయెను. అంతఁ జాణక్యుఁ డులికిపడి లేచి క్రోధాగ్నికీలావిస్ఫులింగమ్ము లెగయఁ బండ్లు పటపటఁ గొఱుకుచు "ఓ నందాధములారా! నన్ని ట్లగ్రాసనము నుండి లాగి యగౌరవపఱిచి నందులకు, మిమ్ము నిట్లే సింహాసనము నుండి లాగి, విశేషించి శిరఃకర్తనము గావించు నంత దనుక నీ జుట్టును ముడువ నని కాలరుద్రుని వలె గర్జించి పలికి యా సభాస్థానమును విడిచి పోయెను. రాక్షసుఁడును, మఱి కొందఱు దగ్గఱి వారు నెన్ని చెప్పినను నందు లాతని కోపానలమును జల్లార్పఁ బ్రయత్నింప రైరి. విశేషించి వారి కీ బీదబ్రాహ్మణుని వలన నేమగు నని తిరస్కారభావమును బ్రకటించి యూరకుండిరి.

చాణక్యప్రభావము రాక్షసునకుఁ దెలిసినదె. అక్కటతన వాతఁడు, నందులు చాణక్యు నగౌరవపఱిచినందులకుఁ జాలఁ జింతించెను. ఇట్టి కల్లోలసమయమునఁ జాణక్యుని వంటి మహాతేజస్వితోఁ గలహము దెచ్చికొనుట నందులకుఁ జాలనష్టము. ఎంత చెప్పినను వారు వినని యప్పు డిఁక రాక్షసుఁ డేమి సేయఁ గలఁడు?.

అంత యుండియు నందులు చాణక్యుని ఘనతను గ్రహింప లేక పోవు టాశ్చర్యకరము. రాక్షసామాత్యుని బోధనల వలన నైన గ్రహింప లేక పోవుట చింత్యము. కొలఁది దినములనుండి వారు చేయుచున్న వన్నియుఁ గ్రూరకృత్యములే యగుట శోచనీయము. ప్రజల యెడల వారికి విపరీతబుద్ధులు పుట్టుట విచారకరము. ఇ వన్నియుఁ జూచిన తత్త్వజ్ఞులు బలీయ మగు నీశ్వరాజ్ఞచేఁ బ్రేరి

తులై, నందులు, కాలవాహినిం బడి వినాశసాగరమున కళిముఖులై పోవు చున్నా రని తలంపఁ జొచ్చిరి.

నాఁటి సభ యంతయు నీ విధముగ విచ్ఛిన్నమై పోయెను. పౌరులలో నప్పుడనేకుల కనేకభావన లుప్పతిల్లెను. మొత్తము మీఁదఁ బ్రజల కెల్లరకును హృదయావేదనం బధికం బయ్యెను. ఒక క్షణము కంటె మఱియొక క్షణము వారికిఁ బ్రబలాపాయశంకలు వృద్ధమఁ జొచ్చెను. నందుల కృత్యమునకు వక్త కూడఁ జాలఁ గోపపడియెను. ఉపన్యాసము సాంతము గాక పోవుటచే వక్తయుఁ జాణక్యుఁడును గూడ సంతకు మున్ను ప్రజాపక్షము వారో, రాజపక్షము వారో చెప్పుట కైతి గాదు. తుట్టతుదకుఁ బ్రభువునకుఁ బ్రజాద్వేషమును, బ్రజలకు రాజద్వేషమును గలుగుట పరస్పర వినాశకారణ మని చెప్పుచు నావక్త సభనుండి వెడలి పోయెను. నందులు తాము చేసిన పనికి గర్వపడుచు వెడలిపోయిరి. ప్రజాప్రముఖు లనేకవిధములఁ జెప్పుకొనుచు స్వస్థానోన్ముఖు లైరి. క్షణములో నా స్థల మంతయు నిర్జన మయ్యెను. ఈ వార్త గూడ నిముసములోఁ బట్టణ మంతయు వ్యాపించెను. నాఁడు పౌరుల కాలక్షేపమున కెల్ల నీ వృత్తాంతమే యాధార మయ్యెను.

నాఁడు చంద్రగుప్తుఁడు మాఱు వేసముతో నా సభయందే యుండెను. ఆతఁ డప్పు డచ్చట జరిగిన వ్యాపార మంతయుఁ జూచి మిగుల నానందించెను. ఆతఁడు చాణక్యుని ప్రభావము సంతకు ముందే విని యుండెను; గాని విశేషించి చాణక్యుఁడు సభాప్రారంభమునఁ జేసిన ప్రసంగమువలన నాతని సామర్థ్యమును స్వయముగఁ దెలిసికొనియెను. ఆ క్షణము మొదలుకొని యాతఁ "డీ మహానుభావుఁడు నాయెడల నెట్లు ప్రసన్నుఁ డగు" నని యోచింపసాగెను.

చాణక్యుని నందులు తమ పక్షమునకుఁ ద్రిప్పికొనక మానరనియు, నట్లయిన నందసంహారము తనకుఁ జాల దుష్కరమై పోవు ననియు, నాతఁడు చింతించెను. నందులు సభకు వచ్చినప్పు డీ చింత మఱింత పెరిఁగెను; గాని వారు చాణక్యునిఁ బరాభవించినతోడనే యాతని మనస్సు కుదుటఁ బడియెను. నందసంహార మిఁకఁ దప్పదని యాతఁడు నిశ్చయించుకొనియెను. అప్పు డాతనికి మగధరాజ్యాధిపత్య మబ్బి నంత యానంద ముప్పతిల్లెను. ఆ మహితానందములో నాతఁడు, చాణక్యుఁడు భీకరశపథమును బట్టి సభను విడిచి పోయిన వెంటనే యాతని వెనువెంట బయలుదేఱెను. అయిన నతికోపభరమ్మున వెనుతిరిగి చూడకుండఁ బోవుచుండుటవలనఁ జాణక్యుఁడు చంద్ర గుప్తునిఁ జూడ లేదు. చాణక్యుఁడు ముందును, జంద్రగుప్తుఁ డాతని ననుసరించి వెనుకను బోవుచుండిరి.

కొన్ని నిముసములకు వారు పాటలీపుత్రనగరమును దాఁటి సాంద్ర మగు నొక తోఁటలోఁ బ్రవేశించిరి. అప్పటికినిఁ జాణ క్యుఁడు వెనుదిరిగి చూడలేదు. జుట్టు నట్లే విరియఁబోసికొని రూపొందిన కోపదేవత వలె నతిరభసమున ముందునకుఁ బోవుచునే యుండెను. అప్పు డిఁక నిట్లూరక నడచుచుఁ బోవుట వలనఁ బ్రయోజనము లేదని తలంచి చంద్రగుప్తుఁ డతిరయమ్మున ముందున కరిగి "మహాత్మా! నందవిద్వేషి చంద్రగుప్తుఁ డభివాదనము సేయు చున్నా" డని చాణక్యుని పదకమలముల నంటెను.

చాణక్యుఁ డులికిపడి చంద్రగుప్తునిఁ జూచెను. "నందవిద్వేషి" యనుటచే నాతఁ డీ యువకునివలనఁ గొన్ని యవసరము లైన సంగ తులు తెలిసికొన వచ్చు నని యూహించి చంద్రగుప్తునిఁ బ్రియముతో లేవనెత్తి నీ వృత్తాంత మంతయుఁ జెప్పు మని యడిగెను. వెంటనే

చంద్రగుప్తుఁడు "కోటలోఁ బాగా వేసితి" వని సంతసించి తన వృత్తాంతము నామూలాగ్రముగఁ జాణక్యునకు విన్నవించి శరణము వేఁడెను.

చంద్రగుప్తుని వృత్తాంత మంతయు విని చాణక్యుఁ డాతని ప్రయత్నమునకుఁ జాల మెచ్చుకొనియెను. మఱియు, నాతని ముఖము వంక గంభీరముగఁ దిలకించి యా యనంతదివ్యతేజస్సును గ్రహించి, నందానంతరము మగధరాజ్యాధికార మీ యువకునకు సంక్రమించుట నిశ్చయ మని భావించి, మగధసింహాసనముపై నీ దాసీపుత్రునిఁ గూర్చుండఁ బెట్టుట నందులకు మఱింత పరాభవకారణ మని నిశ్చయించి, నందోన్మూలనదీక్షాపరతంత్రుఁ డగు నీయువకుని తోడ్పాటు వలన నందసంహార మశ్రమముగ నెఱవేఱఁ గల దని యూహించి, పిదప మగధరాజ్యలక్ష్మి నీ ప్రతాపమూర్తి వక్షఃపీఠముపై నభిషిక్తం జేయుట శ్రేయస్కర మని చింతించి, యీ నవసాహసాంకుఁడు సన్నిధానమున నున్నచోఁ దన శపథ మెంతమాత్రమును విస్మృతము కాక యతిశీఘ్రకాలములో నెఱవేఱుట కవకాశము కలుగు నని తలంచి, రాజ్యతంత్రధురీణుం డగు నా పేదబాపనయ్య చంద్రగుప్తునకు "మగధరాజ్యమును నీకుఁ బట్టము గట్టెద" నని వాగ్దానము గావించి యాతని వెంటఁ గొనిపోయెను.

చంద్రగుప్తునకుఁ జాణక్యుఁడు తోడగుట యగ్గికి గాలి తోడైన ట్లయ్యెను. చంద్రగుప్తుఁడు మంత్రాంగము విషయమున నందులకుఁ బైచేయి యయ్యెను. ఇఁక వరూధిని గావలెను. చంద్రగుప్తునకిఁక దానిని సంపాదించుట యంత కష్టములోనిది గాదు. ఇఁక నిరువాఁగులును దలపడుట కెంతో కాలము పట్టదు. నారదుని వంటివారెవ రైన నున్నచో వారికీ సమయము కంటెఁ బండువు లేదు.

నాఁ డట్లు చాణక్యచంద్రగుప్తు లెచ్చట కరిగిరో, యే మేమి యాలోచించికొనిరో తెలియదు; గాని యే కారణము వలననో చంద్రగుప్తుఁడు మగధను వీడి పాంచాలదేశమునకుఁ బోయెను.

మగధదేశ మిట్టి కలతలతో నిండియున్న సమయమునఁ బాంచాలము మఱింత దుస్థితియం దుండెను. అక్కడి రాజు లెల్లరు నంతఃకలహములలోఁ బడి మునిఁగిపోయి, వీలయి నప్పు డెల్ల నొకరి నొక రోడించుకొనుచుండిరి. ఈ సంగతి యంతయుం దెలిసికొని, ప్రపంచ మంతయు జయింప వలయు నని బయలుదేఱిన యలెగ్జాండరను గ్రీసుదేశపురాజు భారతదేశమునఁ బ్రవేశించి తొలుదొల్తఁ దన దృక్పథమునఁ బడిన పాంచాలమును జయింపఁ బ్రయత్నించెను. పాంచాలమునందలి రాజులలోఁ గొందఱాతని పక్షము వహించిరి. భారతీయుల సాహాయ్యము వలన నా గ్రీకువీరుఁడు పాంచాలమునందలి చాల భాగమును జయించెను.

అప్పుడు పాంచాలమునఁ బురుషోత్తముఁ డను రాజొకఁ డుండెను. అతఁడు ప్రకృతము జేల మనఁబడు వితస్థానది వద్దఁ బ్రచండ మగు తన చతురంగబలముతో నలెగ్జాండరు నెదిరించెను. ఇరుతెగలవారికిని బోరు ఘోరముగ జరిగెను. కాని యెంత పోరినను బురుషోత్తమునకు లాభము లేక పోయెను. తక్షశిలారాజులు గ్రీకుల పక్షమునఁ బోరుటవలనను, దన రథములు నదియొడ్డున బురదలో దిగఁబడిపోవుటవలనను, మదపుటేనుఁగులు తిరుగఁబడి స్వసైన్యమునే నాశము సేయుటవలనను, విశేషించి గ్రీకుదండు సంఖ్యాధికమై యుండుటవలనను బురుషోత్తమునకే యపజయము వాటిల్లెను. పాంచాలదేశ మలకసుందరుని వశ మయ్యెను.

అపుడు పాంచాలము నందే యున్న చంద్రగుప్తుఁ డీది యంతయుఁ జూచి చాల వగచెను. తక్షశిలా రాజులపైఁ జాల నాగ్రహము గాంచెను. వీరస్వర్గము నలంకరించిన పురుషోత్తమునిఁ జాల మెచ్చుకొనియెను. ఏ దెసఁ దిలకించిన నాతనికిఁ బాంచాలమునం దంతటను గ్రీకుపతాకములే కాన్పింపసాగెను. అక్కతన నాతని హృదయమున ననంతక్రోధాగ్ని ప్రధూమిత మయ్యెను. పాంచాలము నుద్ధరింప బుద్ధి పుట్టెను. వెంటనే యాతఁడు తన వంత నున్న యమితధనముతో నొక ప్రచండసైన్యమును నిర్మించెను. ఈ సందర్భమున నాతఁ డెప్పుడో యొకప్పు డలకసుందరునిఁ గాంచె నని వదంతి కలదు.

పాంచాల మింత సులభముగ వశ్య మగుట వలనఁ దన యేఁబదివేలసైన్యముతో భారతవర్షము నంతను జయింప నెంచి యలకసుందరుఁడు ముందునకు సాగఁ బ్రయత్నించెను; గాని గంగాతీరమునఁ బ్రచండమైన వరూధినియొకటి యున్నదని విని యడలియు, నీదేశపుటుష్ణమునకుఁ దాళఁ జాలకయు, నాతని వీరభటులు తమ యసమ్మతినిఁ దెలిపి, యజమానుఁ డెంతకును వినకుండునఁ దిరుగఁబడిరి. కొందఱు పాంచాలు రెదిరించిరి. ఇన్ని కారణముల వలన నలెగ్జాండరు శతద్రూనదిని గాని యమునానదిని గాని దాఁటకయే వచ్చిన దారిఁ బట్టి స్వదేశమునకుఁ బోయెను. పోవుచుఁ బోవుచు నాతఁడు పాంచాలమునందుఁ దన యధీనమున నున్న రాజ్యములను బరిపాలించుటకుఁ బ్రతినిధుల నేర్పఱిచెను. స్వదేశమునకుఁ బోయిన వెంటనే యాతఁడు మృతి నందినందున భారతదేశమునందలి యాతని రాజ్యము సెల్యూకసను వానికి సంక్రమించెను.

ఇంతలోఁ జంద్రగుప్తుని సేనానిర్మాణము పూర్తి యయ్యెను. పాంచాలమునందలి కొందఱు రాజులాతనికి సహాయపడిరి. ఉభయుల సేనలు గలిసి యొక ప్రచండసైన్య మయ్యెను. ఆ సేన నంతను దగునట్లు విభాగించి, తత్తద్భాగములకు వివేకభూషితులును, ప్రతాపమహితులు నగు వారి నధిపతులుగఁ జేసి తాను సర్వసేనాధిపత్యము వహించి చంద్రగుప్తుఁడు గ్రీకుసేనను దాఁకెను.

విజయగర్వమువలనఁ గ్రిందుమీఁదు నెఱుంగని గ్రీకురాజు సెల్యూకసీ యుదంతము నాలకించి ప్రగల్భతాసూచకముగ మందహాసము గావించి, మహాట్టహాసముతో భారతవీరుల నెదిరించి నిలిచెను. పోరు ఘోర మయ్యెను. సెల్యూకసునకు భారతసైనికులు నిస్తేజులు గారని బోధపడియెను. కొంతకాలమునకు గ్రీకులకు భారతవీరులతోడి పోరాట మాటగాదని తెలియవచ్చెను. మఱికొంత తడవునకు మన మింక గెలువలేమను సంశయము దోఁచెను. దినములు గడచిన కొలఁది గ్రీకుసేన క్షీణింప సాగెను. అంత వారి మనస్సుల యందు భయము ప్రవేశించెను. ఎట్టి సమయముల యందైన హృదయమున భయమునకు రవంత స్థల మొసంగిన మానవుఁ డింకఁ బనికిరాఁడు. కొన్ని గడియలలో గ్రీకువీరుల హృదయకుహరములు భయప్రపూరితము లైపోయెను. ఆ యమితోత్సాహము మటుమాయ మైపోయెను. ప్రళయాగ్నిఁ బోలు నా శౌర్యాగ్ని చల్లారిపోయెను. వెంటనే గ్రీకువీరులు కదనరంగమును విడిచి భరతవర్షపు సరిహద్దులను దాఁటి పలాయనము స్వీకరించిరి. పాంచాల రాజ్యలక్ష్మి చంద్రగుప్తుని బాహుబంధమునఁ గులుకఁ జొచ్చెను.

ఇంతలోఁ "పాంచాలము నందలి నీ యభివృద్ధికిఁ జాల సంతసించితి ననియు, నిచ్చట నేను గావించిన నందవధోపాయము లన్ని

యుూ ఫలోన్ముఖములై యున్న వనియు, నీవు త్వరితగతిం జేర్చిన సేనను, నీకు సాయపడు సైన్యమును వెంట నిడికొని మగధరాజ్య లక్ష్మినింగూడ వరించుటకు శీఘ్రముగా రావలసినదనియుం జాణక్యో పాధ్యాయుని చెంగటనుండి చంద్రగుప్తునకు సందేశము వచ్చెను. అది చూచి చంద్రగుప్తుఁడు చాణక్యుని నందనిర్మూలనవిషయికం బగు దృఢదీక్షకును, దన మీఁది యఖండానురాగమునకును మిగుల సంతసించి యఖండమైన సైన్యముతోఁ గూడి మగధదేశము ముట్టడింప జయజయధ్వాన ములును, భేరీభాంకరణంబులును దిక్కటాహములు బ్రద్దలు సేయ మహావైభవముతో బయలుదేరెను.

చాణక్యున కిందుశర్మ యను నొక సహాధ్యాయుం డుండెను. అతఁడు శుక్రనీతి యందును, జ్యోతిశ్శాస్త్రము నందు నఖండమైన వైదుష్యము గలవాఁడు. చంద్రగుప్తుఁడు పాంచాలమున కరుగక పూర్వ మతనినిం జాణక్యుఁ డిందుశర్మయనుగ్రహమునకుఁ బాత్రునిం గావించి "నందసంహారప్రయత్నమున సాయపడెద" నని యిందు శర్మచే నభయము గూడ నిప్పించెను. పిదప నిందుశర్మ క్షపణకవేష మును దాల్చి రాక్షసాదులకుఁ దనపై ననుగ్రహము పొడమునట్లు చేసికొని వివేకమహితులును, గిరిధీరులు నగు శిష్యులను గుప్తచా రులుగా నియమించుకొని వారి పరముగా నందరహస్యములు చాణ క్యున కెఱుక సేయుచు, దేశకాలపాత్రములకుఁ దగు నట్లు ప్రవర్తిం చుచుఁ జంద్రగుప్తునకుఁ దోడ్పడ సాగెను.

తక్షశిలానగరనాయకుం డగు పర్వతరాజు మగధరాజ్యము నాక్రమింప వలెనను తలంపుతో సమయమునకు వేచి యుండెను. చాణక్యప్రతిజ్ఞలను విని మగధరాజ్యసంపాదనమున కిదియ యదు వని తలంచి జైత్రప్రస్థానమునకుఁ దగు ప్రయత్నములను గావింప

పోగెను. చారులవలన నిది యంతయుఁ దెలిసికొని చాణక్యుఁడు పర్వతరాజు చెంత కరిగి తన ధ్యానికఁ దెలియఁ జెప్పెను. పరులను వంచించుటయం దారితేరిన పర్వతకుఁడు చాణక్యున కేమియుఁ బ్రత్యుత్తర మీయకుండెను. చాణక్యుఁడా యీ మోసమునకు గురి యగువాఁడు? ఆఁతఁడు పర్వతకుని యాలోచనల నూహించికొని యతని సంశయములు నశించునట్లు దగిన మంత్రతంత్రము లన్నియుఁ బన్ని మెప్పించి నందరాజ్యమునం దర్ధరాజ్య మిచ్చునట్లు లొప్పి కొని యాతని లోఁబఱచికొనియెను. వెంటనే పర్వతకుఁడు తనకు సాయముగ శకయవనకిరాతకాంభోజపారసీక బాహ్లీక రాజప్రభృతు లను ససైన్యముగ వెంటఁ బెట్టుకొని యుద్ధమునకు బయలుదేరెను.

ఇంతలోఁ బాంచాలమునుండి చంద్రగుప్తుఁడు తన యఖండ చతురంగబలమును గూర్చుకొని వచ్చి చేరెను. గురుశిష్యు లిరువురును దమతమ యాలోచనలను దెలిపికొని కర్తవ్యమును నిర్ణయించిరి. చాణక్యుఁడు చంద్రగుప్తుని ప్రయోగకౌశల్యమును జాల మెచ్చుకొని యెను. పిదప నిరువురును గలిసి సైన్యమును రెండు భాగములుగా విడఁదీసిరి. ఒక భాగము గండకీనదీప్రాంతము సేరి పాటలీపుత్రమును ముట్టడింపఁ బోయెను. రెండవ భాగము పర్వతకుని యాధిపత్యము క్రింద గంగాశోణాసంగమము దెసకు బయలుదేరెను.

చారుల ముఖంబున నిది యంతయుఁ దెలిసికొని రాక్షసుఁడు తగు కట్టుదిట్టము లన్నియుఁ గావించి నందసమేతుఁడై, మహాసైన్య ముతో సరయూసంగమున శత్రువుల రాకకుఁ బ్రతీక్షించుచుండెను. చాణక్యసహాధ్యాయుఁ డిప్పు డూరకుండెనా? అతఁడు చంద్రగుప్తున కీ యుద్ధమున విలాసమాత్రమున జయము గలిగింపఁ దలఁచి ప్రబల

కుతంత్రములను బన్ని రాక్షసుని కంట దుమ్ముగొట్టి నందులను విడఁదీసి చాణక్యుని వలయందుఁ దగులఁబడు నట్లు చేసెను.

యుక్తసమయమున నిరువాగుల వారును దలపడిరి. రాక్షస బలగర్వితులై నందు లీయుద్ధము నాటగా భావించిరి. ఒక బీద బాపని యాలోచన ననుసరించి, దాసీపుత్త్రుని సాయముఁ జూచికొని దండెత్తివచ్చిన పర్వతకుని వారతిలాఘవముగఁ జూచిరి; గాని వా రనుకొన్నట్లు పరబల మంత నిర్వీర్యము గాదు. క్షత్త్రియుఁ గ్షత్త్రియుఁ గలిపిన పిదప వారి యాటలు సాగినవి గావు. చంద్రగుప్తుని ప్రతాపాలనము దుస్సహ మయ్యెను. చేతనైనంత వఱకును బోరి తుదకు నందపుత్రులు వీరస్వర్గమును జూఱగొనిరి. "నందనివాళి వృత్తాంతము సేనలయందుఁ బర్వఁగనే పర్వతరాజు బలముల కుత్సాహాధిక్యమును, పాటలి బలములకు దైన్యాధిక్యమును, రాక్షసునకు శోకవిహ్వలతయు నుప్పతిల్లె." అంత రాక్షసుఁ డిఁకఁ బోరుటవలన లాభము లేదని గ్రహించి, మాయచే శత్రువులను జయింప నెంచి, నందకులమును నిలుప దలఁపున వృద్ధనందునిఁ బురమునుండి దాఁటించి ప్రాణత్రాణ పరాయణుఁడై యుద్ధరంగమునుండి తొలఁగి పోయెను.

చంద్రగుప్తునకు విజయలాభము గలిగెను. చాణక్యశపథములలో మొదటి దగు నందసంహారము నెఱవేఱెను. వృద్ధనందుఁడు జీవన్మృతుఁ డయ్యెను. రాక్షసుఁడు పరాజితుఁ డయ్యెను. ఇంక నెందు నెదురాడువారు లేరు. అయినను జాణక్యుఁడు, నాఁటిరాత్రి చంద్రగుప్తుని పాటలీపుత్రప్రవేశమున కంగీకరింప లేదు. పరాజితుఁడైనను రాక్షసుఁ డతిప్రతిభాశాలి; స్వామిభక్తిభూషితుఁడు; సకల మాయోపాయవిశారదుఁడు. అక్కతనఁ జంద్రగుప్తుఁడు యుద్ధరంగమునందలి తన శిబిరమునందే విశ్రమించెను. చాణక్యుఁడు చంద్ర

గుప్తపట్టాభిషేకమును గుఱించి యోచింపఁ దొడఁగెను. వీరభటు లత్యుత్సాహములతో నాటపాటలయందుఁ బ్రవృత్తులైరి.

రాక్షసుఁడు వంచనోద్యుక్తుఁ డయ్యెను. అతఁడు పిన్ననాఁటి నుండియు నొక యాఁడుపిల్లను బెంచుచుఁ, జిన్నచిన్న మాత్రలతోఁ బ్రారంభించి జీర్ణ మగున ట్లేర్పాటులు గావించి యా పిల్లచే విషము తినిపించుచుండెను. అది యిప్పుడు నవమోహనాంగి యై యుండెను. ఆ పిల్ల మూలమునఁ దన ప్రయత్నమును నెగ్గించుకొనఁ దలంచి జీవసిద్ధి యను పేర క్షపణకవేషముతోఁ దన్నాశ్రయించి యున్న చాణక్యసహాధ్యాయి యగు నిందుశర్మను బిలిచి యాతని ననేకవిధములఁ బెద్దచేసి పొగడి, యా విషకన్యను జూపి, కుమారప్రణయసూచకముగఁ జంద్రగుప్తునకు సమర్పించి రమ్మని చెప్పెను. జీవసిద్ధియు వల్లె యని యంగీకరించి చాణక్యుని చెంత కరిగి సంగతిసందర్భము లన్నియుఁ దెలిపెను. అది విని చాణక్యుఁడు రాక్షసుని బుద్ధికుశలతకు మెచ్చుకొని యా కన్యను బర్వతకునకు సమర్పించి రమ్మని జీవసిద్ధికి నియమింప నతఁ డట్లు గావించెను. అది చూచి పర్వతకుఁడు స్త్రీలంపటుం డగుట రాక్షసునిఁ జాలఁ బొగడి యాతని యపరాధములు మన్నించితి నని యభయ మొసంగి యా కన్యను స్వీకరించెను; గాని వెంటనే విషము తల కెక్కి మృతినొందెను. ఇట్లు చాణక్యుఁడు రాక్షసుని వంచించుటయును జంద్రగుప్తుని రక్షించుటయును గాక మగధరాజ్యమున నర్ధభాగమును గోరకుండఁ బర్వతేశ్వరునిఁ జాతుర్యముతోఁ దుద ముట్టించెను.

పర్వతకుఁడు మృతి నొందినను వాతని పుత్రుఁడు మలయకేతు వుండెను. అతని భయభ్రాంతునిఁ జేసి పలాయనము గావింపఁ జేయఁ దలఁచి చాణక్యుఁడు సేనాధిపతి భాగురాయణునిఁ

బలికొల్పెను. వెంటనే భాగురాయణుఁడు, మలయకేతువునుఁ జేరి "నీ తండ్రినిఁ జంపినవాఁడు చాణక్యుఁడు. ఇంక నిచ్చటనే యున్న నిన్నుఁ గూడ నంత మొందింపక మానఁడు. నాకుఁ జాణక్యచంద్రగుప్తులయెడ భక్తి లేదు. నన్నుఁ బోషించితి వేని నిన్నుఁ గొలిచెద" యని చెప్పెను. అది వినుటతోడనే మలయకేతువునకు మీఁది ప్రాణములు మీఁదనే యెగిరి పోయెను. వెంటనే యాతఁడు భాగురాయణుని వెంట నిడికొని యూర్ధ్వశ్వాసముతోఁ దన నగరునకుఁ బోయి భాగురాయణునకు మంత్రిపదవి నొసఁగి తండ్రినిఁ జంపిన పగఁ దీర్చికొన నెదురు చూచుచుండెను.

మలయకేతువు పాఱిపోయిన పిదపఁ జాణక్యుఁడు మహావైభవముతో జయఘోషము లుప్పతిల్లఁ జంద్రగుప్తునిఁ బురప్రవేశము చేయించెను. ఇంతకుఁ బూర్వము చంద్రగుప్తుని రూపుమాపుటకు రాక్షసుఁడు చేసిన ప్రయత్నము లనంతములు. సూత్రధారుఁడగు దారువర్మతో, రాజభవనద్వారములను గనకతోరణములతో నలంకరించి యందలిరహస్యముగ నొక యంత్రము నునిచి చంద్రగుప్తుఁడు ద్వారప్రవేశము సేయునపు డది యాతని నెత్తిపైఁ బడునట్లు సడలించి చంద్రగుప్తునిఁ జంపు మని చెప్పెను. సమయము చూచి కనకదండమున నమర్చిన కటారి దూసి చంద్రగుప్తునిఁ బొడువ భద్రగజమునకు మావటికాఁడగు బర్బరకు నాజ్ఞాపించెను. రాజవైద్యుఁడగు నభయదత్తునితో విషమిళిత మగు నౌషధ మిచ్చి చంద్రగుప్తునిఁ గడతేర్పు మని చెప్పెను. మైమఱచి నిద్రించు తఱిఁ గత్తితోఁ బొడిచి చంపు మని రాజశయనాధికారి యగు ప్రమోదకుని నియమించెను. మఱియుఁ జంద్రగుప్తునిఁ బ్రహరింప రాజభవనాంతర్భిత్తిసురంగము నందు బీభత్సకాది ఘాతుకసమూహము నుంచెను.

ఇంక నిట్టి యనేక మాయోపాయములను బన్నెను; గాని చాణక్యుని యెదుట నవి యేవియు నిలిచినవి కావు. అన్నియు నిరర్థకములై పోయెను. చంద్రగుప్తుఁడు నిరపాయుఁడై నిష్కళంకచంద్రుని వలెఁ బ్రకాశించెను. అటు పిమ్మటఁ జాణక్యుఁడు, రాక్షసప్రోత్సాహంబున సురంగమార్గము నుండి పురము వెలువడిపోయి వృద్ధనందుఁడు తపోవనమున నున్నాఁ డని తెలిసికొని, నందశేష ముంపఁగూడ దని తలంచి, విశ్వాసపాత్రు లగు ఘాతుకులం బంపి యాతని శిరము దునిమించెను.

తాను బన్నిన యుపాయము లన్నియు నిట్లు విధ్వస్తములై పోవుచున్నను స్థిరచిత్తుఁడగు రాక్షసుఁడు తన ప్రయత్నముల నుండి విముఖుఁడు గాలేదు. అతఁడు, పద్మనందుఁడు గూడఁ జాణక్యక్రోధానలమున భస్మీభూతుఁ డగుట విని, తా నింకఁ బాటలీపుత్రమున నున్నచోఁ దన కపాయము వచ్చు నని యెంచి, ప్రాణస్నేహితుఁ డగు చందనదా సను నొక వైశ్యుని యింటఁ దన దారపుత్రుల నతిరహస్యముగ నిలిపి, యెట్లయినను జంద్రగుప్తుని సంహరించి తీర వలె నను సంకల్పముతోఁ దిన్నఁగఁ బోయి మలయకేతువు నాశ్రయించెను. రాక్షసుఁడు, తన తండ్రితోఁ బ్రత్యక్షముగఁ గత్తి కట్టి పోరిన వాఁడే యైనను, దన తండ్రినిఁ జంపించిన వాఁ డగుటఁ జాణక్యుఁడు తన కిపుడు ప్రతిస్పర్థియై యున్నాఁడు గావున నీ సమయమున నఖండశేముషీధురంధరుఁ డగు రాక్షసామాత్యుని స్నేహమావశ్యకమ ని యెంచి, యాతనిఁ జాల గౌరవముతోఁ దన చెంత నిలుపుకొనియెను. రాక్షసుఁడును దాని కెంతయు సంతసించి, చాణక్యచంద్రగుప్తులను సంహరించి నందతర్పణము గావింప వలె నను తన ప్రతిజ్ఞను విప్పిచెప్పి, నీ వంటి యుత్తమవీరునకుఁ దండ్రినిఁ జంపిన

పగఁ దీర్చుటయే పరమధర్మ మని మలయకేతువున కుద్రేకము గలుగు నట్లు బోధించెను. అంత మలయకేతు వెంతయు నుబ్బిపోయి, రాక్షసామాత్యుని మంత్రాంగము వలనఁ దనకు జయము గలుగుట నిస్సంశయ మని తలంచి, సేనల నన్నిటిని సిద్ధము గావించి శుభముహూర్తమున దండయాత్రకు బయలువెడలెను. ఆతనివెంట శకయవనక గాంధారశచీనహూణకౌలూతాది రాజులు గూడ బయలుదేఱిరి.

కౌటిల్యవిశారదుఁ డగు చాణక్యోపాధ్యాయుఁడు చారుల మూలమున రాక్షసుని ప్రయత్నము లన్నియుఁ దెలిసికొని వాని కప్రతిహతము లగు ప్రత్యుపాయములను బన్నెను. తన పరమమిత్రుఁ డగు పర్వతకునిఁ జంపుటకు రాక్షసనియోగమున విషకన్యను దోడుకొని పోయె నను నపరాధమును బ్రకటించి జీవసిద్ధినిఁ బాటలీపుత్రము నుండి వెడలఁ గొట్టించెను. అకృతఘ్న జీవసిద్ధికిఁ, దిరిగి రాక్షసాశ్రయము లభించుటకును, దన్మూలమున నప్పటఁ జంద్రగుప్తుని పక్షమున వేగు నడపుటకును, రాక్షసమలయకేతువులకు వైరము కల్పించుటకును సందు దొరకెను. ఆ హేతువువలన విషకన్యాప్రేషణాపరాధము చాణక్యుని మీఁద నుండి రాక్షసుని మీఁదికి దొరలి పడి పోయెను. మఱియుఁ జాణక్యుఁ డెట్లో చారుల మూలమున రాక్షసుని చేతి ముద్రికను సంపాదించి, యా ముద్రికాసాహాయ్యమునఁ గొన్ని కాగితములు రాక్షసుని పేర సృష్టించి, మలయకేతువు వానినిఁ జూచు నట్లు తంత్రము పన్నెను.

చాణక్యుని ప్రయత్నములవలన మలయకేతువునకు రాక్షసునిపైఁ గల విశ్వాసము తొలఁగి పోయెను. అతఁడు రాక్షసుఁ డెట్లు మాయవేసముతోఁ దన్నుఁ గూడఁ దుదముట్టింప వచ్చె నని భావించి తన యనంతసైన్యసముద్రమును వెనుకకు మఱలించుకొనియెను.

ఈ నూతనవిపత్తువలన రాక్షసుఁడు చాల వగచెను. కాని చంద్రగుప్త వధోద్యోగమును విరమింపలేదు.

చాణక్యుఁడు రాక్షసాదుల ప్రయత్నము లన్నియుఁ జెడిపోవుటకుఁ జాల సంతసించి, రాక్షసుఁడు బ్రతికి యున్నంత కాలము తనకును, జంద్రగుప్తునకును, మగధరాజ్యమునకును గూడ విశ్రాంతి యొదవ దని భావించి, యెట్లయిన రాక్షసుఁ డమాత్యుఁ డగునెడలఁ జంద్రగుప్తుఁడు మధ్యందినమార్తాండుని వలె దుర్నిరీక్షుఁడు కాఁగలఁ డని తలంచి రాక్షసవశీకరణప్రయత్నములం జేయఁజొచ్చెను. కాని యెన్ని విధములను రాక్షసుఁడు వశుఁడు కాఁ డయ్యెను. చాణక్యుఁడు తుద కీ యుపాయము నూహించెను.

రాక్షసుని కుటుంబము చందనదాసు నింట నున్న దని చాణక్యుఁ డెట్లో తెలిసికొనియెను. అంతఁ జందనదాసుని రప్పించి యాతఁడు రాక్షసకుటుంబమును దన స్వాధీనము సేయుఁ మని చెప్పెను. చందనదాసు నయము వలనను భయము వలనను గూడ స్వాధీనము కాలేదు. చాణక్యుఁడు ధనాశ చూపెను. రాజానుగ్రహపాత్రుఁడ వయ్యెద వని యూరించెను. అయిన నా వైశ్యశిఖామణి యందుల కంగీకరింపలేదు. అతఁడు రాక్షసుని దారపుత్రులు తన యింట లేక పోవుటయే గాక, వారి నెప్పుడు నెచ్చటను దాను జూచియే యుండలే దని బూకరించెను. తుదకుఁ జాణక్యుఁడు "రాజద్రోహుల కాశ్రయ మిచ్చె" నను నేరము మోపి చందనదాసునకు మరణదండనము విధించెను. ఈ సంగతి రాక్షసునకుఁ దెలియుట కెల్ల చోట్లఁ జాటింపించెను.

అయినను జందనదాసు నంతరాత్మ మిత్రద్రోహమున కంగీకరింపలేదు. సంతోషముతో నాతఁడు వధ్యశిల సమీపించి నప్పుడు

గూడఁ జాణక్యుఁడు బోధించి చూచెను; గాని యప్పుడు గూడఁ బ్రయోజనము లేక పోయెను. అయినను జాణక్యప్రయత్నము కొన సాగు సందర్భము మాత్రము తటస్థించెను. తనకు మలయకేతువుతో వైరము పొసఁగిన పిదప విదేశముల నుండి ప్రయత్నములు సేయుట వలన లాభము లేదనియుఁ, బాటలియందే యుండిన నెట్లయిన జంద్రగుప్తుని సంహరింప వచ్చు ననియుఁ దలఁచి రాక్షసుఁడు పాటలీపుత్రమునకు వచ్చుచుఁ బురప్రాంతమున నీ సమాచారమును వినియెను. ఇది విని యాతఁడు చాలఁ గటకటఁ బడి, తన కొఱకుఁ బ్రాణములు విడువ నున్న మిత్రుని కొఱకుఁ దాను బ్రాణములు విడువఁ దలంచెను. ఆహా! స్నేహధర్మము!

చందనదాసుని వధ నిశ్చయ మయ్యెను. అతఁడు వధ్యశిల నధిష్ఠించి మృత్యువు కొఱ కెదురు చూచుచుండెను. తలవరులు విచ్చుకత్తులు పూని విసరుటకు సిద్ధముగ నుండిరి. చాణక్యుఁడు తలల నాజ్ఞ యిచ్చుటకు సిద్ధముగ నుండెను. అంతలోఁ జుట్టును జేరి యున్న జనసంఘమునుండి, "యాగుఁడాగుఁ" డను గంభీరధ్వని విన వచ్చెను. వెనుదిరిగి చూచు నంతలో రాక్షసుఁడు వచ్చి యచ్చటఁ బ్రత్యక్ష మయ్యెను. తోడనే చాణక్యున కమితానందము గలిగెను; గాని యది ముఖముపై సాంద్రముగ నావరించుకొని యున్న క్రోధప్రతిసీరఁ జీల్చికొని పైకి రాఁ జాలక పోయెను. అప్పుడు వగచుకొనుచు రాక్షసుఁడు చాణక్యుని సమీపించి "చందనదాసు నుద్ధరించి, యా శిక్ష నాకు విధింపు" మని కోరెను. చాణక్యుఁ డందుల కంగీకరింప లేదు. "ఒకఁడు చేసిన నేరమునకు మఱియొకని శిక్షించు టెట్లు? చందనదాసునకు శిక్ష యెట్లును తప్పదు. నీ విదివఱకుఁ జేసిన కుట్రలను గుఱించి నిన్నుఁ గూడ

విచారణ చేయకుండ విడువఁ బోము. మీ రిరువురు నపరాధులే" యని యాతఁ డందులకుఁ బ్రత్యుత్తరము చెప్పెను. అది విని రాక్షసుఁడు తన దురదృష్టమును జాల నిందించికొనియెను. పాప మాతఁడు "న న్నేమి చేసినను జేయ వచ్చును; గాని చందనదాసుని రక్షింపు" మని దీనముగఁ బ్రార్థించెను. అప్పుడు చాణక్యుఁడు "నీవు సచ్చింతతోఁ జంద్రగుప్తునకు సాచివ్య మొనరించెదవా?" యని ప్రశ్నించెను. రాక్షసుఁ డిఁకఁ దప్ప దని "వల్లె" యనెను. చాణక్యుఁడు కరుణ నభినయించెను. చందనదాసు విముక్తుఁ డయ్యెను. చంద్రగుప్తుఁ డెంతో యానందించెను. చాణక్యుని గభీరదృష్టులలో నానంద లక్ష్మి మెఱసి పోవుచుండెను. వెంటనే చాణక్యచంద్రగుప్తులు రాక్షసునిఁ, జందనదాసు నతిగౌరవముతోఁ గోటలోనికిఁ దోడుకొని పోయిరి.

చాణక్యచంద్రగుప్తుల కప్రతిహత మైన విజయ మిప్పటికిఁ జేకూరెను. దేశమున నఖిల శాంతి నెలకొనెను. చంద్రగుప్త రాజ్యము రామరాజ్యము వలె సుఖప్రద మగు నని ప్రజ లెల్లరును దలంప సాగిరి. కాని పారంపర్యాధికారము గల నందుల వినాశము నకు వారు వగవక పోలేదు. రాక్షసుఁడు మహాతేజస్సంపన్నుఁ డగుటఁ గీడు తలంపక నూతనప్రభువు నెడల భక్తివిశ్వాసములతోఁ బ్రవర్తింపఁ దొడఁగెను. చాణక్యునకుఁ దన యందుఁ గల నిర్వ్యాజానురాగమునకుఁ జంద్రగుప్తుఁడు మిగులఁ గృతజ్ఞతఁ గలిగి ప్రవర్తింపఁ జొచ్చెను. చాణక్యుఁడు తాను పట్టిన రెండుశపథములును నెఱవేఱుటయే గాక కాకతాళీయన్యాయంబుగ రాక్షసవశీకరణము గూడఁ గలిగి నందుల కెంతయు నానందించెను.

చాణక్యుఁడు శుభముహూర్తమునఁ జంద్రగుప్తునకుఁ బట్టాభిషేకము గావించి, యాతఁడు మహారాజుగను రాక్షసుఁడు మహామాత్యుఁడుగను బ్రకటించెను. చందనదాసునిఁ బ్రపంచము నందలి గొప్పవర్తకుల కందఱకుఁ దలమానికంబుగాఁ బ్రచురించెను. ప్రజాప్రముఖులు, రాజ్యతంత్రవిశారదులు, పండితులు, కవులు, యోధులు, సైనికులు మున్నగు వారెల్లరును గౌరవింపఁ బడిరి. నందపరిపాలనమును, ప్రజాపీడయు, విప్లవమును బ్రజలకు స్వప్నసదృశము లయ్యెను. కొలఁది కాలములో జరిగిన యీ మార్పునకుఁ దేశము నం దెల్లరు నాశ్చర్యపడసాగిరి. రాజుగారి ప్రియురా లగు మురరాజమాత గూడ నయ్యెను. ఎంత యదృష్టము !

కాని చంద్రగుప్తుని రాజ్యతృష్ణ యంతటితో శమింప లేదు. ఆ దాసీపుత్రునకు మగధ్రా జనిపించుకొనుట యంత ఘనతగాఁ దోఁప లేదు. రాజ్యతంత్రజ్ఞులు తన్నుఁ "జంద్రగుప్తుఁడు భారతదేశమునందలి మహారాజులలో నొకఁడు" డని మాత్రము పిలుతు రని యాతఁడు తలంచెను. తనలో సములు గాని, తన కంటె నధికులు గాని యుండుట యాతనికి లాఘవముగఁ దోఁచెను. రాజుల మీఁదఁ గూడఁ దన యధికారము చెల్లింప నాతఁడు కుతూహలము గలిగి యుండెను. అక్కతనఁ జంద్రగుప్తునకు భారతదేశమునకుఁ జక్రవర్తి గావలె నని తలంపు పుట్టెను.

ఈ తలంపు యొక్క సాధ్యాసాధ్యములను గుఱించి మే మిప్పు డేమియుఁ జెప్పఁజాలము. మీ కిది గొంతెమ్మ కోరిక యందురా ? కాని మహారాజ్యాధిపత్య మక్రమముగ లభించిన చంద్రగుప్తుని వంటి వానికి సామ్రాజ్యాధిపత్యము నందు వాంఛ గలుగుట వింత గాదు. ప్రకృతిధర్మ మే మనఁగా ? పారంపర్యముగ గర్భదరిద్రుం

డగు వాఁడు లక్షాధికారి కా వచ్చును; గాని పారంపర్యముగ లక్షాధికారి యగు వాఁడు కోటీశ్వరుం డగుట కష్టము. ఏల? అతఁడు పుట్టుకవలననే లక్షాధికారి. లక్షాధికారి యగుటలో నాతని పౌరుషం బేమియు లేదు. స్వీయపౌరుషము నుపయోగింపక పోయినను నాతఁడు గౌరవముగా జీవయాత్ర గడపఁ గలఁడు. అక్కారణమున నాతనికిఁ బౌరుషప్రభావమే తెలియదు. దరిద్రుని కట్లు గాదు. ఉన్నంత పౌరుషమును వినియోగింప కున్న దరిద్రునకు జీవయాత్ర సాగదు. అక్కారణమున నాతఁడు తన పౌరుషము నంతను వినియోగించి దాని ప్రభావమును దెలిసికొనఁ గలఁడు. పౌరుషప్రభావము నెఱింగిన యాతఁ డెప్పటికిని సంతృప్తి వహించి యుండ లేఁడు. నాలుగు రూపాయలు గడించిన వాఁడు రెండు వందలు గడింపఁ గోరును. తన సంతతపరిశ్రమచే లక్షాధికారి యైన వాఁడు కోటీశ్వరుండు కాఁ జూచు. త్రికరణశుద్ధిగఁ బౌరుషమును నమ్మి పనిచేయు వాని కభీష్టసిద్ధి గాక పోదు. లోకములో గర్భదరిద్రుల యభివృద్ధికి, నాగర్భశ్రీమంతుల యధఃపతనమునకును బౌరుషప్రభావపు జ్ఞానాజ్ఞానములే కారణములు. ఈ సిద్ధాంతము ననుసరించి యాగర్భశ్రీమంతు లగు వంశ మధఃపతితం బగును. చిరకాలము దారిద్ర్యము ననుభవించిన వంశము మహాభాగ్యసంపన్న మై విరాజిల్లును.

ఎల్ల వస్తువుల వృద్ధిక్షయములకు నీ సిద్ధాంతమే చెల్లుచున్నది. ప్రపంచమునందలి యెల్లదేశములు నభివృద్ధి యన నెట్టిదో యెఱుంగక గాఢాజ్ఞానాంధకారమునఁ బడి యున్న పుడు భరతవర్షము దారిద్ర్య మన నెట్టిదో యెఱుంగని సంపద నభిరామమై విరాజిల్లినది. కాని కొంతకాలమున కా యౌన్నత్యమునకు విఘాతము గలిగినది. మఱల భరతవర్ష మున్నతి నంద వలె నన్నఁ గడచిన

దారిద్ర్యసాగరమును దాఁట వలెను. భరతవర్షము చిరకాల మట్టి నికృష్టదశ ననుభవించినది; గావుననే చల్లని యీ యాంగ్లేయ ప్రభుత్వమున నభివృద్ధిసూచనలు పొడకట్టుచున్నవి.

పౌరుషప్రభావమును ఒక్కఁగ నెఱింగిన వాఁ డగుటఁ జంద్రగుప్తుఁడు వెంటనే తన వాంఛితము నీడేర్చుకొనఁ దలంచెను. ఆవెంటనే రాజ్యతంత్రమునం దద్వితీయు లగు చాణక్యరాక్షసుల మంత్రబలము తన కమితసాహాయ్యము గా నా మహాతేజశ్శాలి కొలఁది దినములలో నాఱు లక్షల కాల్బలమును, ముప్పది వేల గుఱ్ఱపుఁ బటాలమును, దొమ్మిది వేల యేనుఁగులును సంపాదించెను. ఈ వార్త విని భరతవర్షము నందలి రాజు లెల్లరు నబ్బురంపడి వెంటనే దిగాలు పడిరి. కొందఱు "ఈ దాసీపుత్రున కీ రక్తపాతములోఁ దృష్టి గలుగ లేదు కాఁబోలు! వీఁడు జగత్ప్రళయము నభిలషించుచున్నాఁ" డని తహతహ పడసాగిరి. తుదకుఁ జంద్రగుప్తుఁడు చాణక్యరాక్షసుల యనుజ్ఞ నంది మంచి సమయమున భేరీభాంకరణంబులచే దిక్కుహరములు పూరించి, నర్మదాహిమాలయములకును, ప్రాక్పశ్చిమసముద్రములకును మధ్యభాగమునఁ గల భారతదేశమునకుఁ బ్రథమచక్రవర్తి యయ్యెను.

చరిత్రకారులు చంద్రగుప్తుని నవతారపురుషుఁడుగ భావించి బట్టుల వలెఁ బొగడి యున్నారు. దాసీపుత్రుఁడు సార్వభౌముఁ డగుటయే యవతారపురుషుఁ డనుట కాధారమా? అట్లయినచో మేము చరిత్రకారులతో నేకీభవింపఁ జాలము. చంద్రగుప్తుని యందు మఱియొక యాత్కృష్ట్య మే మైన నుండవలెను. మన మది యేవో పరిశీలింతము.

చంద్రగుప్తునకు సంగ్రామరంగమున వీరవిహారము గావింపవలయు ననుముచ్చట యింతను దీఱినది గాదు. రక్తపాతమునం దాతని కింతను నిర్వేదము గలుగ లేదు. అనేక యోధానుయోధుల శీర్షములను గొబ్బరి పుచ్చెలవలె వెగురఁ గొట్టిన యాతని ప్రచండ కరవాల మింక నాతనిని సంగ్రామరంగమున కాహ్వానము సేయ సాగెను. చంద్రగుప్తునివంటి వీరుఁడా యాహ్వానమును నిరాకరింపఁ గలఁడా? అది కాపురుషలక్షణము. వెంటనే చంద్రగుప్తుఁ డధికోత్సాహముతో మఱల యుద్ధమునకుఁ బయనమయ్యెను.

"ఎక్కడ" కని మీరు వేఱుగ నడుగ నక్కఱ లేదు. కలదు గదా విలాసమాత్రమున గ్రీకు దేశీయుఁ డగు నలకసుందరునకు విహార ప్రదేశమైన పాంచాలము? నందసంహారమునకుఁ బూర్వము పార్వతీయసహాయుం డగు చంద్రగుప్తుని ధాటి కోర్వ లేక పలాయనము గావించిన సెల్యూకసు కొలఁది దినములు గడచిన పిదప మఱలఁ జేజికొని భరతవర్షమునఁ దిరుగ గ్రీకుపతాకలను నెలకొలుపఁ దలంచి పాంచాలముపై దండెత్తి వచ్చెను. చంద్రగుప్తుఁడు చాణక్యుని యోచన చొప్పున సెల్యూకసు సింధునదిని దాఁటు నంత దనుక నేమియుఁ జేయక యూరకుండి పిదప నత్యంతచాతుర్యముతోఁ దనయఖండసైన్యముచే గ్రీకుసైన్యమును జుట్టుముట్టడించి బంధించి వేసెను.

సెల్యూకసు నిర్భయముతోడను బట్టుదలతోడను భారతవీరులను దాఁకెను. గ్రీకుసైనికులు దండతాడితభుజంగముల రీతినిఁ జాలఁ బట్టుదలతోడనే పని చేసిరి; గాని పాపము! వారి యెడల విజయలక్ష్మి ప్రాతికూల్యము నవలంబించెను. తుదకుఁ జేయునది లేక సెల్యూకసు గెడ్రోషియాయు, నరకోషియాయు ననఁ బడు

నష్టవిస్థానమును బలూచిస్థానమును భారతసామ్రాజ్యలక్ష్మి కుపాయనముగ నర్పించి చంద్రగుప్తునితో నొడంబడిక గావించికొని యాత్మరక్షణము గూడఁ గావించుకొనియెను. ఈ యొడంబడిక జరుగుటకుఁ బూర్వము గ్రీకు సేనలపైఁ బడి మాగధులు కొంత తడవుకుఁ దమ దోఃకండూతినిఁ దీర్చికొనిరి.

కాని చంద్రగుప్తుఁడు సెల్యూకసు నంతటితో విడిచిపెట్టుట కంగీకరింప లేదు. విజితుం డగుటవలన నసూయావిదగ్ధహృదయుఁడై సెల్యూకసు మఱల నెప్పుడైన దండెత్తి వచ్చినచో వాని కపజయమే సిద్ధించినను, ప్రజలకుఁ గష్టము లొదవును గావునఁ దిరిగి యెప్పుడు నా గ్రీకుయోధుఁడు భరతవర్షముపై దండెత్తి రాకుండున ట్లుపాయమును బన్నఁ జంద్రగుప్తుఁడు చాణక్యునిఁ బ్రార్థించెను. అప్పుడు చాణక్యునకుఁ దుల్యబలు లగుట నెప్పుడును గయ్యములు సంభవింపకుండుఁ గాత మని వియ్యముకొఱకు వియ్యము లందిన యాదవపాండవులును, విరాట పాండవులును జ్ఞప్తికి వచ్చిరి. ఇదియే మంచి యుపాయ మని చంద్రగుప్తునకుఁ దెలిపి యాతనికి సెల్యూకసు కూఁతు నిచ్చి పరిణయము సేయుటకు జాణక్యుఁడు తంత్రములు పన్నెను. సెల్యూకసు సార్వభౌముఁ డల్లుఁ డగుట మిగుల గౌరవాస్పద మని భావించి, మాఱు పలుకక యత్యానందముతో సుందరియు, జవ్వనియుఁ, జతురయు నగు తన ముద్దులకూఁతును జంద్రగుప్తునకు సమర్పించుకొనియెను. గ్రీకు యోధునకును భారత సార్వభౌమునకును వైర ముడిపి యొక్కుడుబల యఖండస్నేహం బొనఁగూర్చెను.

పిదప సెల్యూకసు తన కైదు వందల గజములు ( ఏనుఁగులు ) గావలయు నని యల్లునిఁ బ్రార్థించెను. ఒక గజగమనకు బదులుగ

నైదు తండ్రల గజము లిచ్చుట ధర్మవిరుద్ధము గా దని చాణక్యమం
త్రాలోచనము ననుసరించి చంద్రగుప్తుఁడు తన మామ ముద్దు
తీర్చెను. మాగధుల ప్రతాపము బడబాగ్నివలె దుస్సహం బగుటను,
హతశేషం బగు సైన్యము భయభ్రాంతం బగుటను, విశేషించి తన
పుత్రిక భారతదేశచక్రవర్తిని యగుటను సెల్యూకసు చంద్రగుప్తు
నెదిరింప మఱలఁ గలనైనఁ దలంప లేదు.

పిదపఁ గొన్ని నాళ్లకుఁ దన దేశమునఁ బశ్చిమప్రాంతమున
నంతిగోన సను పగతుఁ డొకఁడు తిరుగఁ బడె నని విని మెగాస్తనీ
సను వానిని జంద్రగుప్తు నాస్థానమునఁ దన రాయబారిగా నిలిపి
సెల్యూకసు స్వదేశమునకుఁ బోయెను.

చంద్రగుప్తుఁడు నిశ్చలుం డయ్యెను. అతఁడు శాంతచిత్తుఁడై
రాజ్యపరిపాలనము ప్రారంభించెను. రాజ్యసంపాదనమున నాతఁ
డెంత కుశలుఁడో రాజ్యపరిపాలనమునఁ గూడ నంత చతురుఁడు.
అతని రాజ్యాంగవిధానము లన్నియుఁ జరిత్రములు చదివిన వారికిఁ
బరిచితములే. అతఁడు దాసీపుత్రుఁ డైనను మనకుఁ బూజ్యుఁడు.
ప్రాతస్స్మరణీయుఁడు.

మన మీ యాఖ్యానము ముగించుటకుఁ బూర్వము చాణక్యో
పాధ్యాయుని గుఱించి యొకింత ముచ్చటించుకొనక తీఱదు. ఈ బీద
బ్రాహ్మణుని చరిత్రము మహోన్నతము. ఈతని ప్రారంభముల యౌ
త్కృష్ట్యమును, నిరాయాస మగు తత్సాఫల్యమును జూడ నీతఁడు
కారణజన్ముఁ డని నూహ పొడమక మానదు. ప్రప్రథమునఁ జాణ
క్యచంద్రగుప్తులకు జరిగిన సమావేశ మయాచితమును, సమయాను
కూలమును, బరస్పరవిజయకారియు నై యాశ్చర్యమును గొలుపు
చున్నది. చాణక్యుని ఘనతను జంద్రగుప్తుఁడు గ్రహించినట్లు నందులు

గ్రహింప లేక పోయిరి. అభగ్నాగర్వోన్మత్తు లగుట వారి కీతఁ డనామకుని వలెఁ దోఁచెను.

లోకములో నైశ్వర్యప్రమత్తుల స్వభావమే యిట్టిది. సంపన్నుల తలంపున దరిద్రులు మానవులుగాఁ బరిగణింపఁబడఁ దగరు గాఁబోలు. వారి కొక్కొక్క బీదవానియందుండు విద్యావివేకములును, శక్తి సామర్థ్యములును దెలియవు కాఁబోలు! సంపన్నులు సంపన్నులకుఁ బ్రత్యుత్థానము లాచరించి యతిథులకు మడుగు లొగ్గెదరు; గాని బీదలకు దర్శనమైన నొసంగరు. ఒసంగిరో; కడుఁ జులుకనగఁ జూతురు. తిన్నగ మాటలాడరు.

నందులు చాణక్యుని యెడల నట్లె ప్రవర్తించిరి. కాని చాణక్యుఁ డవమానపడి యూరకుండు నిస్తేజుఁడు గాఁడు. ఆ సభలో దన వాఁ డొక్కఁడును లేక పోయినను, స్వస్థలమున నైన బలఁగము లేక పోయినను బ్రత్యక్షముగ, రాజభవనమునందే యొక్కరుఁడు నిర్భయముగ "మి మ్మంత మొందింపకుండ నీ జుట్టు ముడఁవ"నని శపథము దాల్చుటకుఁ జాణక్యునకే తగును.

"నందసంహారము" "చంద్రగుప్త పట్టాభిషేకము" నను రెండు ప్రతిజ్ఞలు నెఱవేర్చుకొనుటలోఁ జాణక్యునకుఁ గలిగిన యంతరాయములకుఁ బారమును, నిందలకుఁ బరిమితియు లేదు. అయిన నాతఁ డెందులకు భీతిల్ల లేదు. అవి తటస్థించినపు డాతనికి నుంత యేని వైకల్యము గాని, యెట్లు సాధింతు నని విచారము గాని గలిగె నని చెప్పుటకు వీలులేదు. ఏమన? పురుషకారమున కసాధ్యము లేదనియుఁ బురుషకారమే సర్వఫలములకు సాధక మనియు నాతని యభిప్రాయము. అతఁ డట్టి విశ్వాసముతోనే పనిచేసెను. దానికిఁ

దగిన ఫలములనే పడసెను. అతని ప్రయత్నములలో నాత్మవిశ్వాస రహిత మొక్కటియు లేదు. విఫలమైనది యంతకు ముందే లేదు.

“అయిన నతఁడు కేవల నిరీశ్వరవాది” యని మీరు తలంచుటకు వీలు లేదు. అతఁ డాస్తికమహాజనులలో నెల్ల నుత్తముఁడు. సాంగచతుర్వేదములను వల్లె వేసిన వాఁడు; భగవత్పూజా ధురంధరుఁడు; స్వమతమునం దధికాభినివేశము గల సత్కులప్రసూతుఁడు. నైష్ఠికుఁడు; విజితేంద్రియుఁడు; గాని సర్వసంగపరిత్యాగము గావించిన సన్న్యాసి గాఁడు. అస్ఖలితబ్రహ్మచారి. అయినను లౌకికకార్యశూరుఁడు.

భారత సామ్రాజ్యం బంతయుఁ దన యాజ్ఞాబద్ధంబై యున్న నాతఁ డెప్పుడును వైభవముల నాసించిన వాఁడు కాఁడు. అతఁడు దంభముల పొంతఁ బోక, విషయసుఖవిముఖుఁ డై, మహర్షి వలె నొక పర్ణకుటీరమున వేదవిహితకర్మపరతంత్రుఁ డై యావజ్జీవమును నిష్కళంక బ్రహ్మచర్యములోఁ గడపెను.

ప్రతిజ్ఞా నిర్వహణ మను పేర నసంఖ్యేయ కుటిల కృత్యములం గావించిన యాతనికి నిర్మలబ్రహ్మచారిత్వ మెట్లు సిద్ధించు ననియు, వేదవిహితాచారపరాయణత యెట్లు చేకూరు ననియు సందేహింప వీలు లేదు. అతఁడు కర్మసన్న్యాసి గాఁడని ప్రథమము నందే చెప్పితిమి. అతఁ డేక కాలమునందే యిహపరముల రెంటిని సాధింపనెంచిన తేజస్వి. వేదవిహితాచారపరాయణతయు, లౌకిక కార్యనిర్వాహకతయు నాతనికి ముఖ్యవిధులే. ఇం దే ధర్మము విడుచుటకు వీలగును? కొందఱు లౌకిక కార్యప్రవాహమునం బడి కొట్టుకొని పోవువారికి మతాచారనిర్వహణ మసాధ్య మందురు. ఈ వాద మవిచారహేతుక మగుట నిరాకరణీయము.

ఈ చర్చవలన మన చింతిత విషయము నిర్ధారితము కాలేదు. అది యొకింత విమర్శింతము. చాణక్యుని జీవితము నందుఁ గౌటిల్యమేమైన నున్నదా లేదాయని ప్రశ్న. లేదని ప్రత్యుత్తరము. మనము చాణక్యుని జీవితమును సామాన్య మానవుల జీవితములతోఁ బోల్చి విమర్శించుటకు వీలు లేదు. మహాపురుషుల జీవితలక్షణములను మనము భావించితి మేని చాణక్యుని జీవితము నందలి నైర్మల్యము మనకు బోధపడఁ గలదు. సామాన్యుల జీవితపరమావధి యానందానుభవము. మహాత్ముల జీవిత పరమావధి ధర్మసంస్థాపనము. లోకమున నధర్మము విజృంభించియున్నపుడే మహాత్ము లవతరింతురు. మాయ మాయైక సాధ్యము. అట్లే యధర్మము నధర్మైక సాధ్యము. అగుట ధర్మసంస్థాపనము కొఱకు మహాత్ము లపుడపు డధర్మము నాశ్రయింతురు. కాని వారి జీవితమున కది కలంకము నాపాదింపఁ జాలదు. మహాత్ము లని భక్తితో శ్రీరామకృష్ణులను బూజింపని వాఁడు భారతీయులలో నొక్కఁడు నుండఁ జాలఁడు. వారి చరిత్రములలోఁ దాటకా సంహారాదికములును, బూతనా హింసనాదికములు నగు నధర్మప్రవర్తనములు కాన్పించుటలేదా? వాని నధర్మప్రవర్తన లనుట కెవఁడైన సాహసింపఁ గలఁడా?

ఈ సందర్భమున నందసంహారమునకుఁ బోలెఁ బర్వతకనిగ్రహమునకుఁ దగిన కారణము లేదనియు, నది చాణక్యుని జీవితమునం దొక కలంక మనియుఁ గొందఱు సందియంపడ వచ్చును. ఈసందేహము లెస్స యైనది కాదు. పర్వతకుఁడు చంద్రగుప్తునకు సద్బుద్ధితో సాయము సేయ వచ్చినవాఁడు కాఁడు. అతనికిఁ జంద్రగుప్తునకుఁ గంటెఁ బూర్వమే మగధరాజ్యముపై నాశగలిగినది. అతఁడు చాణక్యుఁడు వచ్చి నందసంహారమునఁ జంద్రగుప్తునకు సాయపడ

వలయు ననియు, నందులకుఁ గాను మగధరాజ్యములో సగపాలు నీ కొసంగెద ననియుఁ జెప్పినను "ఈట్లు గావించినచో మగధపై దండెత్తినందులకుఁ బ్రజలు చంద్రగుప్తుని నిందించినంత తన్ను నిందింప రనియుఁ, జంద్రగుప్తుని సైన్యమును దనసైన్యమును గూడి నచో నందసంహారం బగుట నిస్సంశయం బనియుఁ, బిదపఁ దన వెంట వచ్చిన శకయవనకిరాతాదిరాజుల సాయంబునఁ జంద్రగుప్తుని స్వల్పసైన్యమును నిముసములో భస్మపటలము గావించి వైచి మగధరాజ్యం బంతయుఁ దానే యనుభవింపవచ్చు ననియు భావించెను. కాని చాణక్యుని యెదుట నీ కౌటిల్యము దాఁగినది గాదు. అది కారణంబు వలనను, మగధరాజ్య మంతయు నీకుఁ బట్టము గట్టెద నని చంద్రగుప్తున కిచ్చిన వరమునకు భంగము తటస్థింపఁ బోవుటను, బర్వతకునిఁ జంపించె నను నపవాదము తనపైఁ బడకుండు నట్లు రాక్షసప్రేషిత యగు విషకన్య యను నాధారము లభించుటం జేసియుఁ జాణక్యుఁడు కుటిలుఁ డగు పర్వతకుని రూపుమాపెను. మోసగానిని మోసము చేయుట యధర్మము గాదు. పర్వతకుఁడు మోసము చేయ వచ్చి మోసపోయెను.

మొత్తము మీఁదఁ జాణక్యుఁడు చాల దుర్మార్గుఁ డని కొందఱ యభిప్రాయము. తన యెడల నన్యాయముగఁ బ్రవర్తించిన వారికిఁ బ్రతిక్రియ సేయుటయే దుర్మార్గ మగునేని లోకమున ధర్మ మను నది యుండ లేనే లేదు. ప్రతిపురుషుఁడును బ్రతిపక్షుల యెడల దనకుఁ జేత నైనంత వఱకుఁ బ్రతిక్రియ సేసితీఱును. క్రియారూపమున నేమియుఁ జేయఁజాలని వాఁడు మాటలతో నైనఁ బగఁ దీర్చు కొనకుండ నుండ లేఁడు. నందులు తనయెడలఁ గుటిలముగను, నగౌరవముగను బ్రవర్తించిరి; గావునఁ జాణక్యుఁడు వారిని సంహరింపిం

చెను. అల్పులు చేయు ప్రతిక్రియ యల్పముగ నుండును. గొప్పవారు చేయునది గొప్పగ నుండును. గొప్పవారికినిఁ గొలఁదివారికినిఁ గల తారతమ్యమును గ్రహింపఁ గలవారికిఁ జాణక్యచేష్టితములు ప్రతిక్రియలుగనే తోఁచును. చాణక్యుఁడు నందుల యెడలఁ గావించిన ప్రతిక్రియ ప్రబలరక్తపాతరూపమైన దగుటచే రక్తమును గాంచి కండ్లుతిరిగి పడిపోవువారు చాణక్యజీవితము నందలి నైర్మల్యమును గ్రహింపఁ జాలరు. రాజనీతి యన నేమో యెఱుంగని వారు కొదరే గ్రహింపఁ జాలరు.

రాక్షసుఁ డచంచలనందపక్షపాతియై తన ప్రయత్నములను భగ్నము సేయుటకుఁ దీవ్రముగఁ బనిచేసి తన విజయమున కనుభోక్తగాఁ జేయఁ దలంచి యున్న చంద్రగుప్తుని సంహరించుటకుఁ గూడఁ జాలఁ బ్రయత్నములు చేసిన వాఁడే యైనను నాతని యఖండసామర్థ్యమును, నిర్మలస్వామిభక్తిని బట్టువలెఁ బొగడుటయే గాక యాతనిని ముఖ్యామాత్యపదవియందు నిలుపని యెడల మగధరాజ్యమునకును, మహోన్నతము లగు తన విజయములకును, జంద్రగుప్తునకును సుఖస్థితి చేకూర దని నిశ్చయించి యనేకవిధములఁ బ్రయత్నించి తుట్టతుద కా విషయమున లబ్ధవిజయుం డగుటయు, మిత్రునికొఱకుఁ బ్రాణత్యాగమునకుఁ గూడఁ దెగించియున్న చందనదాసుని రాక్షసవశీకరణము పొంటెఁ జాల నిడుమలు గుడువఁజేసినను కట్టకడపట నాతని యోగ్యతకు మెచ్చి ప్రపంచమునందలి గొప్పవర్తకుల కందఱకుఁ దలమానికంబుగాఁ బ్రకటించుటయుఁ జాణక్యుని గుణగ్రహణపారీణతకును సత్ప్రవర్తనమునకును సాక్ష్యములు గాక మానవు.

చాణక్యుని జీవితమున మనము పరిగణింపవలసిన విషయ మేమన? ఆతని జీవితరథము బ్రాహ్మణక్షత్రియ తేజస్సులను రెం డశ్వములచే లాగఁ బడినది. ఆ యశ్వములలో నొకటి యతిశాంతి మైనది. రెండవది యత్యుగ్ర మైనది. ఆ రథచక్రములలో నొకటి యాతని యంతరాత్మ; వేఱొకటి చంద్రగుప్తుఁడు. వానిలోనొకదాని మార్గము మంత్రపూతహవిఃపూరితము లగు స్రుక్స్రువములు. రెండవ దాని మార్గము శాణవిమర్దనాతినిశితం బగు నసిధార. ఆత్మవిశ్వాస సంపన్నం బగు దృఢదీక్ష దానికి సారథి. ఇట్లయ్యు శత్రువులు గడగడ వడంక, మిత్రులు మిక్కుటముగ నానందింప, నెల్లరు నద్ది రా! యని నుతింప, నిరపాయముగ నా మహారథము పెద్దకాలము ప్రయాణము గావించి గమ్యస్థలము చేరినది. అహా! చాణక్యోపా ధ్యాయుని మాహాత్మ్యము!

చంద్రగుప్తచరిత్రము నవగాహనము సేసికొనుటకుఁ జాణక్య మాహాత్మ్యమును దెలిసికొనుట యెంత యావశ్యకమో, చాణక్య మాహాత్మ్యమును దెలిసికొనుటకు రాక్షసగుణసమీక్షణ మంత యగత్యము. కాని చరిత్రకారులు రాక్షసుని గుఱించి యొకటి రెండు మాటలకంటె నెక్కుడు వ్రాసి యుండలేదు. నా రీతిని చరిత్ర వ్రా యుటకుఁ దగిన యాధారములు లేవని చెప్పెదరు. అయిన నున్నంతె చరిత్రమును బట్టి రాక్షసుని గుఱించి యోచించునపుడు ప్రప్రథమ మున మన మాతని యచంచలస్వామిభక్తిని గమనింపవలసి యున్నది. చాణక్యుని క్రోధానలమునఁ బడి భస్మపటలము గాకుండ నంద వంశమును రక్షించుటకై యాతండు చేసిన ప్రయత్నములను బట్టియుఁ బడిన పాట్లను బట్టియు నాతని స్వామిభక్తి పరిమితిని మనము తెలిసి కొన నచ్చును. ఇట్టి స్వామిభక్తి పరతంత్రున కే దేశ చరిత్రమును

నుదాహరణము నొసంగఁ జాలదు. చాణక్యాచారులచే వృద్ధనందుఁడు సంహరింపఁబడిన పిమ్మట నాతఁడు గావించిన కూటప్రయత్నములు మగధరాజ్య రక్షణోద్దిష్టములై యుండిన యెడల రాక్షసుని స్వామిభక్తి, నిర్వ్యాజము కాదని చెప్పుట కవకాశము గలిగి యుండును. కాని యట్టి దేమియు సంభవింప లేదు. రాక్షసప్రయత్నము లన్నియుఁ బద్మనందుఁడు బ్రతికి యున్నంతవఱకు నందవంశ సంరక్షణమునకును, పిదప స్వామిభక్తిఁ దీర్చుకొనుటకునై యుద్దేశింపఁబడినవి. ఇఁక నాతని రాజభక్తి యమలిన మని చెప్పుట కేమి యభ్యంతరము గలదు? కావుననే విరోధియయ్యు గుణజ్ఞుండగుటం జాణక్యుఁ డాతనిని మిగులఁ బ్రశంసించెను.

ఇట్టి యకృత్రిమ స్వామిభక్తితో నంద సంరక్షణమునకును, జంద్రగుప్త సంహారమునకును రాక్షసుఁడు చేసిన ప్రయత్నము లనంతములు. ఆతఁ డొక్కొక్క యంతరాయము తటస్థించినప్పుడు చూపిన ధైర్యస్థైర్యములు సంస్తవనీయములు. ఒక్కొక్కపుడు ప్రకటపఱిచిన పట్టుదలయు, సమయస్ఫూర్తియుఁ బ్రశంసనీయములు. కల్పనాచాతుర్యంబును, విమర్శనైపుణ్యము నాశ్చర్యకరములు. అయిన నేమి లాభము? అవి యన్నియుఁ బ్రతిహతములై పోయినవి. తుదకు రెక్కలు విఱిగిన పక్షివలె రాక్షసుఁడు చాణక్యుని వలలోఁ జిక్కుకొనియెను.

కార్యసిద్ధికిఁ బౌరుషమే ప్రధాన మగునెడల రాక్షసుని యతిమానుష యత్నము లన్నియు నట్లు భగ్నములై పోనేల యని యొక పూర్వపక్షము రావచ్చును. రాక్షస ప్రయత్నములు నిరంకుశములు గాలేదు. వానికిఁ జాణక్యుని ప్రయత్నములతో సంఘర్షణము గలిగినది.

అవి చాణక్యప్రయత్నములంత సుదృఢములు గావు. అక్కతన నాద్వంద్వయుద్ధమునఁ బరాజితము లై పోయినవి.

చందనదాసున కట్టి గతి తటస్థింపదేని మన మింకను రాక్షసు నిచేఁ బన్నఁబడిన మఱికొన్ని కుట్రలను దెలిసికొనియుందుము. తన ప్రతిజ్ఞకు భంగము గలుగుటయే గాక, తా నెవ్వని వినాశము సేయఁ దలఁచెనో వానినే సాచివ్య మొనరించి యభివృద్ధి నందింపవలసి వచ్చినను రాక్షసుఁడు మిత్రద్రోహము చేయఁజాలక పోయినాఁడు. అతని ఘనత కీయొక్క దృష్టాంతమే చాలును. అయినను జంద్రగుప్తునకు మంత్రిత్వము నొప్పుకొనిన తిరువాత నెట్టిద్రోహమును దలంపకుండుటను గూడ నిచ్చట నుదాహరింపక తీఱదు.

చంద్రగుప్త సంహార విషయికం బగు శపథమును వదలుకొనుటయే గాక, చంద్రగుప్తుని యాస్థానముననే మంత్రిత్వమును వహించుట యేమిగొప్ప యని సందేహము గలుగవచ్చును. నందులు రూపుమాసిరి. నందవంశము పేరులేకుండఁబోయినది. చంద్రగుప్తుని రాచఱికము స్థిరపడినది. మౌర్యరాజ్యమును బ్రజలందఱు నానందముతో దీవించుచున్నారు. తన కెవ్వరును సాయపడక పోవుటయే మౌర్యరాజ్యమునఁ బ్రజలకుఁగల భక్తికి నిదర్శనము. ఇఁక మగధరాజ్యమేరికి ధారవోయుటకు రాక్షసుఁడు చంద్రగుప్తుని సంహరింపవలెను? తానే రాజ్యాధిపత్యము వహింపవలెనను కోరిక రాక్షసున కెప్పుడును లేదు. మగధరాజ్యము నిఁకఁ గ్రొత్త ప్రభువు స్వీకరింపక తప్పదు. చాణక్య శిష్యుండగు చంద్రగుప్తుఁ డతిప్రతిభాశాలి; పరాక్రమశాలి. అతఁడు మగధరాజ్యమును జయించుకొనియెను. అతని ప్రభుత్వము నంగీకరింపక పోవుటకు రాక్షసునకుఁ గారణ

ములు లేవు. ఇఁకఁ జంద్రగుప్తసంహారమునకై యత్నించినచో నాతఁడు రాజద్రోహియై పోవును. ఏమి ప్రయోజనము? చంద్రగుప్తుఁడు దుర్మార్గుఁడుగాఁడు. ప్రజాసౌఖ్యము నాతఁడు తిరస్కరింపఁడు. అట్టి సత్ప్రభువు నెదిరించి యాతనికిఁ గీడుసేయఁదలఁచుట యేమి ధర్మము? చాణక్య చంద్రగుప్తులు తానింకను గుట్టలు పన్నుచుండినచో దేశమునకును దమకును నెమ్మది యుండదనిగదా రాక్షసుని మంత్రిత్వము నంగీకరింపుమని నిర్బంధించిరి? అటులయిన నాతఁ డభిమానశాలి యేని సర్వమును విడిచి యరణ్యమున కేల పోరాదు? ఇదియు నధర్మమే. రాక్షసుఁ డమానుషప్రజ్ఞాధురంధరుఁడు. కార్యనిర్వాహణమునం దతిధీరుఁడు. ప్రజల యెడల దయగలవాఁడు. ఆ తెలివితేటలు నా శక్తి సామర్థ్యములు నరణ్యములో మాసిపోవలసినదేనా? మహాత్ములు తమ జీవితమును వ్యర్థము సేయఁజాలరు. అరణ్యమునకుఁ బోవుటవలన నేమి ప్రయోజనము? అప్పుడాతనినిఁ బరాభవదుఃఖము విడిచిపోదు. అట్లయిన నాతనిచిత్తమునకు శాంతి యుండదు. మోక్షము కలుగనే కలుగదు. అట్లు జీవితము నొరుల కుపయోగపడకుండఁ జేసి తాను చెడిపోయిన నేమి లాభము? చంద్రగుప్తుని మంత్రియైనచోఁ బ్రజలకు సుఖము గలిగింపవచ్చును. రాజునకు మంగళము నొదవింపవచ్చును. ఇంతకంటె నుత్కృష్టకార్యమేమి? ప్రతిష్ఠితరాజ్యము నెడల ద్రోహమును దలంపక పోవుట సజ్జనలక్షణము. శత్రువులచేఁ బూజింపఁబడిన రాక్షసుని జీవితమెంత మహోత్తరమైనది!

చంద్రగుప్తుని ప్రవర్తనమునఁ బ్రతిపదమునందును మనకు గోచరించునది యప్రతిహతమగు పురుషకారము. చంద్రగుప్తుఁ డచంచల పౌరుషోపాసకుఁడు. కావుననే యాతఁడు చక్రవర్తి గాఁగలిగెను.

నందుల ప్రవర్తనమంతయు దోషభూయిష్ఠము. మనము నందులను గుఱించి యిప్పు డింతకంటెఁ జెప్పవలసినది లేదు. పర్వతకునకు మంత్రమే గాని తంత్రము తెలియదు. మలయకేతువు రెండును దెలియని పరప్రత్యయనేయబుద్ధి. ఇందుశర్మ మహాతాంత్రికుఁడు. అతఁడు చేసిన కుట్రలన్నియు ఫలించినవి. అవియన్నియు నాశ్చర్యకరములు. అలెగ్జాండరు గొప్ప మాంత్రికుఁడే. గొప్ప తాంత్రికుఁడే. కాని యాతని కంగబలము చాలినది గాదు. వచ్చునప్పుడే కత్తి విసరఁ దొడంగుటవలన నీ దేశములో నాతని కది సాధ్యమైనది గాదు. సెల్యూకసు మంత్రతంత్రములలోఁ జక్కని జ్ఞానము లేని సాహసికుఁడు. అతఁడు తగిన ఫలము ననుభవించెను.

---

శ్రీరస్తు

# వీరపూజ

## ప్రథమభాగము

---

### పృథివీరాజు

శాలివాహనశకము పండ్రెండవ శతాబ్దప్రారంభమున నుత్తర భరతవర్షమున మహోన్నతస్థితిలో నున్న సంస్థానములలో దిల్లీ, యజమీరు, కన్యాకుబ్జము, చిత్తూరు, నబూగడము, ననిహిల పురము ననునవి ముఖ్యమైనవి. అందు దిల్లీ సంస్థానమును దువర వంశజుం డగు ననంగపాలుఁడును, నజమీరు సంస్థానమును జహువా న్వంశజుం డగు పృథివీరాయఁడును, కన్యాకుబ్జరాజ్యమును రాతో ద్వంశజుం డగు జయచంద్రుఁడును, జిత్తూరు సంస్థానము (మేవాడు రాజ్యము)ను గుహాలోద్వంశజుం డగు సమరసింహుఁడును, నబూగడ మును బరమారవంశజుం డగు జైతుఁడును, ననిహిలపురమును, జాళుక్యవంశజుఁడును ఘూర్జరాధీశుఁడు నగు భోలాభీముఁడును బరి పాలించుచుండిరి.

వీరందఱును సర్వతంత్రస్వతంత్రులు. అతులితపరాక్రమ భూషితులు. అయినను వారిలో వారు పరస్పర మంతస్తాపములు గలిగి యుండిరి. ఒకరినిఁ జూచి యొక రోర్వ లేకుండిరి. తమలోఁ

దా మట్లుండుట చాల సహాయకర మని యెక్కఁడును భావింప లేదు. ఇతరులలో నిది మంచిది గా దని తెలిసినవారును, దెలిసినచో వారిలో వారికి స్నేహబాంధవము నొనగూర్చుట మంచి దని తలంచి యట్లు గావింపఁ బ్రయత్నించిన వారు నున్నట్లు తోఁపదు. పరు లెవ రైన నట్టి ప్రయత్నములు గావించినను లాభము లేక పోయి యుండును. మూర్ఖులకుఁ బోలె నట్టి విజ్ఞానవంతుల కట్టింతఃకలహము లేల కలిగి యుండవలెనో తెలియదు.

వీరిలోఁ గొందఱు పరస్పర బాంధవమును గూడఁ గలిగి యున్నారు. ఆ చుట్టఱికమును బట్టియైన వా రైకమత్యమును సరకు సేయ లేదు. ఒక రిద్దఱు కంటెగా నంతస్తాపములు లేక పోవచ్చును; గాని మొత్తము మీఁదఁ జెప్పవలసి వచ్చినపుడు వీ రొకరి నొకరు గౌరవించుకొనుట కంగీకరింపని వా రని నిరాఘాటముగఁ జెప్ప వచ్చును.

వీ రందఱిలో దిల్లీనాయకుం డగు ననంగపాలుఁడు వృద్ధుఁడు. ఈతని కాలమునందే హస్తినాపురమునకు దిల్లీ యని పేరు వచ్చెను. ఎంత సమర్థుఁ డైనను వార్ధకము దిగఁదీయుచుండుటవలన నాతఁడు పరిపాలనాభారమును దప్పించుకొని విశ్రాంతి కొఱకు బదరికావన మునకుఁ బోవఁ దలంప సాగెను.

అయిన నీ భూభార మంతయు నేరిపైఁ బెట్టవలయును? ఆతనికిఁ బుత్రసంతానము లేదు. ఇరువురు కుమార్తెలు మాత్ర ముండిరి. పెద్ద కూఁతు రగు కమలాదేవి నజమీరుసంస్థానాధీశుఁ డైన సోమే శ్వరునకును, రెండవకొమా ర్తెను గన్యాకుబ్జాధీశ్వరుఁ డైన విజయ పాలునకు నిచ్చెను. ఇందుఁ బెద్దకూఁతురు కొడుకు పృథివీరాజు.

చిన్న కూఁతురు కొడుకు జయచంద్రుఁడు. ఈ దౌహిత్రు లిరువురే యనంగపాలుని రాజ్యాధికారమున కుత్తరాధికారులై యుండిరి.

తన సంస్థానమును ముక్కలు గావించి మనుమల కిద్దఱకును బంచి యిచ్చుట కనంగపాలున కిష్టము లేక పోయెను. ఈ రాజ్యమంతయు నొక్కఁడే పాలింప వలయు నని యాతని యభిలాష. అట్లయిన నా యిరువురు దౌహిత్రులలో నెవరి యధికారము నెవరు వదలుకొందురు? సంస్థానమును విభాగింపకున్నచో నిరువురు మనుమలలో నొకఁ డనిష్టుఁ డగును. అంతియ కాదు. వారిలో వారు పరస్పరవినాశము నపేక్షింతురు. అనంగపాలున కప్పు డేమి గతి?

ఢిల్లీరాష్ట్రము విభాగింపఁబడ కున్నచో నీ సంశయము తీఱు నది గాదు. ఇది యంతయు నా వృద్ధుఁడు గమనించుకొనియే యుండును. దీని కేమి ప్రతీకార మూహించెనో యాతనికే యెఱుక. తన తరువాత ననంగపాలుఁడు ఢిల్లీరాజ్యమునకు సుస్థితిఁ గోరెనో వినాశము గోరెనో చెప్పఁ జాలము. దౌహిత్రుల నిరువురను సమానముగాఁ జూడకున్న లోకు లేమని పోదురో యని యాతనికి జంకు పుడమెనో లేదో వివరింపఁ జాలము. కాని యా వృద్ధుఁ డొక శుభముహూర్తమున నత్యంతసంతోషముతో ఢిల్లీరాజ్యమునకు బృథివీరాయనిఁ బట్టాభిషిక్తునిఁ గావించి నిశ్చింతతో విశ్రాంతి కొఱకు బదరికావనమునకుఁ బోయెను.

పుత్రు లెందఱున్నను జ్యేష్ఠపుత్రుఁడే రాజ్యాధికారి. అట్లగుట ననంగపాలుఁడు పెద్దకూఁతురు తనకుఁ బెద్దకుమారుఁడే యని భావించెనేమో. అతఁ డట్లు భావించెనేనిఁ బృథివీరాయనికి రాజ్య మిచ్చుట న్యాయ్యమే. కాని జయచంద్రున కట్టి భావన యన్యాయ్యముగాఁ దోఁచుట సహజము.

అనంగపాలుఁడు ఢిల్లీరాజ్య మంతయును బృథివీరాయనికిఁ బట్టము గట్టె నని వినినపుడు జయచంద్రుని హృదయక్షేత్రమునఁ బరాభవోద్భూతమై క్రోధాగ్ని హెచ్చుగ నెగసెను. అతని తల్లి తన తండ్రి చేసిన యన్యాయ్యమునకుఁ జాల వగచి యూరకుండెను. కాని జయచంద్రుఁడు మాత్ర మట్లు సేయక యనంగపాలునియెడలఁ జాలఁ దిరస్కారభావము దాల్చుటయే గాక, పృథివీరాజు నెడలఁ బ్రబలవిరోధిభావము వహించెను.

దాత నైనఁ గినిసినఁ గినియవచ్చును. కాని ప్రతిగ్రహీత పైఁబగఁ బూను టేటి ధర్మము? అనంగపాలుఁ డిచ్చినఁ బుచ్చుకొనియెఁ గాని ఢిల్లీ రాజ్య మంతయుఁ దనకే కావలె నని పృథివీరాజు కోరియుండ లేదు గదా? ఇఁక జయచంద్రున కాతనిపైఁ గోప మేల? ఇచ్చిన వాఁడును, బుచ్చుకొనిన వాఁడు నగుట ననంగపాలుఁడును, బృథివీ రాజు నొకటియే యని యాతని భావము. శత్రుని మిత్రుఁడు తనకు శత్రువు. కావున జయచంద్రున కనంగపాలునితోఁ బృథివీరాజు గూడ విరోధియే. విరోధి నుపేక్షించి యుండ రాదు. కావున జయ చంద్రుఁడు పృథివీరాయనిపైఁ బగఁ దీర్చుకొనుటకు సమయము నిరీ క్షింప సాగెను.

పగఁ దీర్చుట యనఁ గత్తియుఁ గత్తియుఁ గలుపుట యని యర్థము. దానివలన నెంత రక్తపాత మగును? ప్రజల కెంత సంక్షో భము కలుగును? అయిన నేమి? పూర్వకాలమున భరతవర్షమున నిట్టి ప్రసంగము లేవి తటస్థించినను గత్తియే యాధారము. ఇప్పుడో; అట్టి క్రూరకృత్యములతో నవసరము లేదు. ఎట్టి వివాదములు సంభవించి నను శాంతికి భంగము కలుగకుండఁ జక్కఁగఁ దీర్పు వా రిప్పుడు

కలరు. ఇట్టి యదృష్టము నా కాలపు భారతరాజు లెఱుఁగనే యెఱుఁగరు.

జయచంద్రుఁ డిట్టి సంకల్పములో నున్నాఁ డని వినినపుడు పృథివీరాజు గూడ జయచంద్రుని యెడల విరోధిభావమును దాల్చెను. ఆతని కట్టు సేయుట తప్పని దయ్యెను. ఈ రూపమున నా యక్క చెల్లెండ్ర కుమారు లిరువురును బరస్పరవినాశమునకై యుద్ధమునకుఁ దగు ప్రయత్నములను జేయుటలోఁ బ్రవృత్తులైరి. అదృష్టవశమున నే లోక పెద్దరాజ్యము సంక్రమించు రూపమునఁ దన యంగబలము నర్థబలము నిబ్బడి యగుటం జేసి పృథివీరాజు యుద్ధసన్నాహములను జేయుటయం దంతగాఁ దదేకదీక్షతో నుండ లేదు; గాని జయ చంద్రుఁడు కాల మంతయు దానియందే వినియోగింప సాగెను. పృథివీరాజు, "సామంతరాజులతో సముఁ డగు నీ యనూయావిద గ్ధుఁడు నన్నేమి సేయఁ గలఁ"డని గర్వములో నవ్వుకొన సాగెను.

అక్కచెలియండ్ర కొడుకు లగు నీ యన్నదమ్ము లిరువురు నిట్టి స్థితిలో నున్న సమయమున నబూగడమును బాలించు జైత పరమారుఁడు, నవలావణ్యవతియై యున్న తన కుమారిత యిచ్ఛ నీ కుమారికి వివాహముఁ జేయ వలయు నను తలంపులో నామె కను రూపుఁ డగు వరునిఁ జూచుచుండెను. ప్రముఖు లగు రాజు లెల్లరు నంతః కలహములలో నున్న యీ కాలమునఁ బ్రసంగము వచ్చినచో నందఱను జయింప సమర్థుఁ డగు రా జెవఁడా యని యాతఁడు పరి పరివిధముల నాలోచించుకొని, తుట్టతుదకు రెండు రాష్ట్రముల కధీ శుఁడై యున్న పృథివీరాజు తన కూఁతునకుఁ దగిన వాఁ డని నిశ్చ యించుకొనియెను.

ఇచ్ఛనీకుమారికిఁ దగిన వరు నన్వేషించుచున్నాఁ డని విని యనిహిలపురాధీశుఁ డగు భీముఁ డామెయందు బద్ధానురాగుఁడై, యామెను దన యంతటి వాని కిచ్చుటకు జైతుఁడు సందేహింపఁ డని యూహించి వర్తమాన మంపెను; గాని యంతకు మున్నె జైతుఁడు తన తనయకు వరుని నిశ్చయించుకొని యున్న వాఁడు గావున "నీ కీయఁ జాల" నని భీమునకుఁ బ్రత్యుత్తర మంపి వేసెను. అంత నాశాభంగము వలన సంక్షుభితమనస్కుఁడై జైతుఁడు తన్నతి నీచముగా నగౌరవపఱిచె నని క్రోధపరవశుఁడై భీముఁ డాతనిపై యుద్ధమును బ్రకటించెను.

జైతుఁ డిది యంతయు విని భీముని చేతకుఁ దనలో నవ్వుకొని, తన మనోనిశ్చయమును, భీమోద్యోగమును దెలుపుచు, వెంటనె వచ్చి యిచ్ఛనీకుమారినిఁ బరిగ్రహింపు మని పృథివీరాజునకు వర్తమానము చేసెను. పృథివీరా జంతకుఁ బూర్వమే యిచ్ఛనీకుమారి రూపలావణ్యాతిశయములను విని యామె యెడల ముగ్ధుఁడై యుండెను. అయిన నామెను దన కిమ్మని జైతునకు వర్తమాన మంపినచోఁ దన ఘనతకు లోప మని భావించి యామెతో విలాప ముగఁ గాలము గడప నువ్విళ్లూరుచు గుట్టుగా నుండెను. అట్టి వాఁ డగుటం జేసి యాతఁడు జైతుని యాహ్వానము నంగీకరించి యాతనికి సాయము సేయుటయే ముఖ్యకారణముగాఁ బ్రకటించి, చతురంగ బలముతో బయలువెడలెను.

చాళుక్యభీమునకు, జైతుఁడు తన్ను నిరాకరించుటచే నాతని నోడించుటయు, నిచ్ఛనీకుమారినిఁ గైకొనుటయు నే ప్రథమోద్దేశము లుగా నుండెను; గాని జైతునకుఁ బృథివీరాజు సాయము వచ్చుట

విని, యిచ్ఛినీకుమారి నిచ్చుటకు జైతుఁడును గ్రహించుటకుఁ బృథివీరాజును గృతనిశ్చయులై యున్నా రని తలంచి పృథివీరాజపరాభము గూడఁ గావింపవలె నని నిశ్చయించుకొని యతిరభసంబున వచ్చి యాబూగడసైనికులను దాఁకెను.

ఇరుతెగలవారు నత్యుత్సాహముతోఁ దలపడిరి. శత్రుసైనికులు సంఖ్యయం దధికముగ నున్న కారణమున, జంకు వొడమి పాఱిపోకుండుటకును, నధికోత్సాహముతోఁ బోరుటకును భీముఁడు తన సైనికులను యుద్ధరంగము నుండి కదలకుండ బహుమతు లను నాశాపాశముచే దృఢముగఁ గట్టివైచెను. ఢిల్లీసైనికులు పృథివీరాయని యాధిపత్యము క్రిందికి వచ్చిన తరువాతి నిదియే తమ పరాక్రమ ప్రదర్శనమునకుఁ బ్రథమప్రయత్న మగుట నాతని యాదరమును సంపాదింపఁ గోరి శక్తికి మించి పోరసాగిరి. ఢిల్లీపౌఁజుల సాయంబున జయము గాంచె నను నపకీర్తి కలుగకుండవలె నని యజమీరు దండు మిగుల సాహసముతోఁ బోరసాగెను. ఇచ్ఛనీకుమారినిఁ బడయఁ గోరి పృథివీరాజు తన యఖండచతురంగబలముతో వచ్చి సాయము సేయకున్న గుజరాతిసైనికుల ప్రతాపానలమునఁ బడి మ్రగ్గిపోయి యుందు రని ప్రజలు తలంపకుండ నుండఁ గోరి యబూగడసైనికులు గూడ నతినైపుణ్యముతో శత్రుసంహారమును గావింపఁ దొడఁగిరి. ఇట్టి యుద్ధము చాల ఘోరముగ జరిగెను. అనేకయోధులు మడిసిరి. రక్తము కాల్వలు గట్టి ప్రవహించెను. తుట్టతుద కనిహిలపురసైనికులు పలాయనము చిత్తగించిరి. భీముఁడు తిరిగి చూడకుండఁ బాఱిపోయెను. పృథివీరాజు జైతునకు విజయలక్ష్మి నొసంగి తా నిచ్ఛనీకుమారినిఁ బుచ్చుకొనియెను.

మే మనేక రాజపుత్రికల పరిణయకథలను విని యున్నాము. కాని రక్తపాతము లేకుండ జరిగిన వివాహము లొకటి రెంటికంటె నెక్కుడు విని యుండ లేదు. అనేక వివాహములయందు వరులు కురుకులకాంతారదవానలుం డగు భీమసేనుఁడు దుర్యోధనరక్తముచే నార్ద్రము లగు కరములతో యాజ్ఞసేని పెన్నెరులను ముడిచి నట్లు వైరివీరుల రక్తముచే నార్ద్రము లగు చేతులతోడనే వధూకంఠసీమలయందు మంగళసూత్రములను ముడివేయుట తటస్థించుచు వచ్చినది. దంపతుల ప్రబలానురాగమునకును, దనన్తకాలమున ననంతసౌఖ్య సంతోషములకును గారణము లగు నన్న స్వయంవరసమావేశము లన్నియు రణరంగములుగనే మాఱి పోయినవి. కొన్ని సమయముల యందు వధువు బంధువులును, మఱికొన్ని యెడల వరుని బంధువులును గూడ మడియుటయో జర్జరితాంగు లగుటయో గూడఁ దటస్థించుచు వచ్చినది. మఱి కొన్ని యెడలఁ బెండ్లికూతుండ్రు సైతము కత్తి పట్టవలసి వచ్చె. ఒకపుడు వధువు గోరిన వరుఁడు సమయుటయు, మఱియొకపుడు వధువే గతించుటయుఁ గూడ సంభవించినవి. ఒక రాజు తన కూఁతు నిరువురు రాజులు కోరుటచే నం దేరి కిచ్చుటకును సాహసింపలేక స్వయముగ నామెను విషమిచ్చి చంపుకొనియెను. ఒకప్పుడు పెండ్లియైన పిదప వరుఁడు పెండ్లికూఁతును దన పట్టణమునకుఁ దీసికొని పోవుచుండఁగా విఫలమనోరథు లగు రాజపుత్రులు కొందఱు మార్గమున నడ్డుపడి వధూవరుల నిరువురను గూడఁ బరలోకమున కంపివైచిరి. ఇంకొక యప్పు డొక వధువు తన కొఱ కాసపడి వచ్చిన క్షత్రియకుమారులు మార్గమధ్యమున నడ్డుకొని తనభర్తనుఁ బరలోకమున కంపివేయ నామె యిఁక వైవాహికజీవితము భారమై పోయె నను నిర్వేదముతో నొకచేయి పుట్టినింటికా

రికిని, వేఱొక చేయి యత్తింటివారికిని జ్ఞాపకార్థ మంపి స్వయముగ నసురుఁబోసెను. వేఱొకపు డిరువురు రాజు లొక రాచకన్నెను మోహించి విరోధపడి తమ జీవితకాల మంతయు యుద్ధరంగముల యందే గడిపివైచిరి. ఇట్టి యుదాహరణము లనేకము ఉన్నవి. రాజుల కిది సహజమా? లేక గౌరవమా?

అట్లు పాఱిపోయిన భోలాభీముఁడు జైతపరమారునిఁ బృథివీరాయని గెలుచుటకు మఱల నుపాయములను బన్న సాగెను. అతఁ డిచ్ఛనీకుమారీపృథివీరాయల దాంపత్యమున కెన్నఁటికైన నెట్లయిన విఘాతము గలిగింపవలె ననియు, నల్లుని బలము చూచుకొని మత్తెక్కి యున్న జైతు నెన్నఁటికైన సంహరించి తీఱవలె ననియు దృఢసంకల్పము గావించుకొనియెను. మఱియు, నంత పని తన యొక్కని వలననే నెఱవేఱఁ జాల దనియుఁ దనకు సాయము సేయఁగల రాజెవ్వఁడా యనియు, నంతటి సమర్థత గల వారిలోఁ బృథివీరాయని ప్రాఁతశత్రువు లెవరైన నున్నారా యనియుఁ జూడసాగెను.

ఇది యిట్లుండ నిచ్ఛనీకుమారి కొఱకైన మహాసంగ్రామవార్తను, భోలాభీముని పలాయన వృత్తాంతమును, ఢిల్లీశ్వరుని విజయప్రసంగమును, విని జయచంద్రుఁడు చాలఁ గంటగించుకొనియెను. మఱియు, వాఁ డిట్లే యౌదాసీన్యము వహించి యూరకున్నఁ బృథివీరా జింకను బలాధికుం డగు ననియు, నప్పుడు గోటఁ దీర్పఁదగినది గొడ్డంటఁ దీర్చ వలసి వచ్చు ననియుఁ దలంచి, పృథివీరాయనిపై దండెత్తుటకుఁ జాలఁ దీవ్రముగఁ బ్రయత్నించుచు, నీ సందర్భమున ఢిల్లీశ్వరుని వైరి యగు భీమునితో స్నేహము సేయుట ముఖ్యావసర మని తలంచి తద్విషయిక ప్రయత్నములు గూడఁ జేయ సాగెను.

మహావీరుఁ డగుటను, ఢిల్లీశ్వరుని వైరి యగుటను జయచంద్రునితో మైత్రి నెఱపుట యావశ్యక మని తలంచి భీముఁడు సైతము తత్ప్రయత్నములోఁ బ్రవృత్తుఁ డయ్యెను. పరస్పరస్నేహము కొఱకు వాంఛించి యున్న యా యిరువురును శీఘ్రకాలమున నభీష్టసిద్ధి వడసిరి. ఈ సమయమునఁ బృథివీరాజునకు నాగపురము నొద్ది ఖటుపురమునం దొక గొప్ప నిక్షేపము దొరకుటయు, జందేలు రాజుతో యుద్ధము పొసఁగి యందు జయలాభము గలుగుటయుఁ గూడ సంభవించెను. ఇది విని భీమజయచంద్రులు మఱింత తల్లడిల్లిరి.

పిదప వా రిరువురును దమ బలాబలములను గుఱించియు, వెగిరి బలాబలములను గుఱించియు విచారణ ప్రారంభించిరి. మామ యగుట జైతపరమారుఁడును, భావుకుం డగుట మేవాడు రాజ్యాధీశ్వరుం డగు సమరసింహుఁడును, మఱికొందఱు సామంతరాజులు నవశ్యము పృథివీరాజునకు బాసటై వత్తురని నిశ్చయించుకొని యందఱను దాఁకుటకుఁ దమకు శక్తి కలదా యనియుఁ, దమ కెవ్వరు సాయము వత్తురనియు యోచించుకొనిరి. కాని వారి కెందును సాహాయ్యము గాన్పింప లేదు. ఒక రిద్దఱు చిన్న రాజులు దక్కఁ దక్కినవా రెల్లరు నా యాయి కారణములను జెప్పి వారి యాహ్వానమును నిరాకరించిరి.

ఒక రిద్దఱు రాజుల సాహాయ్యములో వారికిఁ దృప్తి గలుగ లేదు. ఇఁక నొక మహావీరుఁ డెవ్వఁ డైన సాయపడకున్నఁ దమ కపజయము తప్ప దని తలంచి వారు దేశ మంతటను దృష్టిఁ బఱపి చూచిరి; గాని భారతీయుఁ డైన వాఁ డెవ్వఁడును ఢిల్లీశ్వరునితోఁ బోరుట కంగీకరింప లేదు. వెంటనే వారి దృష్టి హిమాలయపర్వత

మును భేదించుకొనిపోయి తురుష్కస్థానమునందలి గజ్నీపట్టణ ముపైఁ బడెను. అప్పు డా పట్టణమును గ్యాసుద్దీను శహాబుద్దీను ను గోరీవంశజు లగు నిరువు రన్నదమ్ములు కలిసి యతిమైత్రితో బరిపాలించుచుండిరి. వా రిరువురును శౌర్యసాహసములయం దసామాన్యు లని పేరు వడసియుండిరి. మఱియు వా రఖండవాహినీపరివృతు లగుటఁ జూచి వారి సాహాయ్యంబున ఢిల్లీశ్వరుని విలాసమాత్రమున గెలువ వచ్చు నని తలంచి భీమజయచంద్రులు వారి సాయమును గోరిరి.

ఈ యాహ్వానము వచ్చుటతోడనే యా యన్నదమ్ము లిరువురు నుప్పొంగి పోయిరి. ఇంతకుఁ బూర్వము వారు భరతవర్ష మసారము లగు ధనరాసులకు నిలయ మనియు, మున్ను గజ్నీమహమ్మ దనేకపర్యాయములు భారతదేశము నతిసులభముగ దోచుకొని యనంతధనసంపత్తినిఁ దీసికొని పోయె ననియుఁ దెలిసి యున్నవా రగుటం జేసి భారతదేశము నెప్పుడు ముట్టడింతుమా యని సమయము కొఱకు నిరీక్షించు చుండిరి. అక్కృతన నీ యాహ్వానము వచ్చుటతోడనే యందుల కంగీకరించి, యసంఖ్యాసైనికులను గూర్చుకొని శహాబుద్దీనుఁడు, పృథివీరాయని జయించుటకును, భారతదేశమునఁ జంద్రధ్వజమును నెలకొల్పుటకును, భీమజయచంద్రులకు సాయము చేయుట కని వంక పెట్టి వచ్చి చేరెను.

భీమజయచంద్రులు శహాబుద్దీనుని సాయము గోరి రని విని యభిమానవిధాను లగు రాజులు కొందఱు వారినిఁ జాలఁ దూలనాడిరి. దేశీయు లెల్లరును జాలఁ గటకటం బడిరి. పృథివీరాజు చాల నొచ్చుకొనియెను. రాజ్యతంత్రజ్ఞు లిది దేశవినాశకం బగు

ప్రయత్న పని మిపులఁ దల్లడంపడిరి. అంతకు మున్నొకప్పుడు పండ్రెండు తడవలు దండెత్తివచ్చి భారతదేశమున గజ్నీమహమ్మదను తురుష్కుఁడు చేసిన రాక్షసకృత్యములను వృద్ధస్త్రీల వలన నాలకించి భారతరమణీమణు "లభిమానహీను లగు భీమజయచంద్రులు నాశమై పోదురు గాక" యని శపింప సాగిరి. మొత్తము మీఁద నత్తురుష్కుని రాక విని భారతీయు లాబాలగోపాలమును జాలఁ గలవరం పడసాగిరి.

కొందఱు రాజులకు భీమజయచంద్రులపైఁ జాల నాగ్రహము వచ్చెను. వారియందెల్లఁ జిత్తూరు దుర్గాధీశ్వరుం డగు సమరసింహుఁడు ముఖ్యుఁడు. అతఁడును మఱికొందఱు నీయకృత్యముకొఱకు భీమచంద్రులకుఁ దగిన శిక్ష సేయ వలయు నని పృథివీరాజునకు సాయముగా వచ్చిరి. యుక్తసమయమున నుభయపక్షములకును యుద్ధము పొసఁగెను. స్థలసంకోచమువలన మే మీ యుద్ధమును విపులముగ వర్ణింపఁ జాలము. చాల ఘోరముగ జరిగెను. కొసకుఁ బాపము! భీమజయచంద్రులకుఁ బరాజయము తప్పినది కాదు. వారు పాఱిపోయిరి. శహాబుద్దీనుగోరీ పృథివీరాజుచేఁ జెఱ పెట్టఁ బడియెను.

ఈ వార్త నిముసములో దేశ మంతయు వ్యాపించి దేశీయుల నెల్లర నానందసాగరమున నోలలాడించెను. వారు కేవల మా యనిందితానందము ననుభవించుచు నూరకుండ లేదు. కొంద "ఱీ మానవాధములకుఁ దగిన ప్రాయశ్చిత్త మైన" దనిరి. మఱికొందఱు "న్యాయ్య మోడిపోవునా"? యనిరి. ఇఁక నొక కొందఱు "తుచ్ఛు లగు భీమజయచంద్రులను గూడఁ జెఱ పెట్టుట ల" గ్గనిరి. వేఱొక కొందఱు

“ముం దీ తురుష్కాధముని సంహరించి వేయ వలె” ననిరి. అందఱును బృథివీరాజుని, దత్పక్షమునఁ బనిచేసిన వారిని మిగులఁ గొనియాడిరి.

పిదపఁ బృథివీరాయఁడు చెఱబెట్టఁబడిన గోరీని వెంట నిడుకొని, యా మహాయుద్ధమున నత్యద్భుతముగఁ బోరిన సమరసింహాది వీరులను గూడుకొని మహావైభవముతో దిల్లీపట్టణము ప్రవేశించెను. పౌరు లెల్లరు నెదురుగఁ జని సగౌరవముగ వారినిఁ బురప్రవేశము సేయించిరి. పౌరకాంతలు సౌధోపరిభాగముల నుండి పుష్పవర్షము గురిసి వారి యానందమును బ్రవృద్ధము గావించిరి.

పృథివీరాజు నాఁడు కొలువుదీర్చి పౌరుల నెల్లరను దగునట్లు లాలించెను. సైనికులకు వారివారి కర్హము లగు బహుమతుల నొసంగెను. సేనానాయకులను, గుఱ్ఱములు, యేనుఁగులు, జాగీరులు, ఖడ్గములు మున్నగు పసదనముల నొసంగి గౌరవించెను. సాయము వచ్చిన సమరసింహుఁడు మున్నగు రాజులను జయ మంతయు మీదే యని కొనియాడి చాల బహూకరించెను. నాఁటి కొలువుకూటము వివిధము లగు నత్తరు సువాసనలచే మివుల గుబాళించెను. దేశమందంతట నొక్క మహానంద తరంగము వీచెను.

ఇట్లు కొన్ని దినములు గడచిపోయిన పిదపఁ గారాబద్ధుం డగు గోరీ తా “నజ్ఞానము వలన భీమ జయచంద్రుల పక్షమునఁ బోరాడితి” ననియు, “నీ ప్రథమాపరాధమును సైఁచి విడిచి పుచ్చ వలె” ననియుఁ బ్రార్థనాపూర్వకముగఁ బృథ్వీరాజునకుఁ దెలియఁ జేసెను. దానిపైఁ బృథివీరాజు సమక్షమున మాట లాడుటకు గోరీ కవకాశ మొసంగెను. పిదప నిరువురకు నేమి సంభాషణము

జరిగెనో, గోరి ప్రార్థనము మీఁదఁ బృథివీరాజున కేమి తోఁచెనో తెలియదు; గాని యాతఁ డెనిమిది వేల గుఱ్ఱములను దీసికొని గోరిని విడిచి పెట్టెను. బ్రతుకు జీవుఁడా యని గోరి స్వదేశమునకుఁ బోయెను.

ఇటుఁ జేఁ జిక్కిన వైరి నిట్లు విడిచిపుచ్చుట నీతియా యను నొక సందేహము గలుగుచున్నది. రాజ్యతంత్ర విశారదులు దీని కేమి ప్రత్యుత్తరము చెప్పెదరో తెలియదు. పృథివీరాజు పొరబడె నేమో యనుటకు మఱియొకప్పుడు "సముద్రశిఖర" మను పట్టణమునకుఁ బోయి వచ్చుచు మఱల శహాబుద్దీను గోరీచేత నే యెదిరింపఁబడి, యా యుద్ధమున లబ్ధవిజయుం డగుటయు గాక, గోరీనిఁ జెఱపట్టియు నసంఖ్యాధనమును దీసికొని మఱల వానిని విడిచిపెట్టెను. అంతటితో నూరకుండక యిట్లే యా గోరీవలన నింక నైదు తడవలు మార్కొనఁ బడి వానినిఁ జెఱపట్టియు విడిచిపెట్టెను. గోరీవలన నన్ని తడవలు నసంఖ్యాధనరాసులను గైకొనుట మాకు సమ్మతమే; గాని శరణించి విడిచిన కొలఁదిఁ దిరుగఁ బడు వానిని విడుచుటను గుఱించియే సందేహము. అట్టివానివలన ధనము గైకొనుటయే నీతి యగునా? దీనముగఁ బ్రార్థించినపుడు విడుచుట ధర్మ మందు రేని నా విషయమున మేము మాట్లాడఁ జాలము; గాని సందిగ్ధము లగు రాజకీయ విషయముల యం దట్టి ధర్మమును బాటించుట లగ్గని మే మంగీకరింపఁ జాలము. ఏడు పర్యాయములును గూడ గోరీని విడుచుటలోఁ బృథివీరాయని యాస్థానమున నున్న మంత్రి మున్నగు రాజ్యతంత్రధురీణుల యభిప్రాయము లెట్లుండెనో చరిత్రములవలనఁ దెలిసికొనఁ జాలము.

ఈ రెండు దండయాత్రల యందును గోరీ కసంఖ్యాధననష్టము, సమితబలనష్టమును గూడఁ గలిగెను. మాననష్టము ప్రప్రథమమునందే కలిగెను; గాని ధైర్య నష్టము మాత్ర మెంత మాత్రమును గలుగలేదు. కావున నాతఁ డెట్లయినఁ బృథివీరాయని జయించి భారతదేశమునఁ దురుష్క సామ్రాజ్యమును స్థాపింపవలె నని దృఢదీక్షను దాల్చెను. ఆ యభిప్రాయముతో నాతఁడు భారతదేశాధీశ్వరుల రహస్యములను దెలిసికొనుటకును వీ లయినపుడు వారిలో వారికి నంతఃకలహములు గలిగించుటకును, బైరాగి, గోసాయి మున్నగు వేషములతోఁ దన చారులను నియమించెను.

ఏమో సాయము సేయు నని కొండంత యాశపడి తీసికొని వచ్చిన గోరీ యిట్లేడు పర్యాయములు పరాజయము నంది నెత్తిపై ముసుఁగు వైచుకొని పోవుటచే భీమజయచంద్రులు కొంతకాలము వఱకు యుద్ధమును మానియుండఁ దలచుకొనిరి. కాని తనకును, బృథివీరాజునకును సార్వభౌమాధికారమును గుఱించి వివాదము గలిగి యున్నందునఁ దానే సార్వభౌముఁడ నని ప్రకటించుటకు జయచంద్రుఁడు రాజసూయయాగము సేయ సంకల్పించుకొనియెను. మఱియు, నా యాగమునందే తన కూఁతురు సంయుక్తకు స్వయంవరము సేయవలయు నని గూడ నిశ్చయించుకొనియెను.

యుక్తసమయమున రాజసూయయాగమునకు వలయు సాధనసామగ్రి యంతయు సమకూర్పఁబడెను. చుట్టములు, పక్కములు, సామంతులు, స్నేహితులు, నాశ్రితులు మున్నగు వా రెల్లరును జనుదెంచిరి. వేదవేదాంగములయం దసామాన్యు లని విఖ్యాతి వడసి జయఘంటలం గట్టుకొనిన విద్వత్ప్రకాండు లనేకు లాహూతులై

వచ్చి చేరిరి. పట్టణ మంతయు జనసంకులమై పోయెను. ముహూర్తము సమీపించెను. మంగళస్నానము గావించి ధర్మపత్నీ ద్వితీయుఁడై బ్రాహ్మణశ్రేష్ఠుల వేదఘోషములతో మిళితములై, సామంతాదుల జయఘోషములు బ్రహ్మాండ మంతయుఁ బ్రతిధ్వని నీనుచుండ జయచంద్రుఁడు యజ్ఞశాలను సమీపించెను. కాని యిది యంతయుఁ దన చారుల మూలమున నెఱింగి పృథ్వీరాయఁ డా యాగమున కంతరాయము గలిగింపఁ దలఁచి జయచంద్రుని సన్నిహితజ్ఞాతి నొకనిం జంపి యా వార్త నాయజ్ఞశాలచెంతఁ బ్రకటన సేయించెను.

పృథ్వీరాజు, సన్నిహితజ్ఞాతినిఁ జంపి జయచంద్రుని యాగమునకు విఘాతము గలిగించుటఁ జూడ మాకుఁ జాల నాశ్చర్యమును గొలుపుచున్నది. ఇట్లు వ్రాయుటకుఁ జరిత్రకారుల కేమి యాధారము లున్నవో తెలియదు. మే మిది కేవల మబద్ధమని చెప్పుటకు సాహసింప లేము; గాని, యనేకపర్యాయములు తన ధాటి కోర్వఁ జాలక పాఱిపోయిన జయచంద్రుని యాగమును భగ్నము సేయఁ బృథ్వీరా జిట్టి నీచపుఁ బని కొడిగట్టుట కవసర మేమి వచ్చెనో యూహింపఁ జాలకున్నారము. రాజుల నందఱను జయించి, వారినుండి కప్పములను గొనిగదా రాజసూయము సేయవలసినది? జయచంద్రుఁ డట్టి ప్రయత్నము లేవియుఁ జేసినట్లు కాన్పింపదు. జయచంద్రుని రాజసూయమును విచ్ఛిన్నము సేయుటకుఁ, బృథ్వీరాజు తనయఖండదోర్వీర్యము వలనను బూనుకొనవచ్చును. పూర్వవైరమును బురస్కరించుకొనియు సిద్ధపడవచ్చును. కాని యుద్ధము చేసి దానిని ధ్వంసము సేయవలయునే గాని, మానాభిమానములు లేని సామాన్యజనులు చేయు నిట్టి కృత్యమును జేయుట పృథ్వీరాజునకుఁ గలంకకారణ మని నిస్సందేహముగఁ జెప్పవచ్చును. లోకములోఁ

దమ శత్రువుల యింట వివాహాదిశుభకార్యములు జరుగునపు డోర్వ లేని వారు కొందఱు ఆశౌచమును బట్టుచు నెల్లరకును దెలియు నట్లు ప్రతిస్థలమునందును జాటిచెప్పుచును, గంధపుఁబొట్లు పెట్టుకొని యును, దొంగవార్తల నంపుచును గార్యవిఘ్నమును గలిగించుట గలదు. కాని యట్టి పని పృథివీరాయని యంతవానికిఁ జేయఁ దగినదియా ?

ఎట్లయినను జయచంద్రుని యాగము విచ్ఛిన్నమై పోయినది. ఈ పరాభవబాణము జయచంద్రుని నల్లగుండెకుఁ దీవ్రముగఁ నాటెను. మఱల జయచంద్రుఁడు పృథ్వీరాజుపైఁ గత్తి కట్టునని ప్రజలు తలంచిరి. సైనికులు ఢిల్లీయజమీరుల దండులపై గత్తులు నూరసాగిరి. ఈ తడవ మా ప్రతాపముఁ జూడుఁడని క్రొత్తయోధులు మిత్రుల చెంతఁ బ్రగల్భములు కొట్ట సాగిరి. కాని జయచంద్రుఁడు యుద్ధము మాటఁ దలపెట్ట లేదు. అతఁడు యాగము విచ్ఛిన్నమై పోయినను గూఁతురు స్వయంవరమును మానఁ దలంప లేదు. మఱియొక సుముహూర్తమున నది యథాప్రకారముగ జరుపునట్లు చాటించెను.

సంయుక్తాస్వయంవరదినము సమీపించెను. దేశదేశములనుండి యందగాండ్రమని విఱ్ఱవీఁగు రాజపుత్రు లనేకులు మహేంద్రవైభవములతో వచ్చి చేరిరి. జయచంద్రుఁ డందఱకును స్వాగతము నొసంగి యర్హనివేశముల విడియించెను. కన్యాకుబ్జపౌరు లెల్లరును పూర్వపుఁ గల్లోలములను మఱచి మహోత్సాహముతో నుండిరి. పట్టణ మంతయు స్వర్గమువలె దేదీప్యమానమై జనసంకులమై పోయెను. పరస్పర విరోధు లగుటంజేసి జయచంద్రుఁడు పృథివీరాజును బిలువలే దని గాని, పృథివీరాజు రాలే దని గాని మేము వ్రాయవలసిన పనిలేదు.

ఒకనాఁడు శుభముహూర్తమున స్వయంవరసభ కూర్పఁబడియెను. రాజపుత్రు లెల్లరును గంభీరవేషములను ధరించి ప్రత్యేక స్థలమునందలి యున్నతాసనములపై సదర్పముగఁ గూర్చుండి యుండిరి. బంధుగులు, స్నేహితులు, ప్రేక్షకులు మున్నగు వారు నిర్దిష్ట స్థలములయం దాసీను లైరి. జయచంద్రుఁడు పృథివీరాజు నెడలఁ దనకుఁ గల వైర మంతయుఁ దీఱిపోవున ట్లాతని ప్రతిమ యొకటి చేయించి దానిని "ఢిల్లీశ్వరుఁడు నా ద్వారపాలకునితోఁ దుల్యుఁ" డను భావముతో ద్వారమున నిలిపెను. అది చూచి సభ్యులనేకవిధభావనలకు లోనైరి. కాని యెవరును మాట్లాడ లేదు. అంతటను గాంభీర్యము విరాజమాన మగుచుండెను.

అంతఁ బుష్పమాలికను జేఁబూని సఖీజనములు వెంటరా రూపొందిన సౌందర్యాధిదేవతవలె సంయుక్త సభాస్థలమునకు వచ్చెను. నవలావణ్యావలియై కుసుమమాలికను జేఁబూని గంధర్వరమణివలె నున్న సంయుక్త నారసి రాజపుత్రు లెల్లరును ముగ్ధులై పోయిరి. ప్రతిరాజపుత్రుఁడును సంయుక్త తప్పకుండఁ దన్నే వరించు నని గంపెఁడాశ పెట్టుకొని యుండెను. ఇందఱు రాజపుత్రులలో నీ బంగరుబొమ్మ నలంకరింపఁ గల రాజమణి యెవఁడో యని ప్రేక్షకు లెల్లరు నాలోచనాధీనులై యుండిరి. జయచంద్రుఁడును డోలాయమానహృదయుఁ డయ్యెను. శుద్ధాంతజనము గూడ నట్లే యుండెను. అంత రాజవర్ణనము సేయుటకు నియుక్త యగు చేటి యొక రాకుమారుని చెంతకుఁ దీసికొని పోవుటకు సంయుక్త చేయి పట్టుకొనియెను. అప్పుడు సంయుక్త హృదయమున నొక్కమాఱు మహోగ్ర ప్రవాహము వెల్లివిరిసి పోయెను. కాని వెంటనే తెప్పిరిలి సంయుక్త చేటిచేయి విడిపించుకొని మదపుటేనుఁగు గున్న

పోలె గంభీరగమనమునఁ బోయి ద్వారపాలకుని స్థలమునం దున్న పృథ్వీరాయని ప్రతిమ మెడలోఁ గుసుమదామమును గీలించెను.

వెంటనే సభయందంతట నొక గొప్ప కోలాహలము ప్రారంభ మయ్యెను. అందఱు ననేకవిధములఁ జెప్పుకొన సాగిరి. సంయుక్త యీ కోలాహలము నేమియు లక్ష్యము సేయక తిన్నగ శుద్ధాంతమునకుఁ బోయెను. స్వయంవర మిట్లగు నని యెవ్వరు ననుకొన లేదు. సంయుక్తతల్లి మందహాసవదనారవిందయై తన యల్లుఁ డే రాజకుమారుఁడో తెలిసికొన నువ్విళ్లూరుచుఁ గన్నులు సంయుక్తమీఁదనే పెట్టుకొని యుండెను. తక్కిన స్త్రీ లెల్లరును గరకంకణములైన ధ్వనిచేయకుండఁ బుత్తడిబొమ్మలవలె నిలిచి యుండిరి. జయచంద్రుఁడు భావరహితము లగు చూపులతో రాజపుత్రుల నెల్లరను గలయఁ జూచుచుండెను. పాపము వారి యాశ లన్నియు నిట్లు భగ్నములై పోయెను. ఎల్లరును వెల్లవోయిరి. జయచంద్రుఁడు మహోగ్రుఁడై మండిపడుచు "సుశీల యగు దీనినిఁ గారాగారమున బంధింపుఁ డని యఱచి లోనికిఁ బోయెను. పాప మాతని కంతకంటె నవమానకరం బేమి యున్నది? రూపరాశి యగు సంయుక్త కొఱకుఁ బుట్టెఁ డాశతో వచ్చి, యామె స్వయంవర సభలోఁ బ్రవేశించినపు డనేకవిధము లగు శృంగారచేష్టలను గావించిన రాజకుమారు లెల్లరును నిర్విణ్ణులై, నిరాశాసంతప్త చిత్తులై వెడలి పోయిరి. ప్రేక్షకు లనేక విధములఁ జెప్పుకొనుచు నాస్థలము విడిచి పోయిరి. లోకుల నెవ రేమి సేయఁ గలరు?

సంయుక్త యట్లు రాణివాసమునకుఁ బోయినపిదప శుద్ధాంత జన మంతయు వచ్చి యామెను జుట్టుకొనియెను. ఆమెను గొందఱు కసరుకొనిరి. కొందఱు నీకిట్టిది తగ దనిరి. కొంద ఱిది యేమి

చిత్రమే యని సన్నసన్నముగఁ జెప్పసాగిరి. కొందఱు కోపపడిరి. ఆమెను వాద్దుమీఱి చీవాట్లు పెట్టుటలోఁ గొందఱ కంఠములు బొంగురువోయెను. ఎవ్వరును రాజపుత్రిక యని సందేహింప లేదు. ఎవరికిఁ దోఁచి నట్లు వారు నిందించిరి. బుగ్గలపైఁ బొడిచిరి. సిగ్గు లేని దానా! యని యెత్తి పొడిచిరి. అందఱికంటె నధికముగఁ బుత్రికాప్రేమను దిగమ్రింగి యా పెం తల్లి మండిపడియెను. కాని సంయుక్త యేమియు మాట్లాడ లేదు. మఱల గుసగుసలు మెండయ్యెను. రుసరుసలు ప్రబలెను. సంయుక్త యెరికిని జవాబు చెప్ప లేదు. మొగ మెత్తి యెరినిఁ జూడ లేదు.

కాలరుద్రునివలె గర్జించుచు నంతలో జయచంద్రుఁ డచ్చటకు వచ్చి సంయుక్తపైఁ జాలఁ గోపపడియెను. నీకిట్టి బుద్ధి యేల పుట్టె ననియెను. మతి పోయెనా యని కసరుకొనియెను. మా గౌరవ మంతయు మంటఁ గలిపితి వని తహతహ పడియెను. చూడు మేమి చేసెదనో యని పండ్లు పిండిచేసికొనియెను. పాపము కోపభరమ్మున జయచంద్రుని శరీర మాపాదమస్తకము వడఁకిపోయెను; గాని సంయుక్త యేమియుఁ జలింపలేదు. అప్పుడు గూడఁ దన వరాలనోట మాట్లాడ లేదు. సంయుక్త మౌనమువలన జయచంద్రుని క్రోధము మఱింత వృద్ధి యయ్యెను. వెంటనే యాతఁ “ డీ తుచ్ఛురాలినిఁ గైదులోఁ బడవేయుఁ” డని యఱచెను.

ఆ మాటయే రెట్టించి రెట్టించి పలుకుటవలన నది నిశ్చయమై నదియే యని భావించి చెలికత్తెలు సంయుక్త చేయి పట్టుకొనిరి. అంత జయచంద్రుఁడు ముందు బయలుదేఱి కారాగారము దెస దారి తీసెను. అప్పుడైనను సంయుక్త చలింపలేదు. వెంటనే యా

క్రొత్తపెండ్లికూఁతురు కైదులో బంధింపఁ బడియెను. అచ్చటి స్త్రీలలో నామె స్థితి నారసి "పాప మయ్యో" యని వగచిన వారొక్కరును లేరు. ఆహా! పెండ్లికూఁతు రని సకలోపచారములును జేయవలసిన యా స్త్రీసంఘ మప్పు డామెయెడల నెంత కాఠిన్యము వహించెను!

చుట్టములు గాని పక్కములు గాని తలిదండ్రులు గాని సంయుక్త భావ మేమో గ్రహింపఁ గలిగి రని చెప్పుటకు వీలులేదు. చిన్నతనమునుండియుఁ బెంచి పెద్దచేసిన దాదులును, నరమర యన నెట్టిదో యెఱుంగక చిన్నప్పటినుండియుఁ గలసిమెలసి తిరుగు చెలికత్తెలును గూడ గ్రహించిరో లేదో వారికే యెఱుక. చేష్టలను బట్టి గ్రహించిన వారు లే రనియే చెప్పవచ్చును. అయినను దలిదండ్రులకును, జుట్ట పక్కములకును, జెలికత్తెలకును గూడ వ్యతిరేకముగఁ బ్రవర్తించి కారాబద్ధ యైన సంయుక్త ముం దేమి చేయఁ దలఁచికొనినదో?

అటఁ బృథివీరాజు, తన యెడల జయచంద్రుఁడు గావించిన కృత్యమును విని మండిపోయెను; గాని సంయుక్త గావించినది విని వెంటనే పొంగిపోయెను. "జయచంద్రుఁ డంతటి సభలో నాకుఁ గావించిన యగౌరవమునకు నే వచ్చుటకుఁ బోకుండఁగనే ప్రతీకారము జరిగి పోయినది. అల్లారుముద్దుగఁ బెంచుకొనిన యాతని గారాలికూఁతురే తత్క్షణ మా దుశ్శీలుని మానమును దగ్ధము గావించివైచినది. ఆహా! సంయుక్త యెట్టి సుగుణమణి!" యని యాతఁ డామె ధైర్యసాహసాదులకు మెచ్చుకొనియెను; గాని యనుంగుబిడ్డయై యుండియుఁ దన గౌరవమును మంటఁగలుపుటచేఁ గోపోద్దీపితుఁడై

దురభిమానియగు జయచంద్రుఁడు, సంయుక్తను, సభలోఁ బలికినట్లు కారాగారమున బంధింపక మానఁడనియు, సహింపరాని బాధలు పెట్టక మానఁడనియు నిశ్చయించుకొని, ప్రాణములమీఁదఁ గూడ నాశవదలుకొని తన గౌరవమునకుఁ గలంక మొదవకుండఁ గాపాడిన యా కన్యాతిలకము నుద్ధరింపకున్నను, దనయెడల నతినీచముగఁ బ్రవర్తించిన జయచంద్రుని శిక్షింపకున్నను, దన ప్రాభవమునకును బౌరుషమునకును గలంకము కలుగక మాన దని తలంచి, ముఖ్యముగా సంయుక్త ప్రేమ త్వరపెట్ట వెంటనే ప్రయాణభేరిని మ్రోయింపించి యాకస్మికముగాఁ గన్యాకుబ్జనగర సమీపమున విడిసెను.

ఈ సమాచారమును విని కన్యాకుబ్జపౌరులు చాలఁ దల్లడిల్లిరి. జయచంద్రుని కోపాగ్ని మఱింత వృద్ధి యయ్యెను. అక్కఱతన నాతఁడు వెంటనే తన సైన్యమునందుఁ జక్కని వ్యవస్థ నేర్పఱిచి సంయుక్త యున్న కారాగారమును గుఱించి స్వయముగఁ జాల జాగ్రత్త పుచ్చుకొనసాగెను. పిన్నటనాఁట నుండియుఁ జెలికత్తెలై యుండియుఁ జెఱసాలను గాపాడు స్త్రీలు పాపము ముద్దరాలగు సంయుక్త యెడలఁ జాలఁ గాఠిన్యమును జూపఁ దొడఁగిరి. "పృథివీరాజు వచ్చెనని నీవు మురియ నక్కఱలేదు. అతఁడు ప్రాణములతోఁ బోవునపుడు చూతములే" యని వారపుడపుడు సంయుక్తను మర్మోద్ఘాటనము సేయ సాగిరి. కాని సంయుక్త యప్పుడు గూడ నేమియు మాట్లాడ లేదు. మనమున నించుకేనియు జంకు వహింపలేదు. పయింబయిగఁ బృథివీరాజు రాక నాలకించిన నాఁటఁగోలె నామె మఱింత గాంభీర్యమును దాల్చెను. ఈ లక్షణములను జూచి యెల్లరు నామెకు మతిపోయిన దని తలంచిరి.

వాఁటి రాత్రి యిరుతెగలవారును సమరసన్నాహములలోఁ బ్రవేశించిరి. జయచంద్రుఁడు పృథివీరాజు నెదిరించుటకుఁ గహారకం తీరుఁ డను సేనాధ్యక్షుని యాధిపత్యము క్రింద మూఁడు వేల సైన్యము నేర్పాటు గావించి యుంచి దుర్గమునందుఁ జాలఁ గట్టుదిట్టములు గావించెను. బురుజు లన్నియు ఫిరంగీలతో నింపివేయించెను. ప్రాకారములయం దెల్లయెడల సైనికులను నిలిపెను. కొందఱు సేనాధిపతులు కోటలోపలను వెలుపలను నిలిపిన సైనికులను బరీక్షించుట కాయంధకారపరీత మగు నిశీథసమయమున నశ్వారూఢులై పటాక్షేపముతో నటునిటు సంచరింప సాగిరి.

సంయుక్త కీ సంగతి యెట్లో తెలియవచ్చెను. వెంటనే సంయుక్తయు నిరువురు చెలికత్తెలును బురుషవేషములను దాల్చి గుఱ్ఱముల నెక్కి సేనాపరీక్ష గావించు సేనానులవలె నటించుచు దుర్గమును దాఁటి పృథివీరాయని సేనానివేశము దెసకు గుఱ్ఱములను డాయించిరి. కాని వారి నెవ్వరును జూచి యుండలేదు. చెఱసాలలో దాసీలు సంయుక్తకుఁ గలిగించిన వన్నియుఁ దమపై రాజునకు విశ్వాసము గలుగుటకై కల్పించిన కృత్రిమబాధలే కాఁబోలు! ఔరా! స్త్రీల చాతుర్యము! పృథివీరాజు సంయుక్త రాక కెంతయు నలరి, యామె సాహసము నెంతయు మెచ్చుకొని యామె నప్పుడే గాంధర్వ విధిం బరిణయ మయ్యెను.

ఈ వివాహవిధానము భారతధర్మశాస్త్రమునకుఁ గేవలము వ్యతిరేకముగ నున్నది. పృథివీరాజజయచంద్రు లక్కచెల్లెండ్ర కుమారు లగుటంజేసి సంయుక్త పృథివీరాజునకుఁ గూఁతురు. ఇట్టి సంబంధమును భారతీయుఁ డైన వాఁ డెవ్వఁడును జేసికొనక పోవు

టయే గాక యిట్టిది జరిగె నని వినినచోఁ జాలఁ గంటగించుకొన కుండ నుండఁ జాలఁడు. అట్టి యెడల సంయుక్త పృథివీరాయనిఁ బ్రేమించుటయుఁ నాతఁ డామె ప్రేమ నంగీకరించుటయుఁ జూడఁ జాల నాశ్చర్యముగ నున్నది. అప్పటి వా రెవరైన దీనిని గురించి యాక్షేపణలు సేసిరో లేదో చెప్పుటకుఁ జరిత్రములయం దాధారములు కాన్పింపవు. చరిత్రకారులు గూడ దానిని జాఱవిడిచిరే గాని యాక్షేపించి యుండలేదు. ఇట్టి వివాహములు భారతీయేతరుల యందు జరుగుచున్నట్లు విందుము. భారతధర్మశాస్త్రమునందుఁ గొన్ని వావులును, విశేషించి కొందఱు బంధువుల కన్యకలును వివాహములయందు స్వీకర్తవ్యలు గా రని నిషేధము లేర్పడి యున్నవి. మేనఱికమును జేసికొనుటకుఁ గూడఁ గొంద ఱంగీకరింపరు. భారతీయ వివాహములలో శాస్త్రమునకును, లోకమునకును గూడ విరుద్ధముగ జరిగినది సుప్రసిద్ధ మగు ద్రౌపదీపరిణయ మొకటి కాన్పించుచున్నది. అయినను దానినిఁ గొన్ని కారణములు చూపి వ్యాసభగవానుఁడు విశేషవిధిగా సమర్థించి యున్నాఁడు. ఈ సంయుక్తాపరిణయమును గూడ నెవరైనఁ గారణములు చూపి విశేషవిధిగా సమర్థింపఁగలరా? దీనినిఁ గేవలాక్రమవివాహములలోఁ బరిగణించుటకు మా కనుజ్ఞ నొసంగెదరా?

సంయుక్తరాకయు, నీ వివాహవృత్తాంతమును గూడ సంయుక్త చెలికత్తెలకుఁ దక్క దిల్లీ సేనానివేశమున నైత మేరికినిఁ దెలియదు. కాని కొంత తడవున కెట్లో సంయుక్త సఖీసమేతయై చెఱనుండి తప్పించుకొని పృథివీరాయనిఁ జేరె నని జయచంద్రునకుఁ దెలియవచ్చెను. అప్పు డాతనికిఁ గలిగిన కోపమును, దుర్గమునం దంతటను బొడమిన కలవరమును మేము వివరముగ వర్ణింపఁ జాలము.

వెంటనే జయచంద్రుని యనుజ్ఞ నంది సంయుక్తాపృథివీరాయలం
బట్టితెచ్చుటకుఁ గహారకంఠీరుఁడు తన మూఁడువేలసైన్యముతో రహ
స్యముగ బయలుదేరెను.

కాని, యంతకుము న్నిట్టిది సంభవింపవచ్చు నని కన్యాకుబ్జన
గరమునకును, దన శిబిరములకును నడుమఁగల యంధకారపరీత మగు
విశాలప్రదేశమునఁ బృథివీరాజు తన భటుల నటనట నుంచుటంజేసి
కహారకంఠీరుని రహస్యము దాఁగినది కాదు. ఢిల్లీభటులు వారినిఁ
జూచుటతోడనే సంకేతానుసారముగఁ గాహళముల నూఁదిరి. దిక్కు
హారములు ముఖరితములు సేయు నా బాకాధ్వనుల నాలకించి
యంతకుముందే సమరసన్నాహములతో నున్న ఢిల్లీసైనికులు బారులు
దీరి ముందునకు నడచిరి. దాని కాతతాయి యను నతఁడు నాయకుఁడై
యుండెను. పృథివీరాజు గూడ సంయుక్త చెంత సెలవు గైకొని
హరహరా! యని యుద్ధరంగమున కుఱికెను.

అంత భేరీభాంకరణంబులును సింహనాదంబులును మిన్ను
ముట్ట యుద్ధము ప్రారంభ మయ్యెను. వీరు కాల్బంటులు, వీరు
రాహుత్తులు నను భేదము లెక్కసేయక సంకులసమరము ప్రారం
భించిరి. మత్తగజములు నడగొండలవలె ఘీంకారములు సేయుచు
నెదుటి వారి నెల్లరినిఁ ద్రొక్కి చంపుచుండెను. ఎందఱో యోధుల
యుత్తమాంగములు బంతులవలె నెగిరిపోవుచుండెను.

అప్పుడు కహారకంఠీరుఁడు, నాతతాయియు ద్వంద్వయుద్ధము
నకుఁ దలపడిరి. నాగాయుతబలులును, బరస్పరమును దుల్యులు నగు
వారి పోరంతయు ఘోరం బయ్యు, నెంతో దర్శనీయముగ నుండెను.
వారి భ్రూభంగములును, సింహనాదములును, బరివర్తనములును,

లంఘనములును, బంతములును, మిగుల హృదయంగమములై యుండెను. అంతకంతకు వారికి శౌర్య మెక్కు డయ్యెను. ఆ సందర్భమున నతి లాఘవముగ నాతతాయినిఁ దన ఖడ్గభుజంగికి బలియిచ్చి కహారకంఠీరుఁడు విజయానందంబునఁ జేర్చి యార్చుచు దిల్లీసైన్యము నురుమాడఁ జొచ్చెను.

అంతఁ దమ నాయకుని పాటును, బరనాయకుని పోటును జూచి రిచ్చవడి దిల్లీసైనికులు వెన్నిచ్చి పాఱిపోఁ జొచ్చిరి. అది చూచి సహింపఁ జాలక పృథివీరాజు తన సైనికుల నోడకుఁ డోడకుఁడని హెచ్చరించుచుఁ బిచ్చలి పిడుగువలెఁ గహారకంఠీరుని పై కుఱికెను. వా రిరువురు నట్లు చాలఁ గాలము పోరిన పిదపఁ బృథివీరాజు హుంకరించి తన ఖడ్గమును కహారకంఠీరునిపై విసరెను. కాని యా వేటు తప్పిపోయెను. వెఱలఁ బృథివీరాజు సన్నద్ధుం డగునంతలోఁ గహారకంఠీరుఁడు విజృంభించి దిల్లీశ్వరునిపైఁ జంద్రహాస మెత్తెను. ఒక్క రెప్పపాటు కాలములోఁ బృథివీరాయని శిరస్సా సంగ్రామరంగమునం బడి దొర్లుచుండ వలసినదియే; గాని యంతలో వెనుకనుండి యొకవీరుఁడు సను దెంచి కహారకంఠీరునిఁ బరలోకమున కంపివై చెను. దిల్లీశ్వరున కపాయము తప్పిపోయెను.

ఆకస్మికముగాఁ, గహారకంఠీరుఁడు కూలుటచే రిచ్చవడి దిల్లీశ్వరుఁ డెదుట నున్న వీరునిఁ జూచి యాశ్చర్యపడెను. అది చూచి యా వీరుఁడు "రాజా! ఆశ్చర్యమున కిది సమయము గాదు. ముందున కుఱుకుము. అహితుల నఱకు" మని హెచ్చరించుచుఁ గవ్వాకుబ్జసైనికులపైఁబడి యద్భుతముగ వీరవిహారము సేయఁ దొడఁగెను. అప్పటికినిఁ బృథివీరా జాతనిం గుర్తింపఁ జాలకపోయెను. అయిన నిప్పు డాతనిం గుఱించి యోచించుచుం గూరుచుండిన ముప్పు

వాటిల్లు నని తలంచి యాతని వెంటనే వైరివీరుల నురుమాడఁ జొచ్చెను. ఇది చూచి ఢిల్లీ సైనికులు మఱింత యుత్సాహముతోఁ బోరసాగిరి.

క్రొత్తవీరుని ఖడ్గమునకు, ఢిల్లీశ్వరుని చంద్రహాసమునకును వైరియోధు లెందఱు బలి యైరో లెక్క లేదు. ఒక నిముసములోఁ గహారగంఠీరుఁడు కూలిన వార్త యెల్లెడను వ్యాపించెను. ఇది వినియుఁ గ్రొత్తవీరుని యౌద్ధత్యమునకును, ఢిల్లీశ్వరుని ధాకకు నోర్వఁ జాలకయుఁ, దమ వారు స్వల్పముగను, బరు లధికముగను నుండుటం జూచియు నిఁకఁ గార్యము లే దని జయచంద్రుని భటులు వెన్నిచ్చి పాఱఁదొడంగిరి. అయినను విడువక పృథివీరాజు నాతని భటులు గన్యాకుబ్జయోధులను దఱిమి తఱిమి కసిమసంగఁ జొచ్చిరి. అపుడు క్రొత్తయోధుఁడు దయార్ద్రహృదయుఁడై "రాజా! నీకు విజయము లభించె; పాఱుఁబోతులఁ జెనకకు" మని యెలుగెత్తి పిలిచెను. అది విని యాతనిపైఁ గల సాద్యస్కం బగు గౌరవము వలన మాఱుపలుక నోడి సేనలను మఱలించుకొని పృథివీరా జాతని తోఁ గూడ శిబిరముఁ జేరెను.

శిబిరముఁ జేరిన పిదపఁ గూడఁ బృథివీరాజు క్రొత్తవీరుని గుఱుతింప లేక పోయెను. ముఖమునఁ బొంగి పొరలి పోవుచున్న లావణ్యమును, విశాలనయనములయం దుచ్ఛలితం బగుచున్న తారళ్యమును, గలిగిపలుకులయం దుత్తరంగిత మగుచున్న మాధుర్యమును జూచి యరసాక్షి పృథివీరాజు మున్నెప్పుడో యొకప్పు డాతనితోఁ జాలఁదడవు మాట్లాడి యున్న ట్లనుమానించుచు నడుగుట గౌరవము కా దనియుఁ గొంత తడ వేదో ముచ్చటించుచుఁ గూర్చున్నఁ దెలియక పో దనియుఁ దలంచి యాతని యెదుటఁ గూర్చుండఁ

పెట్టుకొని యాతఁడు తనకుఁ గావించిన మహోపకారమునకుఁ గృతజ్ఞతఁ జూపఁ దొడఁగెను. శ్రోత్రవీరుండు నింకను రాజు తన్ను గుఱుతింప లేనందులకు ముసిముసినగవులు నగుచు నల్లనల్లనఁ దగునట్లు ప్రత్యుత్తర మిచ్చుచుండెను. ఎంతకును రాజు కృతార్థుఁడు కాలేక "నా జ్ఞాపకశక్తి యిట్లు మందమై పోయిన దేల?" యని చాలఁ దొట్రుపడ సాగెను. ఇఁకఁ దన్నుఁ గుర్తించుట రాజువలనఁ గాదని తలఁచి వీరుఁడా పటకుటీరమంతయు మెఱిసిపోవునట్లు విద్యుత్కటాక్షముల నంతట నొక్కమాఱు నెఱపి మోము వంచి యూరకుండెను. అంత దరహాసితవదనలై సంయుక్త చెలికత్తె లిరువురును మదనుని పూవుటమ్ములవలె క్షణములో వచ్చి వీరుని భుజములపైఁ జేతుల నానుకొని యిరుదెసల నిలుచుండిరి. అప్పుడు రాజహృదయ మొక్కమాఱు కలఁగి పోయెను. వెంటనే యాతఁడు వీరుని చేయి పట్టుకొని ముఖము దెస గంభీరముగఁ జూచి "సంయుక్తా" యని పిలిచెను.

ఇఁక వీరుఁడటఁ గూరుచుండఁ జాలక తటాలున రాజు చేయి విడిపించుకొని యడుగులు తడఁబడ శరవేగమున మఱి యొక పటకుటీరములోనికిఁ బోయెను. చెలికత్తె లంత సిగ్గందులకే యని రాజు దెసకుఁ జూచిరి. వెంటనే రాజు "సంయుక్తా" యని పిలుచుచు నామె యున్న పటకుటీరమునకుఁ బోయి యెంత వెనుకకుఁ బోఁ బోవుచున్నను వదలక యామె చేయిపట్టుకొని తీసికొని వచ్చి యంకతలమునఁ గూరుచుండఁ బెట్టుకొని ప్రియమారఁ గౌగిలించికొని మోము ముద్దాడి "దేవీ! నాఁడు మానము నిలిపితివి. నేఁడు ప్రాణము నిలిపితి" వని యనేకవిధములఁ గొనియాడఁ దొడఁగెను. వీరుఁడు సంయుక్త యని పాఠకుల కిఁకఁ దెలుప నక్కఱ లేదు.

రా జట్లు చేయుటవలన సంయుక్త కెక్కడ లేని సిగ్గును వచ్చెను. పాప మాముద్దరాలి నా లజ్జ యెక్కిరి బిక్కిరి గావించి వై చెను. అక్కరతన నామెయేమియు మాట్లాడఁజాలక మోమువంచికొని రాజు దృఢాలింగనమునఁ గరఁగిపోవుచుఁ గూరుచుండి యుండెను.

చెఱనుండి తప్పించికొని పురుషవేషముతో నశ్వము నధిరో హించి నిశీథసమయమునఁ గావలివాండ్రను వంచించి వెదకికొనుచు వచ్చి రాయని గాంధర్వవిధిం బరిణయ మైనప్పుడును, మఱలఁ బురు ష వేషము దాల్చి పృథివీరాయనిఁ గాపాడి వైరివీరులను వేటాడి నప్పుడును లేని యింతటి లజ్జ సంయుక్త కిప్పు డేల? అది యేమో స్త్రీలకే తెలియవలెను. సమయము వచ్చినపు డబల లెంతెంత పనుల నైనఁ గావింతురు; గాని పిదపఁ బురుషులను జూడవలసి వచ్చునపు డెంతో సిగ్గుపడెదరు. ఇది లోకములో జరుగుచున్న యాచారము. దీనికి హేతు వేమో చెప్పఁజాలము. పురుషు లైనచో నుత్కృష్ట కార్యములను నిర్వహించివచ్చి తలఁచుకొనుచు పెద్దపెద్ద సభలలోఁ బ్రగ ల్భములు గొట్టెదరు. స్త్రీ లట్లేల సిగ్గుపడెదరో? స్త్రీలకు సిగ్గు పడుటయే ప్రగల్భములు కొట్టుట వంటిదా?

ఈ యుద్ధమునఁ బృథివీరాజునకు సంపూర్ణముగ విజయము కలిగెను. అట జయచంద్రుఁడు దిల్లీశ్వరుని మీఁదికి మఱల సైన్యము నంపక యాతఁడు కోట ముట్టడించె నేనిఁ జూచుకొంద మని యూర కుండెను. కాని రాజు మాత్రము దుర్గమును ముట్టడింప లేదు. రాఁ దగిన వస్తువు చేఁజిక్క ననియుఁ గాఁదగిన పని యైపోయిన దనియుఁ దలంచి యూరకుండెనో, తన యెడలను రాజు నెడలను జాల నగౌరవమును దిరస్కారమును జూపినను జయచంద్రుఁడు కన్న తండ్రి యగుటచేఁ బుత్రికాసహజం బగు ప్రేమంబునఁ గోటను

ముట్టడింప మాను మని సంయుక్త ప్రార్థించెనో, గాని కన్యాకుబ్జ దుర్గమును బట్టుటకుఁ బ్రయత్నింపక రాజు సైన్యమును మఱలించుకొని సంయుక్తా సమేతుఁడై దిల్లీ చేరికొనియెను.

అన్ని యుద్ధములయందును బరాభవమే కలుగుచుండుట వలన జయచంద్రుని యనుమానము పెరిగి పోఁజొచ్చెను. కన్నకూఁతురు కూడ శత్రువులలోఁ జేరుటవలన వాని హృదయము దగ్ధమై పోయెను. అక్కసమున వాఁడు "దిల్లీ యజమానురు కన్యాకుబ్జములను బృథ్వీరాజైన నేలవలెను; నేనైన నేలవలెను; లేదేని మఱియొకఁడేని నేలవలెను. కాని నా కంఠములోఁ బ్రాణము లుండఁగాఁ బృథ్వీరాజునకు విశ్రాంతి యొదవ నీ"నని యాతఁడు చెప్పసాగెను. అట భోలాభీముఁడు గూడ నిట్టి యభిప్రాయము నే గలిగి యుండెను. మఱల నిరువురును గలసి యథాప్రకారముగ యుద్ధప్రయత్నములను జేయసాగిరి.

ఇంతవఱకును జరిగిన యుద్ధములలోఁ బృథ్వీరాయని సేనాధికులలో ననేకులు మడిసిరి. అయిన నింకను జాలమంది వీరు లుండుట వలనను, సంయుక్తను దీసికొని వచ్చిన పిదప భోగపరాయణత బలిసి పోవుటవలనను రాజున కా విచారమే లేకపోయెను. కాని మిగిలిన వారిలో గొప్పవాఁడు కయమాష్టను మంత్రి. అతఁడు "ఖటుపురములోని నిధానమును దీసెను. మరుస్థలములోని పిడిహారరాజుం జంపెను. గోరీనిఁ జెఱపట్టెను. బలవంతులైన తురకరాజులను భారతీయరాజులను జయించెను. అందఱును జహాంబాజ్ రాజునకు (పృథివీరాజునకు) భయపడు నట్లు చేసెను. అతఁడు పెద్దపులి వలె భయంకరుండై తన కీర్తిచే నన్ని దేశములను నింపెను" అట్లన్ని

విధములఁ దనకుఁ గుడిచేయిగ్గాయి యుండినను సొంకమాంబ తన భోగ కాంతను గామించె నని పృథివీరా జాతనిఁ జంపించెను.

మిగిలిన వారిలోఁ జాముండరాయఁ డను నాతఁడు గూడఁ జాల గొప్పవాఁడు. అపక్రమపరాక్రమశాలి. విశేషించి రాజునకు స్వామిభక్తుఁడు. అన్నివిధముల నీతఁడును గయమాషువలెనే రాజునకుఁ గుడిభుజమై యుండువాఁడు. అయిన నొకప్పు డీతఁడు రాజున కత్యంత ప్రీతిపాత్రమైన యొక రేనుంగును సంహరించినందునఁ గోపమువచ్చి రాజీతనినిఁ గైదులోఁ బెట్టించెను. అప్పు డీతఁ "డిఁక శస్త్రము పట్ట" నని శపథము దాల్చెను.

రాజున కంతకంతకు భోగపరాయణత మితిమీఱి పోఁజొచ్చెను. ఆతఁడు రాజకార్యములను జూచుట పూర్తిగ మానివేసెను. వానిని గుఱించి యుద్యోగు లేమైనఁ జెప్పఁ బోయినయెడల వారిపైఁ గోపింపఁ దొడఁగెను. ఒకప్పు డేదో సందర్భమున హాహులీరాయఁ డను వీరాధివీరుఁ డగు చమూపతిని మిక్కిలి పరాభవించెను. దాని కాతఁడు చాలఁ గోపించి "రాజు పోగ రణఁజెదఁ గాక" యని ప్రతిన పూని గోరీ కొలువు గజ్నీపట్టణమునకుఁ బోయెను.

అప్పటి కిటు భీమచంద్రుల ప్రయత్నములు గూడఁ బూర్తి యయ్యెను. గుప్తచారులవలన వారికి దిల్లియందలి కయమాషు సంహారమును, జాముండరాయని కారాబంధనము, వాతని శస్త్రసన్యాసమును, హాహులీరాయని పరాభవము, వాతని గజ్నీపట్టణ ప్రయాణము నెప్పటి కప్పుడే తెలిసిపోయెను. ఆ కారణమువలన వారు మఱింత యుత్సాహ మంది యింక జాగు సేయరా దని గోరీని మఱల నాహ్వానించిరి.

అంతకు ముందే గోరీ తన గుప్తచారుల మూలమున భారత దేశమునందలి సమాచారము లన్నియుఁ దెలిసికొని దండయాత్రకొఱకు మఱలయత్నములు సేయుచుండెను. ఇంతలో భీమచంద్రుల రాయబారులును హాహులీరాయఁడు నాతనికిఁ బ్రత్యక్షమైరి. అప్పటి యాతని యానందమునకుఁ బరిమితి లేదు. వెంటనే యాతఁడనంత సేనాసాగరమును గూర్చుకొని కాజీలచే నిర్దేశింపఁబడిన సమయమున భారతసామ్రాజ్యమును జయించుటకు బయల్వెడలెను.

ఈ వార్త తత్క్షణమే పృథివీరాజునకుఁ దెలియ వచ్చెను. కేవలము గోరీ సైన్యమే యపారముగ నున్న దనియు, భీమజయచంద్రుల వాహిని సైతము సామంతుల వరూధినితోఁ గలిసి యగణ్యమై యున్న దనియుఁ గూడఁ దెలియ వచ్చెను. ఆ వెంటనే యాతఁడీ యుభయ సైన్యంబులును గలిసినచో నజయ్యం బగు నని యూహించి సంగతి సందర్భము లన్నియుఁ దెలుపుచు వెంటనే సాధ్యమైనంత సైన్యమును గూర్చికొని దేశము నుద్ధరించుటకు బ్రాణములపై నాశ గూడ విడిచి యెట్లున్న నట్లు రావలసిన దని భావమఱఁదియు మహావీరుఁడు నగు మేవాడురాజు సమరసింహునకును, మిత్రులకును వార్తల నంపెను.

పృథివీరాజు, పగతుర సమరసన్నాహములును, దమ యుద్ధ ప్రయత్నములును, బ్రజాభిప్రాయమును, దేశస్థితియుఁ జూచి యిఁక తడవు శ్రీమంతం బగు భారతదేశము నిష్కంటకం బగుట యొండెఁ బారతంత్ర్యం బను నంధకారబంధుర మగు కూపంబునఁ బడిపోవుట యొండెఁ దప్ప దని నిశ్చయించుకొని తదనుగుణము లగు ప్రయత్నములను జేయ సాగెను. సంతత యుద్ధపరిశ్రమ వలననో, భారతదేశమునకు దౌర్భాగ్యదశ యాసన్నం బగుటనో, మఱల యుద్ధము

సంభవించె నను నిర్వేదము వలననో, శత్రువాహిని యగణ్యమై యున్న దను జంకు వలననో, యుద్ధములోఁ జనిపోయిన వారు గాక మిగిలిన తమ నాయకులలోఁ గొందఱ క్రమముగ శిక్షింపఁ బడిపోయిరి గదా యను విచారము వలననో, యింటిగుట్టంతయుఁ బాపాత్ముఁడు హావాలీరాయఁడు శత్రువులకుం దెలిపివేయు నిఁక నేటి జయంబను సందేహము వలననో, యీ మహాసంగ్రామమువలన దేశమునందలి స్త్రీపురుష లాబాల గోపాలము నట్టుడికిపోవు నట్టుడికిపోదు రను సంతాపము వలననో, మఱి యే కారణము వలననో ఢిల్లీసైనికు లొకింత కళదక్కి యుండిరి. కాని యది దూరదర్శులకుఁ గాని తెలియరానిదై యుండెను. దానిని బరీక్షించి చూచిన వారు గూడ లేరు.

ఇంతలో రావలసిన వా రెల్లరును దమ తమ బిరుదములకుఁ దగినట్లు మహావైభవముతో వీరరసము మూర్తిభవించెనో యనునట్లు యోధవేషము లలవఱిచికొని పెండ్లికొడుకుల వోలెఁ దరలి వచ్చిరి. మొత్తము పృథివీరాజు పక్షమునఁ బోర నరుదెంచినవారు రథగజతురగపదాతి సైన్యమ్ములు గాక మహారథు లగు సేనాధీశులును, రాజులును, గలసి నూటయేఁబండ్రుండిరి. అందఱిలో సమరసింహుఁడు, నాతని కుమారుఁడు కల్యాణరాయఁడును ముఖ్యులు. వా రందఱును గలసి దేశభక్తి ప్రేరితులై గంగోదకములు చేతఁబట్టి "శత్రువులను గెలువ నైన గెలిచెదము, స్వధర్మము కొఱకు రణాంగణమున దేహముల నర్పింప నైన నర్పించెద" మని శపథములు సేసిరి. అప్పుడు భేరీమృదంగ తూర్యాది మంగళధ్వనులచే దిక్కుహరములు ముఖరితము లయ్యెను. బ్రాహ్మణుల వేదఘోషములచే నా మహావీరుల శరీరములయందుఁ బ్రవహించు రక్తము పవిత్రం బయ్యెను. భట్రాజులు గావించిన శౌర్యవీరయశోగానముచే నా రక్తము

శతోష్ణమై వారి ముఖములయందు నిగ తేజం బంకితమయ్యెను. ప్రబోధగీతములు పాడుచుఁ బుణ్యాంగన లొసంగిన మంగళహారతులచే నా తేజము వినీలమేఘములపై నృత్యము గావించు క్రొక్కాఱు మెఱుంగువలె విరాజిల్లెను. పృథివీరాజు వచ్చి స్వధర్మమును గుఱించి గంభీరోపన్యాసము నొసంగి, స్వయముగఁ గంఠములయందుఁ బుష్పహారములు వేసినపుడు వారి శరీరములు పొంగిపోయెను. ఇచ్ఛనీకుమారి సంయుక్త మున్నగు నంతఃపురస్త్రీ లెల్లరును వచ్చి "మిమ్ము విజయలక్ష్మి వరించుఁ గాక" మని పుష్పాంజలులు వెదచల్లినపు డైహికవిషయప్రపంచ మెల్ల నదృశ్యమై వారి మనోదర్పణములయందుఁ గేవల మసిధారాతీర్థమును విరాజమానము గావించు నా యాదిశక్తి వారికిఁ బ్రత్యక్ష మయ్యెను.

అంత నెల్లరకు నవశక్తి గొదవెను. నిశ్చలంబుగ నిలిచి గంభీరముగఁ జూచుచు నా యాదిశక్తి వారినిఁ జేయెత్తి యాహ్వానించెను. గభీరము లగు భేరీభాంకరణములు వారి హృదయములకుఁ జలనము గలిగించెను. వెంటనే వారు లెటాలున నశ్వములను, రథములను, గజముల నధిరోహించి సువ్యవస్థావిరాజమానము లగు తత్తత్సైన్యభాగముల కధీశులై దిల్లీదుర్గాధిదేవత కభివందనములు గావించి, ప్రత్యాకార వినిర్ముక్తములును భుజనిక్షిప్తములు నగు నిశితకరవాలముల తీక్ష్ణకాంతులు మిఱుమిట్లుగొలుప "జయహర! జయమహాదేవ" యని రణఘోషము గావించుచు స్థానేశ్వర మహాక్షేత్రమునకుఁ బ్రయాణమై పోయిరి. అట భీమ జయచంద్రులును, గోరియు యుక్తసమయమునఁ జక్కని యేర్పాటులు గావించుకొని యచ్చటికిఁ జేరిరి.

వీరటుఁ జేరక పూర్వమే మందహాస వదనారవిందులై, [illegible] తోమర భిండివాలాద్యాయుధములను ధరియించి, [illegible]

హృదయంగమంబుగ ధ్వనిసేయఁ బరశక్తియాయుద్ధరంగమునఁ దాండవము ప్రారంభించెను. ఆమె విద్యుత్కటాక్షములనుండియు, బింబాధరమునుండియు, నీషత్ప్రకట మగు శ్వేతదంతపంక్తినుండియు, నవరత్నస్థగితము లగు బంగరు భూషల నుండియు, నిశితము లగు వివిధాయుధముల నుండియుఁ బదాఱువన్నె బంగారము నవఘళించు కోమలదేహవల్లి నుండియు వెలువడు వివిధకాంతులు మిళితములై సూర్యభగవానుని సహస్రమయూఖములతో వియ్యమంది యామహాసంగ్రామ రంగమున వ్యాపింపసాగెను.

ఎవరు శత్రువులం జంపుట గాని, చచ్చుట గాని గొప్ప యని భావింతురో, యెవరి పాంచభౌతిక దేహములు నిశాతఖడ్గముల కాహుతు లైనప్పుడే పవిత్రము లగు నని తలంతురో, యెవరు తమ మృదుతనులతలయందలి కవోష్ణరక్తముచే ఖడ్గముల కభిషేకము గావించిన యెడల మోక్షము గలుగు నని భావించెదరో, యెవరసిధారాతీర్థమునం దవగాహనము గావించినవారే ధన్యులని నమ్మెదరో వారి కామె ప్రత్యక్ష మగును. ప్రేమభరితము లగు పలుకులతో బుజ్జగించును. ఓడిపోయినను విచారము గలుగనీయక సంతోషము గలిగించును. ఆమె విహారస్థల మగు రణరంగమునం బ్రాణములను బాసిన వారిని వీరస్వర్గమునకుఁ గొంపోవును. కాని మన కామె గోచరింపదు. మనము రణరంగమునకుఁ బోయితిమేని హతు లగు యోధుల శరీరములనుండి ప్రవహించు రక్తధారలం ద్రావ నెల్లయెడల సంచరించు శాకినీ ఢాకిన్యాదిభూతములు ప్రత్యక్షమై తమ పని కడ్డువచ్చితి మేమో యని మనపైఁ బడుటకు సిద్ధపడును. కావున మనము రణరంగమునకే పోవద్దు.

మన మా యాదిశక్తినిఁ గూడ నభిలషింప వద్దు. యోధజీవన ముత్కృష్టమైనదే. కాని మన కది వలదు. మనము ఋషిసంతతివారము. శాంతజీవనము గూడ మోక్షప్రదమే. మన మా శాంతము నాశ్రయింతము. తపోవృత్తి నవలంబింతము. అప్పుడు మనకుఁ గూడఁ బరశక్తి ప్రత్యక్ష మగును. కాని యోధులకుఁ బ్రత్యక్ష మగు దానికిని దీనికిని భేద మున్నది. ఆమె యాయుధములు కుంతతోమరాదికములు. ఈమె యాయుధములు విజ్ఞానసీమములు. యోధజీవనము కంటె శాంతజీవనము తక్కువది యని మీరు భావింప వలదు. యోధునకు శాంతజీవన మలవడుట కష్టము. కాని శాంతునకు యోధజీవన మలవడుట కష్టము గాదు. అసంఖ్యవైరివీరులకు వీరస్వర్గము నొసంగిన యోధు లనేకులు వార్ధకమున శాంతజీవనము నవలంబించి దానియందే తమ దేహయాత్రను జాలించిరి. అంతియ కాని చాలఁ గాలము శాంతజీవనము నంగడపి తుదకు యోధులై తజ్జీవనమునందే జీవయాత్ర ముగించినవా రరిది. దీనివలన మీరు శాంతజీవనోత్కృష్ట్యమును సులభముగ గ్రహింపవచ్చును.

కాని మన పూర్వు లెల్లరును యోధులే. వా రెల్లరును గత్తి కట్టి పోరాడిన వారే. వా రెల్లరును భారతీయుల బలపరాక్రమములను బ్రపంచమున కంతటికినిఁ జాటి చెప్పిన వారే. వారి కా యోధజీవనము రుచించినది. వారి యనుగ్రహమున కాశించి యాకాల మంతయు వీరకృత్యములయందే ప్రవర్తించినది. కాని మన మిప్పుడు శాంతజీవనము నవలంబింతము. ఇప్పుడీ బ్రిటిషుప్రభుత్వమునఁ గాలము గూడ శాంతముగ నున్నది. లేకున్నను గాలము మానవాధీనము. అది మానవుని యిచ్చవచ్చినట్లు తిరుగును. అదియుఁ గాక మనము భారతీయులము. మనవలనఁ గాని దేదియు లేదు. మన మిప్పుడు శాంత

జీవనము నాశ్రయించి భారతీయుల శక్తి సర్వతోముఖ మని ప్రపంచ
మున కంతటికిని జాటి చెప్పుదము. ప్రపంచమునందలి యెల్లవారికిని
శాంతావలంబనమునకు మనమే మార్గదర్శకుల మౌదము. శాంతజీవన
మునందే మనము మోక్షము సంపాదింతము.

అట్లా పరశక్తి స్థానేశ్వరరణరంగమున సకలాయుధధారి
ణియై తాండవము ప్రారంభించిన వెంటనే బంగరు తట్టలనిండ
సుగంధకుసుమములను నింపుకొని కరములయందుఁ బుష్పహారములు
దాల్చి విమానాధిరూఢలై వచ్చి యాకసమునం దంతటను యక్ష
కిన్నరకింపురుష విద్యాధరాప్సరోగంధర్వకాంతలు నిండిపోయిరి.
వా రెల్లరు నద్భుతవీరవిహారములు గావించిన వారిపైఁ బుష్పములను
వర్షింతురు. అసిధారాతీర్థమునం దవగాహనము గావించిన వీరులను
వరించి స్వర్గమునకుం గొంపోయి సకలోపచారములను గావించి
యానంద పెట్టెదరు. ఈ మహాయుద్ధమునం బోరుట కనేక యోధులు
వచ్చియున్నారు. అక్కటతన నిప్పుడు వారి ముఖతామరసములయందు
మహానందలక్ష్మి తాండవ మాడుచున్నది. అట్టి యానందపరితహృ
దయు లగు నా కాంతామణుల వలన నా యోధు లెంత సుఖింతురో;
గాని యా కాంతలు కూడ మనకుఁ గాన్పింపరు. వారి పుష్పప్రవర్ష
ణము గూడఁ గాన్పింపదు.

ఆ యంతరిక్షమున నొకయెడ నవరత్నోజ్జ్వల మగు బంగరు
సింహాసనం బమర్పఁబడి యుండెను. దాని చుట్టును గొందఱు పరి
చారికలు నిలిచి యుండిరి. దాని రత్నకాంతు లాకసమునం దంత
టను దురంగలించుచు విద్యాధరాదికాంతల సుందరవేషములకు
మెఱుంగు లిడుచుండెను. కొంతతడవునకు మనోహరకుసుమమాలిక

యొకటి చేఁబూని చేటీజనంబులు బరాబరులు సేయుచుండ మద
గజగమనయై చనుదెంచి విజయలక్ష్మి యా గద్దియ నధివసించెను.

పిదప నుభయసేనానివేశములనుండియు బ్రహ్మాండము బ్రద్ద
లగు నట్లు భేరీధ్వానములును జెవులు గింగురువోవు నట్లు బాకాధ్వ
నులు నెగసెను. ఇంకను వివిధారావంబులు వెలువడెను. పిమ్మట
రణఘోషములు గావించుచుఁ జతురంగబలములు యుద్ధరంగమున
సాక్షాత్కరించెను. ఆ వీరుల యుద్యోగ మొరులను జంపుటో
లేకున్నఁ జచ్చుట. అట్టి వారికి భేరీకాహళాదిమంగళధ్వను లెందుల
కని మీరు ప్రశ్నింతురా?

యుద్ధరంగము స్వయంవర సభ. యోధులు వరులు. విమానాధి
రూఢులై యాకసమున గుంపులు గూడి యున్న గంధర్వాదికాం
తలు పెండ్లికూఁతుండ్రు. విజయలక్ష్మిగూడ వధువే. దివ్యసౌఖ్యముల
నపేక్షించు యోధులు పాంచభౌతిక దేహములను విడిచిపెట్టి యజ
రామర మగు దివ్యదేహము నాశ్రయింతురు. వెంటనే దివ్యకాంతలు
వారిని వరింతురు. విజయలక్ష్మి విజేతను వరించును. యోధులు
పెండ్లి కాకముందే వసంత మాడుకొందురు. ఆ వసంతోత్సవమును
గాంచి వధువు లెంతో యానందింతురు. లోకములో మంగళ వాద్య
ములు లేకుండ నెవరు పెండ్లి చేసికొందురు?

ఈ మంగళధ్వనుల కింక నొక యాంతరంగిక హేతువుగూడఁ
గలదు. భేరీతూర్యాదిధ్వనులు హృదయపీఠముల నధివసించియుండు
శౌర్యమూర్తులను బ్రబోధించి యోధులను రణరంగమున కురికించును.
కాహళాదిగీతనిస్వనములు యోధుల శక్తిసామర్థ్యములను బొగడి
వారిని మఱింత విజృంభింపఁజేయును. ఈ రూపమున నీ ధ్వనులు

యోధులకుం గావించు నుపకారములకుఁ బరిమితి లేదు. కాని యీ ధ్వనుల యం దాయర్థము యోధులకే గాని మనకు స్ఫురింపదు. అవి మన హృదయములను బ్రద్దలు సేయును.

పిదప యుక్తసమయమున యుద్ధప్రారంభ మయ్యెను. ఇది చాలకాలము చాల ఘోరముగ జరిగెను. భారతదేశోపద్రవకరం బగు నీ యుద్ధమును మే మింతకంటె వర్ణింపఁ జాలము. ఇరుతెగల యందు ననేక యోధులు మడిసిరి. కాని పృథ్వీరాయని పక్షమునఁ బనిసేయవచ్చిన నూటయేఁబది యోధులు రూపుమాసి పోయిరి. సైన్య మంతియు నశించెను. ఒక రిద్దఱు పాఱిపోయి యుందురు; వారు ఢిల్లీయందలి వారికి సమాచారములు దెలుపుటకుఁ బోయి యుందురని మన మూహింప వచ్చును. పృథ్వీరాజు తాతార్ఖానుఁ డను తురుష్కునిచేఁ జెఱ పెట్టఁబడియెను.

తన కిట్టి యవస్థ తటస్థించినందులకుఁ బృథ్వీరాజు చాల సిగ్గు పడియెను. చాల వగచెను. కాని యంతకంటె నేమి సేయఁ గలఁడు? తన్ను విడిపించుటకుఁ గాని, తన పక్షమునఁ బోరుటకుఁ గాని తన వా రెవ్వరును లే రని తెలిసికొని యాతఁడు నిర్విణ్ణుఁడై పోయెను. ఒకింతతడవునకుఁ దెలివి తెచ్చుకొని "నేను గోరీ నేడుసారులు చెఱపట్టి దయఁదలఁచి విడిచి పెట్టితిని. ఆ యుపకారము తలంచుకొని యైనను నన్ను విడువు" మని రాజు తాతార్ఖానునిఁ బ్రార్థించెను. ఖానుఁ డందుల కంగీకరింప లేదు. "నేను గోరీ నేడుసారులు చెఱ పట్టి విడిచితి ననుమాట నీ యవివేకమునే వెల్లడిసేయుచున్నది. నీ వప్పు డట్లు విడిచితివి కావుననే నీ కిట్టి గతి పట్టినది. నీ మౌర్ఖ్యమునకు నీవు ఫల మనుభవింపక తప్ప" దని ఖానుఁడు ఖండితముగఁ జెప్పెను. రాజు ఖానునకు ధనాశఁ గూడఁ జూపెను; గాని ఖానుఁడు

"నీవు నాకెంత ధన మిచ్చినను నీవు శిక్షింపఁబడుటవలన నాకుఁ గలుగు నంతటి యానందము, గౌరవమును, లాభమును గలుగఁబోవు. నీవు శిక్షింపఁబడుటయే నా కోరిక" యని ప్రత్యుత్తర మిచ్చి భీమ జయచంద్రహాహులీరాయలతో విజయానందము ననుభవించుచుఁ గూర్చుండియున్న గోరీమెదుటకు ఖానుఁడు రాయనిఁ దీసికొనివచ్చి నిలిపెను. అంత వా రందఱును గలిసి రాజునకుఁ గావించిన పరాభవ మును, దిరస్కారమును, హేళనమును, మాలేఖిని వివరింపఁ జాలదు. పృథివీరా జేమియు మాట్లాడ లేదు. బలపరాక్రమములు మంటఁ గలిసిపోయినవి. ఐశ్వర్యము నీటఁ గలిసిపోయినది. మానాభిమాన ములు భగ్నములై పోయినవి. కాని రోషాగ్ని హృదయమును గాల్చి వేయుచున్నది. ముఖము కందిపోయెను. దేహము కొయ్యబారి పోయెను. ఇఁక నేమి సేయఁ గలఁడు? "నా కింత బలపరాక్రమము లొసంగుట పగవానిచే బంధింపఁ బడుటకేనా" యనియు, "నిదివఱ క నేక పర్యాయములు జయలాభము నొసంగుట యీ మహా సంగ్రా మమున నోడించుట కేనా" యనియు నాతఁడు భగవంతు నుద్దేశించి విచారింప సాగెను.

నిజముగ నిట్టి స్థితి ననుభవించుట మానికిఁ జాలఁ గష్టము. ఇంతకంటె మరణము మేలు. ఇంతకంటె యమయాతన యుండఁబో దని చెప్పవచ్చును. ఉండిన నది యింత దుస్సహాముగా నుండదు. యమునకుఁ గూడ నొకింత దయ గలుగునేమో. అయిన ననుభవిం పక తప్పదు. దైవమును దూఱిన నేమి లాభము? ఇది దైవికము గాదు. స్వయంకృతాపరాధము. పూర్వజన్మార్జితము గూడఁ గాదు. ఈజన్మమునఁ జేసికొనిన దానికే యిది సద్యఃఫలము.

అట్లు భీమజయచంద్రవహోహులీరాయలు రాజును దమ కపితీ యునట్లు నిందించి నిందించి విసిగిపోయి యూరకుండిరి. కాని గోరీ కింకను విసుఁగు పుట్ట లేదు. అక్కసు గూడఁ దీఱలేదు. ఏడుసార్లు రాయనిచేఁ జెఱపట్టఁబడిన గోరీ కడుపుమంట నిందించుట వలనను, బరాభవించుటవలనను, సంహరించుటవలనను గూడఁ దీఱునది గాదు. కావున వాఁడు నిలిచియుండఁగనే, తత్‌క్షణమే రాజు కండ్లు పీకించి పాదములకు దుర్భరము లగు లోహపుబేడీలను వేయించి కారాగారమునఁ ద్రోయించెను. అంతటితో నైన వానికి సంతృప్తి కలిగినదో లేదో.

పిదప గోరీ తాతాఖానునిఁ బెద్దగా గౌరవించి యుత్కృష్టము లగు బహుమతుల నొసంగెను. సైనికుల నెల్లరిని సంతోషపెట్టెను. ఢిల్లీసేనానివేశ మంతయు జాగ్రత్త పెట్టించెను. భీమజయచంద్రవహోహులీరాయలను జాలఁ గొనియాడెను. ఆ వెంటనే మహోత్సవముతో జయఘోషము మిన్ను ముట్ట ఢిల్లీ నాక్రమించుటకు బయలు వెడలెను.

ఈవార్త విని భారతీయులెల్లరు నాకసము విఱిగి మీఁదఁబడిపోయినట్లును, బ్రపంచము తలక్రిందు లైపోయినట్లును దలంచి గొల్లున గోల పెట్టిరి. ఇచ్ఛనీకుమారి, సంయుక్త మున్నగు రాజపుత్రస్త్రీ లెల్లరును చాలవిచారించిరి. తుదకు ఢిల్లీదుర్గమునందలి రమణీమణు లెల్లరును నిఁక లాభములే దని తలంచి గుమిగూడి దుర్గాధిదేవతను బూజించి, కోటయందంతటను జితులు పేర్పించుకొని భగభగమండు నగ్నిహోత్రములలో దుమికి శాశ్వతపదవికిఁ బోయిరి. దుర్గరక్షణార్థము నియమింపఁ బడిన భటులు గోరీ నెదిరింపఁ బోయి వీరస్వర్గమును జూఱఁగొనిరి. ఢిల్లీ గోరీచే నాక్రమింపఁ బడెను.

ఈ సందర్భమునఁ దురుష్కవీరుల చేతులలోఁ బడి యనేకభారతీయులు హతులై పోయిరి.

గోరీ కోట యంతయు బాగు చేయించెను. చితుల యానవాళ్లైనయు లేకుండఁ జేయించెను. మఱల దుర్గము జనసంకులమయ్యెను. కాని దానికిఁ బూర్వశోభ రాలేదు. దిల్లీదుర్గాధిదేవతయొక్క యా పూర్వలావణ్య మంతయు మాసిపోయినది. పృథవీరా జెందు జని యించి రాజ్యపాలనము గావించెనో యందే, దేశమునందలి క్రూరులను శిక్షించుటకు దాను కట్టించిన కారాగారమునందే బంధింపఁబడియెను. కుతుబుద్దీ నను సరదారుని దిల్లీరాజప్రతినిధిగా నియమించి విజయవార్త నన్న గారికి స్వయముగా విన్నవించుటకు గోరీ గజ్నీపట్టణమునకుఁ బోయెను.

కాని గోరీ భారతదేశమునఁ గావింపవలసిన పను లింకను ముగియలేదు. గజ్నీపట్టణమున గ్యాసుద్దీను గోరీయు, శహాబుద్దీనుగోరీయు నేమి యాలోచనములు గావించిరో నిరో వారికే యెఱుక. తరువాత వెంటనే గోరీ దిల్లీకి వచ్చి మఱలఁ బ్రచండసైన్యమును గూర్చి హఠాత్తుగఁ గన్యాకుబ్జనగరమును ముట్టడించెను.

కన్యాకుబ్జాధీశ్వరుం డెవఁడు? జయచంద్రుఁడు గాఁడా! అతఁడు గోరీనిఁ బిలిచికొనివచ్చి పృథవీరాజును బట్టించి దిల్లీసింహాసనము నెక్కించినవాఁడే గదా? అట్టి జయచంద్రుని నగరమును గోరీ ముట్టడించుటా? ఈవార్త విని యెల్లరును విస్మితు లైరి. జయచంద్రుఁడు తెల్లవోయెను. ఔరా! గోరీసాహసము! ఇంత కృతఘ్నతయా!

పిదప జయచంద్రుఁడు గోరీరాకను గుఱించి యనేకవిధములఁ జర్చించుకొనియెను. తాను గోరీని భారతదేశమునుండి సాగనంపుటకు కుట్రలు పన్నుచుండఁగ నెవ్వఁడో కిట్టనివాఁడు గోరీతోఁ దన మీఁదఁ దాసికలు చెప్పినట్లు, నా కారణమువలన గోరీ తనపై నెత్తి వచ్చినట్లు నాతఁడు భావించెను. కాని తుద కాతని కట్టి దేమియు సంభవింపలే దనియు గోరీ తనరాజ్యమును గూడ హరించుటకు బుద్ధిపూర్వకముగనే వచ్చె ననియుఁ దెలియవచ్చెను. వెంటనే యాతని మనస్సు ఛిన్నభిన్నములై పోయెను. భావయంత్రము చిక్కువడిపోయెను. అతని జ్ఞాన మంతయు మాయమైపోయి యా స్థానమున భయము పొడసూపెను. వెంటనే చూడలేక పాప మాతఁడు కనులు మూసికొనియెను; గాని కృపాణపాణియై, యాగ్నినేత్రుఁడై, భయంకరవదనుఁడై గోరీ యా మూఁతవడిన కన్నులయందే సాక్షాత్కరించెను.

అప్పుడు జయచంద్రుని హృదయము మీఁది మహాఘ్యప్రతిసీర తొలఁగిపోయెను. ఆతని కప్పుడు తాను గావించిన కృత్యములయందలి దౌష్ట్య మంతయుఁ గరతలామలక మయ్యెను. మఱియు దేశము నుద్ధరించుటకు స్థానేశ్వరయుద్ధమునఁ బృథివీరాయని పక్షమునఁ బోరి ప్రాణములను విడిచిన సమరసింహాదివీరశిఖామణులు, నగ్నిహోత్రములయందుఁ బడి ప్రాణముల నర్పించిన యిచ్ఛనీకుమారి, సంయుక్త మున్నగు వీరకాంతలును బారులుతీరి మందహాసముతో నిలిచి తన్ను గుఱించి యేమో చెప్పుకొనుచున్నట్లును, దిల్లీ సింహాసనము నలంకరించు పృథివీరాజు, విగతనయనుఁడై, బద్ధపాదుఁడై చింకిరిగుడ్డగట్టుకొని దిల్లీ కారాగారమునఁ బడి భోరన నేడ్చుచున్నట్లును, దనపై కుఱుకఁ బోవు గోరీ వెనుక నిలిచి భారతసామ్రాజ్యలక్ష్మి వెక్కి వెక్కి యేడ్చు

చున్నట్లును, గాన్పింప సాగెను. మఱియు నగరప్రవేశసమయమున గోరీభటులచే సంహరింపఁబడిన ఢిల్లీపౌరులును, నిప్పుడు గోరీ మఱలఁ దమమీఁదికి దండెత్తివచ్చుటవలన భయభ్రాంతులై యున్న కన్యాకుబ్జపౌరులును గలిసి తన్నతి నీచముగ నిందించుచున్నట్లును, దన యంతఃపురస్త్రీ లెల్లరును దాను గావించిన యకృత్యములం దలంచికొని తన్నుఁ దిట్టుచు ఘోరముగ విలపించుచున్నట్లును, భారత దేశమందలి రమణీమణు లెల్లరు నకృత్యములను గావించిన తనపై నిప్పులు గ్రక్కుచు శాపోదకములను విడువఁబోవు చున్నట్లును, గూడ గోచరింపఁ జొచ్చెను.

వెంటనే యాతఁడు, తన జీవితము పాపభూయిష్ఠమై, నింద్యమై, నిరర్థకమై పోయిన దనియు, నీ ప్రపంచము నం దెందును దనయంతటి 'ద్రోహి' వంచకుఁడు, కుటిలుఁడు, జాతిభ్రష్టుఁడు, నపాంక్తేయుఁడు నగు పాపాత్ముఁడు లేఁ డనియుఁ, దనకొఱ కింతకు మున్నే యముఁడు నరకమున స్థలనిర్దేశమును, శిక్షానిర్ణయమును గూడఁ గావించియుండు ననియు, యమకింకరులు తమతమ పరికరములతో బాధింపఁ దనకొఱకు వేచియుందు రనియు నూహించికొని, యిఁక గోరీని జయించుట దుర్ఘట మనియుఁ దన కిఁక వినాశము తప్పదనియు నిశ్చయించుకొని దా నిఁక నీ లోకమున బ్రతికి యుండుట లజ్జాకరం బనియు, నసంభవ మనియు గూడ నిర్ధారణము గావించికొని, గోరీపైఁ గత్తి గట్టుఁ డని సైనికుల కాజ్ఞాపింపలేక గంగలోఁ బడి ప్రాణములు విడిచెను.

ఈ వార్త విని యంతఃపురస్త్రీ లెల్లరును జోహారు గావించి శాశ్వతానందనిలయమునకుఁ బోయిరి. యవనయోధుల కత్తి కెందు నెదురు లేకపోయెను. కన్యాకుబ్జము గోరీ స్వాధీన మైపోయెను.

వెంటనే యట నొక పాలకుని నియమించి గోరి ఢిల్లీ చేరికొనియెను. జయచంద్రుని వినాశవృత్తాంతము చదివిన వారి కాతనితోఁ గలిసి పని చేసిన భీమహాహులీరాయలయెడలఁ గూడ గోరీ యెట్లు ప్రవర్తించునో యూహించుకొనుట కష్టము గాదు.

పృథివీరాయఁ డింకను ఢిల్లీకారాగారమునందే నవయుచుండెను. గోరి కెప్పటికైన దయగలుగు నని చెప్పుటకు వీలులేదు. అతఁడు రాజకీయ విషయములయం దెన్నఁడును గనికరము జూపి యెఱుంగఁడు. అయిన నిఁకఁ బృథివీరాజున కెప్పటికినిఁ గారాగారనివాసము తప్పనిదేనా? ఢిల్లీ చక్రవర్తియై యనంతవైభవము ననుభవించిన యాతఁడు బందిఖానా యందే జీవయాత్ర ముగింపవలయునా?

స్థానేశ్వర యుద్ధసందర్భమున ఢిల్లీ దుర్గమునందలి దేవీమందిరమునఁ గూర్చుండి "పృథ్వీరాజరాసా" యను మహాగ్రంథమును రచియించిన మహాకవియుఁ, బృథివీరాయని బాల్యమిత్రుఁడును, విశేషించి యాతని యాస్థానకవియు నగు చాందభట్టను భట్రాజు, రాజు తురుష్కులచేఁ జెఱపట్టఁబడి నప్పటినుండియు నిట్లే యోచించుకొనుచుండెను. ఆ కారణమువలన, నిండోలగంబునఁ దన కత్యంత గౌరవము గావించిన యా ప్రాణస్నేహితున కట్టులైన మోక్షము గలిగింపకున్నచోఁ దన యంతటి కృతఘ్నుఁ డీ లోకమున వేఱొకఁ డుండఁ బోఁ డనియుఁ, దాను బ్రతికి యుండియుఁ జచ్చిన వారిలో లెక్కయే యనియు భావించి పృథ్వీరాయ మోక్షణోపాయముల నాలోచింప సాగెను.

ఈ సందర్భమున నాతని కనేకవిధము లైన యోచనలు గలిగెను; గాని పునర్విచారణలయందు మాత్ర మన్నియుఁ

ప్రతిహతము లై పోయెను. "ఇఁకఁ బృథివీరాజు జీవించి యుండుట లగ్గా? యిహలోకమును విడిచిపోవుట లగ్గా?" యని యాతని కీ ప్రశ్న తీరకముందే మఱియొక ప్రశ్న తోఁచెను. ఈ రెండు ప్రశ్నలను గుఱించి యోచించుటలో "గోరినిఁ జంపుట కూడ నా" ట్లని యాతనికి వేఱొక ప్రశ్న తోఁచెను.

అతిజటిలము లగు నితిహాసములను విలాసముగఁ గల్పింపగల మహాకవి కుపాయములు తోఁచుటలోఁ గొఱంత యుండఁ బోదు. కాని కావ్యముల యందలి పాత్రము లన్నియుఁ దనయిచ్ఛవచ్చినట్లే ప్రవర్తింప వలసిన వగుటచే నెట్టిచిక్కు లైనను కవి నక్కాని యుపాయములను బన్ని విడదీయఁ గలఁడు. మఱియుఁ, గుట్రల నుండి తప్పించుకొనుట కుపాయములను బన్నువాఁడే కుట్రలను గూడఁ గల్పించువాఁ డగుటంజేసి కవి తాను విడఁదీయఁ జాలని కుట్రలను గల్పింపనె కల్పింపఁడు. కావ్యములయందలి కుట్రలను బట్టి వానిని విడఁదీయుటకుఁ బన్నిన యుపాయములు సాధారణములైన, నుత్కృష్టములుగనే తోఁచును. అయినను గావ్యములయందే గాని కార్యములయం దట్టియాటలు సాగి రావు. కుట్రలు పన్నువాఁడు ప్రతీకారోపాయముల నూహించు తన కంటె వేఱగుటచే నట్టి సందర్భములందు సాధారణముగఁ గుట్రల యాంతరంగికస్థితి నెఱుంగుటయే కష్టము. కుట్రలను బన్నువాఁడు విజాతీయుఁ డగు నెడల వాని రహస్యములను దెలిసికొనుట మఱింత కష్టము. మొదటఁ గుట్రల యాంతరంగికస్థితినిఁ దెలిసికొనుట యెంత కష్టమో పిదప వానికిఁ బ్రతీకారములను బన్నుటయు నంత కష్టమే. కావునఁ జాందభట్టునకుఁ దొల్తఁ దుష్టుల తత్త్వమును దెలిసికొనుట యావశ్యకమయ్యెను. అగుటంజేసి, యాతఁడు పృథ్వీరాజు మోక్షణోపాయమును

దరువాత నాలోచించుకొనవచ్చు నని తలంచి మున్ముగన్న భగీ రథప్రయత్నములు గావించి, గోరీ యనుగ్రహమును సంపాదించి మెల్లమెల్లఁగఁ దవాస్థానమునకు రాకపోకలు గావింప మొదలు పెట్టెను. ఈ సందర్భమున నాతఁడు పృథివీరాజుని బాల్యస్నేహి తుఁడగుటఁ బ్రకటన గానీయలేదు. అట్లయిన నాతనికి గోరీచెంతఁ బ్రవేశమే గలుగదు.

గోరీ మహాకవినిఁ బోషింపఁ దగిన యంతటి రసికుఁడు గాఁడు. అతఁడు కేవలయుద్ధప్రియుఁడు. వీరచరిత్రములను, యుద్ధ వార్తలను వినునంత ప్రీతితో నాతఁడు శృంగారరసభూయిష్ఠములైన గ్రంథముల నైన వినఁడు. అక్కతనఁ జాందభట్టునకు సర్వతోముఖ మగు తన కవితాశక్తి నంతను జూపుట కవకాశము చిక్కినది గాదు. అతనికి గోరీచెంత నెంతసేపును వీరబీభత్సభయానకరసముల నే వర్ణిం పవలసి వచ్చెను. ఇతరరసములను వర్ణించుటలోఁ గూడఁ జాల నై పుణ్యముండినను, నా కాలమునందు రాజపుత్రుల నాశ్రయించియుం డు భట్రాజులకు ముఖ్యముగా నా రసములను వర్ణించుటయే విధియై యుండెడిది. చాందభట్టునకుఁ గూడఁ దద్రసములను వర్ణించుటయం దసామాన్యమగు నైపుణ్య ముండుటవలన నాతఁడు త్వరలో గోరీ యనుగ్రహమును బడయఁగలిగెను. మహాకవి కసాధ్యములేదు. అతఁడు మూఢుని కుమ్మహృదయమును గూడ సరసము గావింపఁ గలఁడు.

కొలఁది దినములలో గోరీ చాందభట్టు కవిత్వమునందలి సార స్యమును గ్రహించుటలోఁ జాల నిపుణుఁ డని పేరుగాంచెను. ఒ క్కొక్కప్పుడు భట్టు రచించి తెచ్చిన పద్యములను విని గోరీ

వివశుండగుట గూడ సంభవించుచువచ్చెను. గోరీవలన భట్టు కనకాంబరవస్తువాహనాదికము లగు వసదనము లనేకములు సంపాదించెను. గోరీ యాస్థానమునందలి వారెల్లరును భట్టు నెలికతోఁ దుల్యముగఁ జూడసాగిరి. భట్టున కొక్క యంతఃపురము దక్కఁ దుర్గములో నింకెందును బోరాని స్థలము లే దయ్యెను.

ఇట్టి స్థితి సంభవించునప్పటికి భట్టునకుఁ దురుష్కుల తత్త్వమంతయుఁ దెలిసిపోయెను. తన చింతితకార్యము సాధించుకొనుటకప్రతిహత మగు నుపాయము తోఁచెను. అప్పుడు భట్టునకుఁ గలిగిన యానందమునకుఁ బారము లేదు. అతఁడు తన జీవితములో నింతవఱకు నంతటి యానందము ననుభవించి యెఱుఁగఁడు. కారాగారమునుండి పృథివీరాయనికి మోక్షము గలిగినట్లును, గోరీ హతుఁడైనట్లును, దన జన్మ సార్థకమైనట్లును దలంచి యాతఁడు పొంగిపోయెను. ఈ సందర్భమున వాతఁ డొకనాఁడు పేరోలగంబున గోరీప్రతాపమును వర్ణించి వర్ణించి వాని నానందసాగరమున ముంచివైచి "మీచేఁ జెఱఁబట్టఁబడిన వారి నొకమాఱు చూడఁ గోరిక గల దని చెప్పి నిరభ్యంతర మగు గోరీ యనుజ్ఞ నందెను.

మఱునాఁడు బయలుదేఱి భట్టు వాలుగైదు చెఱలను బరీక్షించెను. అందలి వారు కొందఱు బ్రాహ్మణులు; మఱికొందఱు వీరులు. వా రింతవఱకును బద్ధులైన పిదప భారతీయుని ముఖమైనఁ జూచి యెఱుఁగరు. అగుటంజేసి వారు భట్టు సారసి యెంతో సంతసించిరి. వారి వారి యవస్థ లేమేమో చెప్పికొనిరి. కొంతఱు నేడ్చిరి. ఇఁక మాకు మోక్షము లేదా యని భట్టు నడిగిరి. భట్టు వారికిఁ దగునట్టి ప్రత్యుత్తర మిచ్చి పృథ్వీరాజున్న చెఱసాంత కరిగెను.

ఆ బందిగమును సమీపించినపుడు భట్టునకుఁ గలిగిన మనః క్లేశ మింతింత యని చెప్పఁ జాలము. కాళ్లు కంపింప సాగెను. కంఠమున గద్గదికయుఁ గన్నులయందు బాష్పోద్గమంబును గూడఁ గలిగెను. "కోలువుకూటమున సింహాసనమునఁ గూరుచుండి ధర్మ సంరక్షణము గావించుచుండఁ జూచిన కనులతోడనే నేఁడు రాజు దిగతనయుఁడై బందిఖానాలో నవయుచుండుటఁ జూడవలసివచ్చెఁ గదా" యని యాతఁడు చాల విచారపడియెను. నిజముగ స్నేహము కొఱకుఁ బ్రాణములను దృజింపఁ దలచువారి కింతకంటె విచార హేతు వుండదు గదా?

ఆ వడఁకుచున్న కాళ్లతోడనే భట్టు చెఱలోనికిఁ బోయెను. లోనికిఁ బోవునపుడు భట్టు హృదయము దడదడఁ గొట్టుకోసాగెను. నడువలేక నడువలేక యెట్లో లోనికేగి భట్టొక మూల మూర్తీభవించిన విచారదేవతయో యనఁ గూర్చుండియున్న పృథివీరాయనిం జూచెను. వెంటనే యాతని మనస్సు చెక్కలై పోయెను. భట్టు చైతన్యము లేక యొక నిముస మట్లే నిలిచిపోయెను.

పాప మప్పటికి రాజు తనకు సంభవించిన నికృష్టదశం దలంచికొని వగచుచుండెను. కనులనుండి యశ్రుధారలు ప్రవహించుచుండెను. తిన్నగ నాహారనిద్రలు లేకపోవుటవలనను, సమధికంబగు మనఃక్లేశమువలనను, నాతఁడు చాలఁ జిక్కిపోయి యుండెను. శిరస్సు ముడిడితం బగుటను, జూచుటకుఁ గన్నులు లేకుండుటను, లలాటగండఫలకములు ధూళిపరీతంబు లగుటను, ముఖము రాహుగ్రస్త పూర్ణచంద్రమండలమువోలెఁ గళావిహీనము యుండెను. చిరకాలమునుండి, స్నానము లేకుండుటంజేసి చిక్కి శల్యావశిష్టమై

యున్న దేహము మసిలోని బంగరు శలాకవలె నుండెను. హృదయఫలక మెంత బీటలు వాఱిపోయినదో, భావసూత్ర మెంత చిక్కులుపడియున్నదో, యాతనికే యెఱుక. చూచుటకుఁ గన్నులు లేకపోవుటను, గాళ్లకు లోహపుబేడీలు వేయఁబడియుండుటను నెంత బాధగా నున్నదో యాతనికే తెలియును. అట్టి స్థితిలో నున్న పృథ్వీరాజు భట్టు లోనికివచ్చినపు డొకింత యలికిడియగుటచే మొగము పైకెత్తి యెవరు వా రని పలుకరించెను.

ఆ ప్రశ్న కేమని ప్రత్యుత్తరము చెప్పవలెను? ఉత్కటవిచారమువలన భట్టునకుఁ గొంతవఱకు నేమియుఁ దోఁచినది గాదు. తుదకాతఁడు గద్గదమైపోయిన కంఠము నెట్లో యొకింత తెఱపి చేసికొని "సార్వభౌమా" యని పిలిచెను. వెంటనే రాజు వచ్చి సుకవీ! యని భట్టుపైఁబడి విలపింపసాగెను. అది చూచి భట్టొకింత తెప్పిరిలి "యీశ్వరుఁడు రాజు నింకను సర్వశూన్యునిఁ గావింపలే" దని చాల సంతసించెను. ఆరహస్య మేమో?

కొన్ని నిముసములు గడచిపోయిన తరువాత రాజు "మిత్రమా! నీ వింకను జీవించి యుంటివా?" యని ప్రశ్నించెను. "నీ బంధమోక్షణము కొఱకు. ఇప్పుడు గోరీసుల్తాన కవినై యాతని మన్ననలం బడయుచున్నాఁడ" నని భట్టు రాజునకు సంగ్రహముగఁ దన యభిప్రాయము నెఱింగించెను. రా జందేమి విశేషార్థమును గ్రహించెనో గాని యెంతో యానందించెను. అతఁడు మైత్రియందలి భావము నిప్పుడు గ్రహించిన ట్లెప్పుడును గ్రహించియుండలేదు. ఇట్టి యవసరములయందే స్నేహగౌరవము ప్రకాశమగును. ఇతరులతో సఖ్యత్రియు స్నేహము గావించిన వారే స్నేహగౌరవమును . తెలిసికొనఁగలరు.

తాను సార్వభౌముఁ డైనను గొంచె మైన గర్వము లేక పృథివీ రాజు భట్టుతో నభేదముగఁ బ్రవర్తించెను; గావుననే భట్టు నేఁ డిట్టి ప్రయత్నము సేయుట తటస్థించెను. ఇది యంతయు నూహించి కొని యింతవఱకు "దేవుఁడు లేఁడు. ధర్మమునకు బలము లే" దని వగచు పృథివీరా జిప్పుడు దేవుని యస్తిత్వమునందును, ధర్మప్రభావమునందును, విశేషించి భవబంధమోక్షమునందును విశ్వాసము దాల్చెను. పిదపఁ గొంతతడవు వా రేమేమో మాట్లాడుకొనిరి. భట్టు వెడలిపోయెను.

నాఁటి సాయంత్రము భట్టు యథాపూర్వముగ దర్బారున కరిగెను. ఆ నిండోలగంబున భట్టు బందీసందర్శనప్రసంగము వచ్చెను. వెంటనే భట్టు లేచి తన యనర్గళకవితాధారం బ్రవహింపఁ జేసి పెద్ద యుపన్యాసము చేసిచేసి పిదపఁ "బృథివీరాజు కనులకుఁ గంతలు కట్టుకొని ధ్వనిజాడం బట్టి లక్ష్యభేదనము గావించుచుండు వాఁ డఁట! అట్టి యోధాగ్రేసరునిఁ గూడ విలాసమాత్రమున బద్ధునిఁ గావించిన నీ ప్రతాప మమానుషం" బని గోరీనిఁ బొగడి పొగడి విడిచెను. అంత గోరీ యబ్బురంపడి "గ్రుడ్డివాఁడై యున్న యాతఁ డిప్పుడు గూడ నట్టి శరసంధానచాతుర్యమును జూపఁగలడా?" యని ప్రశ్నించెను. భట్టు చూడవచ్చు ననియెను.

అది విని సభికు లెల్లరును జమత్కృతు లైరి. మఱియు నెల్లరు నా వినోదమును జూడ వేడుకపడి సుల్తానువంకఁ జూచిరి. సుల్తాను వారి యింగితముల నెఱింగి తాను గూడ నా వింతఁ జూడ వేడుకపడుచున్న వాఁడే గావునఁ బృథివీరాయునిఁ దీసికొని రమ్మని కింకరదారున కాజ్ఞ యిచ్చెను.

అతఁడు వెంటనే చెఱసాలలోనికిఁ బోయి "పృథివీరాజా!" యని పిలిచెను. రాజు చెఱసాలకు వచ్చిన తరువాత నా పేరుతోఁ గాని యంత గౌరవముగఁ గాని యెవరు నాతనిఁ బిలువ లేదు. వా రాతనిం జాల నీచసంబోధనములు గావించెడి వారు. అక్కతన రాజు నేఁటి మార్పునకు వింతపడి నిముసములోఁ గారణ మూహిం చుకొని "బెబ్బులి కింత సౌమ్యత యెప్పుడు వచ్చిన" దని మాఱు పలికెను. అందలి యర్థ మత్తురుష్కున కవగతము కాలేదు. అతఁ డొకింత తడ వూరకుండి మఱలఁ బృథ్వీరాజా! యని పిలిచెను.

"వీఁడు పట్టి మొగ్దని భాషించి తనలోఁ దాను నవ్వుకొని రా జెందుల కని యడిగెను. సరదారుఁడు సుల్తాను నభిప్రాయము నెఱింగించెను. అది విని రాజు "భికారివేసములో నున్న యోధుఁడు శరసంధానము సేయఁ గలఁడా?" యని ప్రశ్నించెను. అత్తురుష్కుఁ "డన్నా రాజున కెంత యభిమాన!" మని వింతపడి యే మనెద నని యెను. 'లాగు, కాసెకోక, అంగరకా, సాగా, మొదలగువానితో నున్న గాని నేను శరము బట్టఁ జాల నని సుల్తానుతోఁ జెప్పు మని రాజు వాని నంపివైచెను. సుల్తా నందుల కంగీకరించి వాని నంపి వైచెను. రాజు వానిని ధరించి బయలుదేఱెను. సరదారుఁడు రాజును దారితప్పిపోకుండఁ దన చేతిగఱ్ఱను బట్టుకొని రమ్మనియెను; గాని రా జందులకు నవ్వి "కఱ్ఱతోఁ బనిలేదు. నీవు మాట్లాడుచు నడు వుము. నేను నిన్ననుసరించి వచ్చెద" ననియెను. సరదారుఁ డట్లే చేసెను. రాజు దర్బారులోనికి వచ్చెను.

రాజు నారసి సభ్యు లెల్లరు నాతఁ డేమి మాట్లాడునో యని నిశ్శబ్దముగ నుండిరి. అట్టి స్థితిలో గూడ రాజు నెమ్మోగమునఁ

దాండవము నేయు శౌర్యగాంభీర్యముల నారసి గోరీ యులికిపడెను. అప్పుడు గోరీకిఁ దా నేను తడవ లాతనిచేతఁ జిక్కి భగీరథప్రయత్నముల వలనను, రాయని యఖండకృపవలనను విడువఁబడిన వృత్తాంతము జ్ఞప్తికి వచ్చెను. వెంటనే యాతని హృదయ మొకింత చలించెను; గాని ధైర్యము తెచ్చుకొని "రాజా! నీ శరసంధానపై పుణ్యము జూడఁ గోరుచున్నా" మని పలికెను. రాజు "చూడ వచ్చు" నని యూరకుండెను.

అపుడు తాతార్ఖానుఁడు తిరస్కారసూచకముగ మందహాసము గావించి "రాజా! యోధవేష మలవరిచికొంటివి. కవచము మాత్రము లోపమై యున్నది. అది యక్కఱ లేదా?" యని ప్రశ్నించెను. రాయఁడు ఖానుని దిక్కు మొగంబై గంభీరముగ నిలువఁబడి తాతార్ఖానుఁడా? యని సంబోధించి "నీవు గూడ శరసంధానచాతుర్యము జూప నెంచెదవా యేమి? అట్లయిన నీవు వేగముగఁ గవచము ధరించి రమ్ము. నా కక్కఱ లే"దని ప్రత్యుత్తర మిచ్చెను. అందులకు మాఱు పల్క లేక ఖానుఁడు తలవంచికొని యూరకుండెను. సభ్యులు రాయని శూరత్వమును మెచ్చుకొనిరి. సుల్తాను శర వినోదప్రదర్శనమునకు రాయనిం ద్వరపెట్టెను.

ఒకింత దవ్వున నొక బెత్తముతో నచ్చటి స్తంభముమీఁదఁ గొట్టి ధ్వనిసేయుట కొక సరదారుఁడు నియమితుఁ డయ్యెను. సభయందలి యెల్లర దృష్టులును స్తంభమునకును రాజునకును నడుమఁ బర్వ లిడసాగెను. అంత వేఱొక సరదారుఁడు విల్లునమ్ములను గొనివచ్చి రాజున కిచ్చెను. కాని రాజు వానినిఁ జేతఁబట్టి చూచి "ఇయ్యా ధను ర్బాణములు నావి గావు. వీనితో నే నేమియుఁ జేయఁ

జాల" నని క్రిందఁ బడవైచెను. రాయని గ్రహణశక్తి యా సభయం దంతటను రహస్యముగఁ గొనియాడఁ బడెను. రాయని ధనుర్బాణములను దెచ్చి యిచ్చుటకు సుల్తాను నాజ్ఞ యయ్యెను. వెంటనే యా యానతి పాలింపఁబడెను.

రాజు తన ధనుర్బాణములను జేఁకొని మనస్సునందే వానిని మ్రొక్కి యభినందించి యాశ్రమంబున నిల్లెక్కువెట్టి నారి టంగుటంగున మ్రోయించి విడిచెను. ఆ యద్భుతధ్వనిచే నచ్చటి సరదారుల హృదయములు వీరరసపూరితము లయ్యెను. ఈ స్థితి గోరీకిఁ గూడఁ గలిగెను. చాందభట్టు గూడఁ దన్మయుఁ డయ్యెను. వెంటనే యాతఁడు కవితావాహిని యడ్డుకట్టు దెగఁగొట్టి గోరీనిఁ గొనియాడుచు, రాయనిం బ్రబోధించుచు నాతని దరిఁ జేరెను.

భట్టు కవిత్వమువలన రాయని శౌర్యమును, గోరీశౌర్యమును, సభ్యుల శౌర్యమును గూడ మఱింత యుద్రేకించెను. రాయఁడు మఱల నారి మ్రోయించెను. ఆ గుణధ్వని "యిట శూరు లైన వారెవరో లెండు. అనంత మగు కీర్తికిఁ గాని, యక్షయం బగు వీరస్వర్గసౌఖ్యమునకుఁ గాని ప్రాణముల నైన విడువఁ దలంచెడి వారెవరో రం" డని పిలుచుచున్న ట్లుండెను. ఉండుట యేమి? ఆ గుణధ్వని కర్థ మదియే. దానివలన నెల్లరును మఱింత వీరరసోద్రిక్తులైరి. ఇది యంతయుఁ జూచి "మీ మనస్సుల నన్యత్ర మఱల్పకుఁడు. మీ చూడ్కులు లక్ష్యమునందే ప్రతిష్ఠింపుఁ" డని భట్టు సభికుల నెల్లరను బ్రబోధించి ధ్వనిచేయు మని సరదారునకుఁ గన్ను గీటెను. వెంటనే నిశ్శబ్ద మైన యాసభలో టకటకధ్వని వ్యాపించి, సభ్యుల నాందోళ పఱిచెను. రాయఁడు ధ్వని నాలకించుచు

నుత్సుకుఁడై యట్లే నిలుచుండెను. అదిచూచి సుల్తాను "జాల మేల? కొట్టు" మని కేక వేసెను. సభ్యులెల్లరును లక్ష్యమునందే దృష్టి నిలిపి యుండిరి. భట్టు చాలఁ గనుగలిగి యుండెను. క్షణములో నా టకటకధ్వని ర్రివ్వు మను ధ్వనితో మిళితమై వెంటనే "హా హా! చచ్చితి" నను నా క్రందనధ్వనిలో లీన మైపోయెను. ఆ వెంటనే హారహారా, యను మఱియొక గంభీరధ్వని యా సభామండప స్తంభములను గూడ గడగడ లాడించెను. "మహాదేవా!" యను మఱియొకధ్వని యా గభీరారావమునకుఁ బ్రాణముపోసెను. ఆ వెంటనే మఱల సభలో గాంభీర్య మొక్క క్షణకాలము విరాజమానమయ్యెను. లక్ష్యమునందే ప్రతిష్ఠింపఁ బడి యున్న సభ్యుల దృష్టులాలస్యమున కోర్వఁజాలక తటాలున నొకమాఱు రాజుదెసకు మఱలెను. కాని యేమి ప్రయోజనము? అంతయు విపరీతముగఁ బరిణమించి పోయెను. ప్రపంచ మంతయుఁ దలక్రిందులైన ట్లాయిపోయెను. రాయని శరాఘాతమువలన గోరీ సమసెను. రాయఁడును, భట్టు నొకరినొకరు పొడుచుకొని స్వర్గమునకుఁ బోయిరి.

ఆశ్చర్యచకితము లగు సభ్యుల దృష్టులు తొలుత రాయని యొక్కయు, భట్టుయొక్కయుఁ గళేబరముల నుండి ప్రవహించు రక్తప్రవాహపు మడుగుండములలోఁ బడి మునిఁగిపోయి యెట్టకేలకుఁ దేలి తెప్పరిలి వెంటనే గోరీకళేబరమునుండి ప్రవహించు రక్తవాహినిలోఁ బడిపోయెను. వెంటనే సభయం దంతట నొక్క పెద్ద కోలాహలము ప్రారంభ మయ్యెను. అందఱును బిచ్చియెత్తి నట్లు పరువు లెత్తసాగిరి. కొందఱు గోరీ నాడిని బరీక్షింపఁ దొడఁగిరి. మఱికొందఱు రాయభట్టుల కళేబరములను ద్రొక్కి వానిపై నుమియసాగిరి. కొందఱు వైద్యులు వైద్యు లని కేకలు వెట్టిరి. అట్లు కొన్ని

నిముసములు గడచిపోయిన పిదప నిఁకఁ బ్రయత్నము లనావశ్యకము లనియు, భట్టును, రాయఁడును గూడ గతించి రనియు నందఱకును దెలిసి పోయెను. అందఱును గడగడ లాడిపోయిరి. ఆకంప మొకింత యడఁగిన తరువాత నిఁకఁ జేయునది లేక గోరీ కళేబరమును మహా వైభవముతోఁ బూడ్చివేసిరి. రాయనియొక్కయు భట్టుయొక్కయుఁ గళేబరములను యమునలోఁ బారవేయించిరి; గాని యా భారతీయుల నా యమునానదీమతల్లి పూతులం గావించు నని సంతాప దగ్ధహృదయు లగు నత్తురుష్కు లప్పుడు గ్రహింపలేకపోయిరి.

ఇంతటితోఁ బృథివీరాయని చరిత్రము ముగిసినది.

ఈ చరిత్రమునందలి ముఖ్యపాత్రములలో గోరీ యొకఁడు. పృథివీరాయఁ డొకఁడు. జయచంద్రుఁ డొకఁడు. చరిత్రమునం దీ యుద్ధసందర్భమున రాయని మామ యగు జైతపరమారుని ప్రశంస యేమియు లేదు. ఇ య్యవసరమున భోలాభీముని విషయమునఁ గూడఁ జరిత్ర మౌదాసీన్యము వహించినది. మఱియొక వీరుఁడు సమరసింహుఁడు. ఇఁక మిగిలిన యాతఁడు హాహులీరాయఁడు. ఈతనిఁ గూడ మన మీ చరిత్రమునందలి ప్రధానపాత్రగా స్వీకరింపవచ్చును.

ఈతనిని రా జవమానపఱచిన మాట యథార్థము. ఈతనియెడ నపరాధ మేమియు లేకపోవుటయు స్త్రీలంపటుఁడై రాజీతని నక్రమముగ శిక్షించుటయుఁ గూడ యథార్థములే. అక్రమ శిక్ష విధించినపు డెట్టివానికిఁ గోపము రాకమానదు. అట్టిచో శూరుఁడై సేనానియైన వాని కాగ్రహము వచ్చుట తప్పు గాదు. శూరునకు మానహానికంటె మరణము మేలు. తన్నతినీచముగ నవమానపఱచుట

వలన నీతఁడు రాజూనకుఁ బ్రత్యుపకారము గావింతు నని శపథము చాల్చుట మే మాక్షేపింపఁ జాలము; గాని యాతఁడు తనశపథమును దీర్చికొనుటకుఁ జేసిన ప్రయత్నము మంచిదా చెడ్డదా యని ప్రశ్న.

ఇది యంత కఠిన మైన ప్రశ్న గాదు. హాహులీరాయఁడు తన శపథమును దీర్చుకొనుటకై చేసిన ప్రయత్నమువలనఁ బృథివీరాయ నికే గాని మఱి యేరికిని బాధ కలుగఁగూడదు. న్యాయ మిట్లుండ నీతఁడు చింతితకార్య నిర్వహణమునఁ దోడ్పడుటకై గోరిని సాయము గోరెను. గోరీ యాగమనమువలనఁ గలిగిన ఫలము భారతసామ్రాజ్య విధ్వంసము. పృథ్వీరాయపదభ్రంశ మనుట సాహసము. అగుట నీతని శపథము నెఱవేఱ లేదు. ఈతనికిఁ దన కవమానము జరిగిన దని తెలియును; గాని దాని యాంతర్యము తెలిసినది గాదు. అగుటవలననే యేమిచేసినఁ బృథివీరాయనికిఁ బరాభవ మగునో యాతఁడు గ్రహింప లేక పోయినాఁడు. మొత్తము మీఁద నీతఁడు శూరుఁడే గాని జ్ఞాన లవదుర్విదగ్ధుఁడు.

శహాబుద్దీనుగోరి యభిప్రాయములును, బ్రయత్నములును జేష్ట లును, ధర్మబద్ధములా, ధర్మబాహ్యములా యను సమస్య రాజ్య తంత్రమున రవంతైన జ్ఞానము లేనివారికిఁ దీరునది గాదు. మే మాతనిని గుఱించిన విమర్శలోఁ బుటలను నింపివేయఁ దలంచికొన లేదు. ఎన్ని విధముల నెన్ని యిక్కట్టులు వచ్చినను గోరీ వెనుదీయని యోధశిఖామణి. కావుననే యాతఁడు విజయలక్ష్మినిఁ జేపట్టఁ గలి గెను. ఇంతియ చాలును.

జయచంద్రుని చరిత్రము ప్రారంభమునుండి సమాప్తివఱకు నెగుడుదిగుడులు లేక యొక్కతీఱున నున్నది. ఆతని హృదయ

క్షేత్రమున ననూయాబీజమును జల్లినవాఁ డనంగపాలుఁడు. అయినను క్షేత్రము మంచిది గాకపోవుటచే నా యసూయాంకురములు వెఱ్ఱితలలు వైచినవి. మధ్యమధ్యఁ దటస్థించిన సంభవముల ననుసరించి యా యసూయాంకురము లా వెఱ్ఱితలలతోడనే యెంతవఱకుఁ బెరుగఁగలవో యంతవఱకును బెఱిగిపోయినవి. వెఱ్ఱితలలు వైచిన వృక్షము లెట్టి ఫలముల నిచ్చునో వెఱ్ఱితలలు వైచిన యా యసూయాంకురములు గూడ నట్టి ఫలములనే యిచ్చెను. జయచంద్రుఁడు గంగలోఁ బడి ప్రాణములను విడిచెను. చరిత్రకారులును, జనులునుగూడ జయచంద్రుని, దేశఘాతుకుఁ డనియు, నధమాధముఁ డనియు నిందించుచున్నారు.

పృథివీరాయని చరిత్రమున ననేకవిధము లైన రంగములు ప్రసక్తము లైనవి. అశక్తతన నాతని చరిత్ర నామూలాగ్రముగ ననేకు లవగాహనము చేసికొనలేకపోవుచున్నారు. దాని యందలి మర్మార్థమును దెలిసికొన వలసిన భారమును మేము పాఠకమహాశయులకే విడిచిపెట్టుచున్నాము. ప్రజల సుఖమునకును, దేశస్వాస్థ్యమునకును రాజేయాధారభూతుఁడై యుండుటవలనఁ జేజిక్కిన వైరిని విడిచిపెట్టు రాజులను రాజ్యతంత్రము గర్హించుచున్నది. గోరీని విడిచిపెట్టకపోయినచోఁ గొంప మునిగిపోవు సందర్భము లేవియుఁ దటస్థించి యుండనట్లు చరిత్ర వివరించుచున్నది. విడిచిన కొలందిని మీఁదికి వచ్చువానిని విడుచుట యవివేకిలక్షణ మను విషయము మూఢులకుఁ గూడఁ దెలియనిది గాదు.

పృథివీరాజు, తనభోగకాంతను మోహించిన కయమాసుమంత్రిని సంహరించుట, తనకు మిక్కిలి ప్రీతిపాత్ర మగు నేనుఁగును

బంపిన చాముండరాయనికిఁ గారాగారశిక్ష విధించుట మున్నగు విషయములను విమర్శించుటకు మేము రాజ్యతంత్రజ్ఞులను బ్రార్థించు చున్నారము. రాయఁడు, తాను షాతాఘానునిచేఁ బట్టుబడి యీ యొక్కమాఱు విడువు మని ప్రార్థించుటచే ఘోరీ నేఁడుతడవలు విడుచుటవలన నే కీర్తి గలుగు నని తలంచెనో యా కీర్తివలనఁ గూడ వంచితుఁ డయ్యెను. తుద కట్లయిన నేమి? భారతసామ్రాజ్యము విచ్ఛిన్నమై పోయెను. చరిత్రకారులును, బ్రజలును గూడఁ బృథివీ రాయఁడు దేశభక్తుఁడనియు, భారతిమాతృసత్పాత్రుఁ డనియు స్తోత్రము చేయలేక విసిగి పోవుచున్నారు.

ఈ సందర్భమున మనము చాందభట్టును విస్మరించితి మేనిఁ జాల నింద్యుల మయ్యెదము.

చాందభట్టు మహాకవి. ఈతఁడు "పృథివీరాజరాసా" యను పేరునఁ బృథివీరాజు చరిత్రమును రచియించెను. అది హిందీలో నొక యంతర్భాగం బగు చారణీభాషలో వ్రాయఁబడిన లక్షగ్రంథము. కావున నీతఁడు గౌరవపాత్రుఁ డనుటకు సందేహము లేదు; గాని మే మీతని కొసంగిన గౌరవ మంతయు నందులకే యని తలంప వలదు. బాల్యమునుండియుఁ ద న్న భేదప్రతిపత్తితోఁ జూచిన రాయని యెడల నతఁడు కనఁబఱచిన కృతజ్ఞత సంస్తవనీయము. రాజు బందిగంబున నున్నంతకాలము నీతఁ డనుభవించిన విచారపుఁ బరిమితి, పిదప మిత్రుని బంధమోక్షణార్థము గావించిన ప్రయత్నములను బట్టి మనము తెలిసికొనవచ్చును. ఈతఁడు రాజు బంధమోక్షముకొఱకే ఘోరీపైఁ గవిత్వము చెప్పెను గాని ధనసంపాదనము కొఱకు గాదు. మిత్రునకు బంధమోక్షణము గావించి యాతని వైరి నాతనిచేతనే చంపించి యాతనితోఁ గూడ నిహలోకమును బాసిపోయిన యీ

మహాకవినిగుఱించి మనుష్యమాత్రుఁ డెవ్వఁడును వ్యతిరేకాభిప్రాయమును గలిగి యుండఁ జాలఁడు.

అయిన నతఁడు రాయని కొఱకుఁ బ్రాణములను గూడ విడుచుటకుఁ దగిన కారణము లేమి యున్నవో మన మొకింత పరిశీలింతము. రాయఁ డీతని కవిత్వమును మెచ్చుకొని ధనకనకవస్తువాహనము లవ్వారిగ నొసంగెను. ఇంత మాత్రముననే భట్టు రాయని కొఱకు ప్రాణములను బాసెనా? ఇది సరియైన కారణము కాదు. ధనమువలననే లోకప్రవృత్తి యంతయు జరుగుచున్న దని మేము చెప్పఁజాలము. "ధనమూలమిదంజగ" త్తను లోకోక్తిని మే మెఱుంగక పోలేదు; గాని యీ లోకోక్తి కంతటను సిద్ధి లేదు. ఇఁక నిందలి రహస్య మేమనగా?

రాయఁడు, భట్టునకు మనసిచ్చి మనసు పుచ్చుకొనియెను. ఈ రూపమున వారి యంతరంగముల కైక్యము సంఘటిల్లినది. కావుననే రాయఁడు కారాగారమున నున్నపుడు భట్టు నానాబాధల ననుభవించుటయు, నాతని బంధమోక్షము కొఱకు ప్రయత్నించుటయు, నాతనితో నీ లోకమును విడుచుటయు సంభవించినది.

కవి యైనంతమాత్రమున భట్రాజుతో స్నేహము గావించినందులకు రాయఁడు స్తుతిపాత్రుఁడే; గాని రాజు తన యెడలఁ జూపిన గౌరవమును గ్రహింపఁ గలిగినందులకు మనము భట్టు నెంతయు మెచ్చుకొనవలసియున్నది. భట్టు హృదయము గూడ విశాలమే గావున నట్టిది సంభవించెను. హృదయవైశాల్యమే మానవుల కాప్తత్వము సంఘటించునది.

శ్రీరస్తు

# వీరపూజ



## ప్రథమభాగము

---

### భీమసింహుఁడు

లక్ష్మణసింహుఁడు చిత్తూరు దుర్గమునందలి మేవాడు సింహాసనము నలంకరించి ధరాపాలనము గావించుచుండెను. యుద్ధాదికము లగు నుత్పాతము లేవియు లేమింజేసియు, సహజముగ రాజు ప్రజాసౌఖ్యము నభిలషించువాఁ డగుటను దేశము శాంతిభూయిష్ఠంబై యుండెను. ప్రజ లెల్లరు రాజభక్తితత్పరులై, యఖండసౌఖ్యములతోఁ దులతూఁగుచుండిరి.

సృష్టిరహస్య మేమో గాని, శాంతి కెందును సుస్థితి గలుగుట చూడము. అలజడు లన్నియుఁ బోయి శాంతి నెలకొనిన దని వినిన మఱువాఁడే, యెచ్చటనో, యేవిధముననో, మఱల నశాంతి ప్రబలిన దను వార్తయే వినవచ్చుచున్నది. మొత్తము మీఁద విమర్శలోఁ జూచినచోఁ బ్రపంచ మంతయుఁ గల్లోలసంకుల మగు మహోదధి ననుకరించి యున్న దనుట యథార్థము. మహోన్నత మగు నొక్క యల వచ్చి యల్లకల్లోలము గావించిపోయిన పిదప,

మఱల వేఱొక యల వచ్చునంతలో నట సముద్రము శాంతమై యున్నట్లు కాన్పించును. భౌతిక ప్రపంచప్రవృత్తి గూడ నిట్టిదియే. ఒకానొకప్పు డే దేశమునందైనఁ గొన్నిదినములు శాంతి నెలకొని నచో నా శాంతి యాగామి యగు ప్రబలాశాంతిని సూచించును. ప్రకృతము మేవాడురాజ్యమునందలి శాంతి గూడ నిట్టిదే యైనది.

భీమసింహుఁడు రాణాలక్ష్మణసింహునకుఁ బినతండ్రి. అతఁడు భీముని వలె మహాపరాక్రమశాలి. వివేకమహితుఁడు. సుగుణములకుఁ బుట్టినిల్లు. అతఁడు ఖడ్గవ్యాపారమున సర్వసేనాధిపతియుఁ, గార్యాలోచనమున మహామాత్యుఁడును, బాంధవమునఁ దండ్రియంతటివాఁడునై, త్రికరణశుద్ధిగ రాణా యభ్యుదయమునే గోరుచు నాతనికిఁ గుడిభుజమై యుండెను.

అతఁడు సింహాలద్వీపపురాజగు హామీరసింహుని కూఁతురు పద్మినీదేవి యను నామెను బరిణయమయ్యెను. ఆమె ప్రపంచమునం దెందు నంతటి చక్కనిచుక్క లేదని పేరు గాంచెను. మఱియు, నామె చక్కఁదనమునకుఁ దగునట్లు సుగుణవతియై, యన్నివిధముల భర్త కనురూపయై యాతని పదదాసియై మెలంగుచుండెను. ఇఁక భీమసింహుఁడు స్వర్గసౌఖ్యము ననుభవించుచున్నాఁడనుటలో వింత యేమి యున్నది? ఇహలోకమున భార్యకంటె సుఖదాయకమగు వస్తువు మఱియొకటి యేమున్నది.?

“భార్యారూపవతీశత్రు.” వని యొక గ్రామీణోక్తి గలదు. ప్రాపంచికవృత్తిమును విమర్శించి చూచినచో నిది యథార్థ మని చెప్పుటకు సందేహ మక్కఱలేదు. రూపవతులకొఱ కనేక యుద్ధములు

ప్రవర్తిల్లినవి. అనేకవంశము లంతరించిపోయినవి. అనేకరాజ్యము లడుగంటినవి. రూపవతి యగుట వలననే దేవయజనసంభవ యగు జానకి రావణాపహృత యైన దని యొక చాటూక్తి గలదు. ఎచ్చట నైన నే కారణమువలన నైన నీ గ్రామీణోక్తి కెప్పుడైన వ్యతిరేకము జరుగుట సంభవించినను మొత్తము మీఁద దీనినిఁ ద్రోసివేయుటకు వలనుపడదు. పురాణములయందే గాక భారతదేశేతిహాసమునఁ గూడ దీని కనేకోదాహరణములు కాన్పించుచున్నవి.

మేవాడురాజ్యమును రాణా లక్ష్మణసింహుఁడు పరిపాలించు కాలమున నల్లాయుద్దీనుఁ డను తురుష్కుఁడు ఢిల్లీ సింహాసనము నధిష్ఠించి యుండెను. అల్లాయుద్దీనుఁడు ఖిల్జీ వంశజుఁడు. ఫిరోజను నాతఁడు బానిసవంశమునందలి కడపటివాఁ డగు కైకుబా దను సుల్తానునిఁ జంపి జలాలుద్దీనుఁడను పేరుతో ఢిల్లీశ్వరుఁ డయ్యెను. అల్లాయుద్దీనుఁడు జలాలుద్దీనుని తమ్ముని కుమారుఁడు. అల్లాయుద్దీనుఁడు సాహసధైర్యములయం దసమానుం డగుటచేఁ బెదతండ్రి యాతనినిఁ జాలఁ బ్రేమతోఁ జూచుచుఁ బెద్దపెద్ద కార్యములయందు వినియోగించుచుండెను. ఇట్లు చాలఁగాలము కడచిన పిదప నల్లాయుద్దీనుఁడు పెదతండ్రినిఁ జంపి ఢిల్లీశ్వరుఁ డయ్యెను.

పిదప నల్లాయుద్దీనుఁడు పద్మిని యంతటి సుందరి యీప్రపంచమున లేదని వినియెను. ప్రకృతిధర్మమే మో గాని "సుందరి, సుందరుఁడు" నను మాటలు రెండును వినిపించిన వెంటనే స్త్రీపురుషుల హృదయముల కొకవిధ మగు చలనము గలుగుట చూచుచున్నారము. హృదయము మన్మథ పనిసేయునప్పు డీచలనము పాల పొంగు వలె నంతలో శాంతించిపోయినను, హృదయము సుస్థిరమై

యున్నపుడు సూత్ర మంతకంతకు వృద్ధియై, దుర్భరమై కామాంకుర ముల నుత్పాదించుచున్నది. ఆపిమ్మట జరుగునదియు, జరుగుచున్న దియు విస్పష్టమే. అనేకపురుషులు సుందరు లని వినినంతనే యా స్త్రీలకొఱకు హస్తులు గూర్చి వేలకొలఁది జనులను సంహరించిరి. అనే కస్త్రీలు నెట్లు దేవేంద్రవైభవములను గూడఁ బరిత్యజించి యెవ రేమనుకొనెదరో యను సందేహమును విడిచిపెట్టి సుందరపురుషుల కొఱకు కులుపిడచి నిర్జనప్రదేశములకైనఁ బోయి యున్నారు. అయినను మే మా విషయమును నేమియుఁ జెప్పుట లేదు. ఇఁక మా సందియ మేమనఁగా? స్త్రీపురుషుల హృదయములకు వికారములను గలిగించు నా శక్తి సౌందర్యమునందే యున్నదా? సౌందర్య శబ్దమునందుఁ గూడ నున్నదా?

పద్మినీదేవి త్రిలోకసుందరి యను మాట యల్లాయుద్దీనుని హృదయమున కొకమాఱు చలనమును మాత్రము గలిగించి యూరక యుండ లేదు. వెంటనే దానివలనఁ గాఁదగిన పని యేమో యైపో యెను. ఆతని హృదయమునఁ గామాంకురములు మొలక లెత్తెను. ఆ కామము నశించిపోవుటకుఁ దగిన యవకాశము లేమియుఁ దట స్థించినవి గావు. క్రమక్రమముగ నా కామము మోహముగాఁ బరిణ మించెను. తుదకుఁ బద్మినీమోహనరూప మాతని హృదయక్షేత్ర మునఁ దాండవము ప్రారంభించెను. ఆతఁ డెప్పుడును బద్మినిని బ్రత్యక్షముగఁ గాని, పటమునఁ గాని చూచి యుండ లేదు. అయిన నేమి? భగవంతునిచే నొసంగఁబడిన భావనాబలము నిరంకుశమై యుండ నాతనికిఁ బద్మినీమోహనరూపసందర్శనమున కభ్యంతర మేమి? అదియైన తరువాత నికఁ గావలసిన దేమున్నది? రాజ్యపాలనమున

నశ్రద్ధ పొడమెను. నిద్రాహారములయం దాసక్తి పోయెను. ఇంకఁ బద్మినీదేవి తన యంతఃపురమునకు వచ్చినఁ గాని బ్రతుకఁజాల నని యాతఁడు నిశ్చయించుకొనియెను.

అది.యేమి చిత్రమో గాని భారతదేశేతిహాసమున వర్ణింపఁబడిన తురుష్కరాజులలో నేమి సరదారులలో నేమి యనేకులు భారతీయ స్త్రీలకు మానభంగము గావింపఁ దలఁచికొనిన వారే కాన్పించుచున్నారు. అనేకు లాప్రయత్నమున లబ్ధవిజయు లైనారు. అనేకులు విఫలప్రయత్ను లైనారు. అనేకులు ప్రాణములు గూడఁ దొరంగినారు. కొందఱు కొన్ని సంసారములను గూలఁద్రోసినారు. మఱికొందఱు కొన్ని రాజ్యములను బుగ్గంపాలు చేసినారు. అనేకులు భారతరమణీమణులచేతులలోనే మడిసినారు. దీనివలనఁ దురుష్కులందఱు నట్టి కాముకులే యనియు, దురుష్కజాతి కంతకు నది సహజగుణ మనియు మేము చెప్పుట లేదు. భారతదేశమునఁ బరిపాలనము గావించిన యే తురుష్కుని చరిత్రమును వ్రాయఁబూనినను సాధారణముగ భారతస్త్రీహరణమును గూర్చిన వారి ప్రయత్నములను వర్ణించుట యనివార్య మగుచున్నపు డీవిషయమును బ్రత్యేకముగ వివరించి చెప్పుటకుఁ బక్షపాతము గాని యసూయ గాని కారణము గా దని సహృదయులకుఁ దెలియనిది గాదు.

పద్మినీదేవి యెట్లు చేఁజిక్కును? ఆమె యవివాహిత గాదు. ముగబాలు. పయింబయిగ నన్నివిషయములయందును దురుష్కుల నీసడించు వంశమునకు భూషణము. సహజముగ మేవాడుసంస్థానాధీశ్వరులు మానధను లని పేరువడసిరి. అందును భీమసింహుఁ డగ్రేసరుఁడు; భీమపరాక్రముఁడు. ఈ కోరిక యెట్లు సాధ్యపడును?

పెద్దజాగీ రొకటి యిచ్చినచో వారు స్వయముగఁ బద్మినీదేవినిఁ దన యంతఃపురమునకుఁ దీసికొనివచ్చి విడిచిపోయెద రని యల్లాయుద్దీనుఁడు తెలిపెను. కాని చెంత నున్న వారి కీయాలోచన కొనసాగఁజాల దని విన్నవించిరి. దీనిపై నాతఁడు యుద్ధమైనఁ జేసి తీసికొని వచ్చెద ననియెను. అందులకు వా రెల్లరును సమ్మతించిరి. మేవాడు సంస్థానమువారు నీ ప్రతాపానలము నెదుట శలభమాత్రు లని వా రాతనినిఁ బొగడిరి. పద్మినీదేవికొఱకు విడిది మున్నుగ నేర్పాటు లన్నియుఁ జేసిననే యుద్ధమునకు బయలు వెడల వచ్చునని సలహా చెప్పిరి. పిదప నల్లాయుద్దీనుఁ డఖండసైన్యమును వెంట నిడుకొని వచ్చి చిత్తూరుదుర్గమును ముట్టడించెను.

మహాకాంక్షితం బైన యీ విపత్తు రాఁగని రాజపుత్రులు చాలఁ గలవరపడిరి. పెదతండ్రిగారిఁ జంపి రాజ్యమపహరించిన యల్లాయుద్దీనుని క్రూరస్వభావమును వారు విని యున్నారు గావున నాతఁడు రాజ్యకాంక్షియై వచ్చె నని భావించిరి. అల్లాయుద్దీనుఁడు పద్మినీదేవికొఱకు కామించి వచ్చె నను సంగతి యా క్షత్రియవీరుల కేమి యెఱుక ? కాని వారి కీశ్వరునితో యుద్ధము పొసఁగినను భయము లేదు. ఉత్తరభరతవర్షమునందలి క్షత్రియకుటుంబములయం దెల్ల శౌర్యసాహసాదికముల విషయమున మేవాడు రాజకుటుంబమే యగ్రస్థానము వహించుచున్నది. వైరివీరులను ఖడ్గములకు బలి యిచ్చుట యొండెఁ దాము బలియగుట యొండెఁ దక్క వారికి మఱియొక నిశ్చయము లేదు. అట్లగుటచే వారికి సంగర మనిన సంబరము. సైన్యము కొలఁదిగ నున్న సంకోచింపరు. గొప్పగ నున్న సంతోషింపరు. యుద్ధప్రసంగము వచ్చినచో వెంటనే నడుముకట్టి

యొఱనుండి కత్తి దూసి రణరంగమున కుఱుకుట తక్క వారు మఱి యొకటి సేయరు. మీ రిది రాజనీతిజ్ఞుల లక్షణము గా దందురా? వారు, పరులు వచ్చి యుద్ధమునకుఁ బిలిచినప్పుడు పోకకుండుట క్షత్రియలక్షణము గా దందురు. ఈ రెండు వాదములయందలి సమీచీనతను గుఱించి మేము తరువాతఁ జెప్పెదము. కథ నడపుటయే యిప్పుడు మా విధి. అల్లాయుద్దీనుఁ డట్లు కోటను ముట్టడించిన వెంటనే వారు దుర్గద్వారములను మూయించి యుద్ధమునకు సిద్ధపడిరి.

రాణా దురుష్కుని యాగమనకారణమును గుఱించి యాలోచింప సాగెను. అప్పు డాతనితో భీమసింహుఁడు గూడ నాలోచనమునఁ బ్రవృత్తుఁడై యుండెను. ఒకదానిపై నొకటి చొప్పున వారి కనేకయాలోచనలు తోఁచెను. తుదకు వా రీ యాలోచనాపరంపరచే విసిగిపోయి "యికఁ గారణములతోఁ బనిలేదు. యుద్ధము తప్ప" దని నిశ్చయము గావించుకొని సైన్యపరీక్షకు బయల్వెడలిరి.

ఇంతలోఁ దురుష్కుని వద్దనుండి కోటలోని కొక వార్త వచ్చెను. ఆ వార్త వినుటకు వారు చాలఁ దొందరపడిరి. అల్లాయుద్దీనుఁ డిట్లు కబురంపెను. "మేము మీ కోటను బ్రద్దలుగొట్టి మీ రాజ్యము నాక్రమించుకొనవలె నని గాని, మీచేఁ గప్పము పుచ్చుకొనవలె నని గాని వచ్చి యుండలేదు. మీరు, వీరును మీ కోటకును, మీ రాజ్యమునకును, సుస్థితిని గోరెద రేనిఁ ద్రిలోకసుందరి యగు పద్మినీదేవిని మాకిచ్చివేయుఁడు. లేకున్న బలిమినిఁ దీసికొని పోయెదము"

ఆ క్షత్రియవీరు లావార్త నాలించి ప్రళయకాలరుద్రుల వలె మండిపడిరి. ఇంతకంటె వారి యాగ్రహమును మేము వర్ణింపఁ జాలము. భారతీయులకుఁ దమ స్త్రీలమానమును గాపాడుకొనుట కంటె వేఱొక యుత్కృష్టకార్యము లేదు. ఇతరజాతుల వారికిఁ గూడ నిట్టి పట్టుదల యుండిన నుండవచ్చును. కాని యొక్క స్త్రీ మానమును గాపాడుటకు భారతీయులు చూపునంతటి యాత్మత్యాగము నెవ్వరును జూపఁజాలరు. పరస్పరభిన్నాచారము లగు రెండు జాతుల మైత్రిని మే మంగీకరింతుము గాని సమ్మేళనము నంగీకరింపఁ జాలము. భిన్నజాతిసమ్మేళనము వలనఁ గలుగు లాభము లాభాసములు. గంగాగోదావరీకృష్ణవేణ్యాదినదుల పావిత్ర్యమును, గోబ్రాహ్మణమహాత్మ్యము నంగీకరించువా రెవరును భిన్నజాతిసమ్మేళనమున కంగీకరింపఁజాలరు.

తమ జాతియే సర్వోత్కృష్ట మని భారతీయుల యభిప్రాయము. ఋగ్యజుర్వేదాదికము లగు భారతీయుల మూలగ్రంథముల ఘనతను స్వయముగ నెఱింగిన విజాతీయపండితులు గూడ భారతజాతి యుత్కర్షము నంగీకరించి యున్నారు. తమ తమ జాతుల యెడల నిట్టి యభిప్రాయ మెల్లరకు నుండవచ్చును. అట్లయిన జాతిసాంకర్యమున కవకాశమే యుండదు. ప్రపంచమునందలి జాతుల కన్నిటికి నైక్యము గావలె నని గోరువారి కీ వాద మవిచారమూలకముగఁ గాన్పింపవచ్చును; గాని సర్వజాతులకు నైక్య మెన్నటికిని సంఘటిల్ల దనియు, నొకవేళ సంఘటిల్లినచో నది రాజకీయవిషయములఁ గాని సాంఘికవిషయములఁ గా దనియు నెఱుంగుట వారికి శ్రేయము. ప్రకృతమునఁ గాకపోయినఁ బూర్వకాలమున నైన

సన్నతి వహించియున్న జాతిలోఁ బుట్టినవాఁడు, తన పూర్వులజ్ఞాను లని గాని, తన వేద మజ్ఞానవిలసిత మని గాని చెప్పుటకుఁ గాదు; తలంచుటకుఁగూడ నంగీకరింపఁజాలఁడు.

ఉత్తరభారతదేశమునందలి క్షత్రియసంస్థానములలో నెల్ల ముఖ్యముగ మేవాడు సంస్థానమువారు తొలుదొల్త నుండియు నీ భావమునే ప్రకటించిరి. అట్లాగ్రహావహోగ్రులై యున్న రాణాయును భీమసింహుఁడును గూడ నతిరోషసంబున బురుజుల మీఁది కరిగి తురుష్కశిబిరములను ధ్వంసముసేయుఁ డని ఫిరంగీల సైనికుల కాజ్ఞ యిచ్చిరి. మాహాత్మ్యయుక్తమై, తనసైనికులలో ననేకులకు వీరస్వర్గము నొసంగిన భీకరాయసగోళపతతియే యాల్లాయుద్దీనునకుఁ బ్రత్యుత్తరం బయ్యెను.

ఇది యంతయుఁ జూచి సంగతిసందర్భములు గ్రహించికొని యాల్లాయుద్దీనుఁ డత్యుగ్రుఁడై కోటను ధ్వంసముసేయ సైనికుల కాజ్ఞాపించెను. వెంటనే యుద్ధము ప్రారంభ మయ్యెను. ఈ యుద్ధము చాల దినములు జరిగెను. రాజపుత్రు లెవ్వరును జిత్తూరు వారికి సాయము రాకుండ మార్గము లన్నియు నరికట్టి తా నవసర మైనపు డెల్ల దిల్లీనుండి క్రొత్తసైన్యమును రప్పించుకొనుచు నల్లాయుద్దీనుఁడు పద్మినీదేవి పొం దొనఁగూడినచోఁ గలుగు నానందము నూహించుకొనుచుఁ బోరు సాగించుచుండెను.

కాని యెన్నివిధములఁ బ్రయత్నించినను రాజపుత్రులు స్వాధీన మగుదు రని తలంచుట కాధారములు కాన్పింపవయ్యెను. దినములు గడచిన కొలఁదిని దురుష్కసైన్యములు తరిగిపోసాగెను; కాని రాజపుత్రులు మాత్రము చెక్కుచెదరక యట్లేయున్న ట్లుండిరి.

దుర్గ మెత్తయిన కొండమీఁద నుండుటచేఁ దురుష్కుల ఫిరంగీల బారులు చాలకఱకు నిష్ఫలములై పోవుచుండెను. రాజపుత్రులు ప్రయోగించు ప్రతిశతఘ్నులయు వందల కొలఁది తురుష్కులను రూపుమాపుచుండెను. అట్లగుటం జేసి తుట్టతుద కల్లాయుద్దీనుఁ డిఁక జయము నెడల నాశ వదలుకొనవలసినదే యని నిశ్చయించుకొనియెను.

కాని పద్మిని మీఁది యాశ మాత్ర మాతని కింకను పెరిగిపోవుచునే యుండెను. ఆ యాశవలన క్షీణించిపోయిన పౌరుష మపుడపుడు మఱల నుద్దీప్తంబు కాసాగెను. ఈ యాశయు నా పౌరుషంబును గలిసి శిబిరమునఁ గూరుచుండి దిల్లీకిఁ బోవలయు నని యూహించుకొనుచుండ నల్లాయుద్దీనుని మఱల మఱల యుద్ధభూమి కుఱికించుచుండెను. ఎంతచేసినను ఫలము లేదయ్యెను. తుదకుఁ బద్మినీదేవిమీఁది యాశ పూర్వపక్షమైపోయెను. పౌరుషము మొదలే నశించిపోయెను. ఇఁక నేమియుఁ జేయఁజాల నని తలంచి లజ్జ నంతకు ముందే త్యజించి యల్లాయుద్దీనుఁడు, “పద్మిని నొకమాఱు చూపినఁ జాలును. నేను ముట్టడి మాని దిల్లీకిం బోయెద” నని రాజపుత్రులకుఁ దెలిపెను.

రాజపుత్రులు గూడఁ గొంత యలసిపోయిరి. రాణాయును భీమసింహుఁడును, దక్కుంగల కులవృద్ధులు నీ విషయమును గుఱించి చాలఁ దీవ్రముగ నాలోచించిరి. ఎవ్వఁడే స్త్రీనిఁ గామించి తీసికొనిపోవుటకు వచ్చెనో యా విజాతీయున కా స్త్రీనిఁ జూపునెడల మానమునకును శౌర్యమునకునుఁ గలంకము వచ్చునా రాదా యని మొదటి ప్రశ్న. దానికి వారెట్లో సమాధానము నూహించుకొనిన

వెంటనే "యింకటితోఁ దురుష్కుఁడు ముట్టడిమాని పోవునా పోఁడా? యని మఱియొక ప్రశ్న తారసిల్లెను. దానికిఁ గూడ నొకవిధముగ సమాధానము నూహించుకొనిరి. కాని యెల్లరును గలిసి కట్టకడపల "నీ యవసరమున భీమసింహుఁడు ప్రత్యుత్తర మీయవలసియుండు" నని చెప్పిరి. రాణాయు నా యభిప్రాయమునే సూచించెను.

భీముఁడు వారి మాటలవలనను బట్టి తురుష్కుని కోరికను దీర్చుటయే వారి యభిప్రాయ మైనట్లు గ్రహించెను. పిదప నాతని మనస్సు పరిపరివిధములఁ బోయెను. కులమువా రంగీకరించినంతమాత్రమున మానభంగమున కొప్పుకొనవలసినదేనా యని యొకమాఱును, నిది మానభంగ మగునా కాదా యని మఱియొకమాఱును, యుద్ధము సేయలేక విసివిపోయి యిట్లు కోరిన తురుష్కుఁడు దీని కంగీకరింపకున్న నేమి సేయఁగలఁ డని యింకొకమాఱు నాతఁ డిట్లనేకవిధములఁ దనలోఁ దాను చర్చించుకొనియెను. కాని యెటు సెప్పుటకు నాతనికి సాహసము గలిగినది గాదు. మఱల మఱల నాలోచించుకొనియెను. పద్మిని యేమి చేసిన నేమనునో యని గూడ సంశయము తోఁచెను. ఈ తీవ్రచర్చలో నాతనికి మఱియొక సందియము గలిగెను. కులపుఁబెద్దల సంగతి యట్లుండుఁ గాక. ఏమి చేసినను బద్మిని యిఁకఁ దనకుఁ దక్కునా తక్కదా? ఈసందేహము తోఁచినపు డాతని హృదయము కలఁగిపోయెను. ఇఁక హృదయ మాలోచనకుఁ జోటిచ్చినది గాదు. అక్కుతన నాతఁడు సాహసించి "యిట్టి సందిగ్ధస్థితిలోఁ గర్తవ్యనిర్ధారణము కులస్వాములే చేయవలయు" నని చెప్పెను. ఇది విని వా రెల్లరును "భీముని బిగి సడలి

పోయినదని తలంచిరి. ఒక్క భీముని బిగియే గాదు. రాజపుత్రుల యందఱిబిగియు సడలినదని మేము తలంచుచున్నారము.

పిదప భార మంతయుఁ దనపైఁబడుటచేఁ గులస్వాములును లక్ష్మణసింహుఁడును మఱల మఱలఁ జాలఁ దీవ్రముగ నాలోచించి తుదకుఁ బద్మినీప్రతిబింబమును జూపుట కంగీకరించిరి. భీముఁ డందులకుఁ దన యభ్యంతర మేమియు లే దనియెను. అప్పుడు రాణా "నీకుఁ బ్రత్యక్షముగఁ బద్మినీదేవి దర్శన మగుట కలలోని వార్త. కలయు నెడల నిలువుటద్దములోని యామె ప్రతిబింబమును నీవు చూడవచ్చు" నని తురుష్కునకుఁ దెలియఁబఱచెను.

"కాముకస్య కుతో లజ్జా" యని యొక లోకోక్తి కలదు. దీని యాథార్థ్యమును గుఱించి సందేహింపవలసిన యావశ్యకము గాన్పింపదు. ఒకొక్కప్పుడు కాముకులు తమతమ మనోహారిణుల యెడలఁ గావించు చేష్ట లాశ్చర్యజనకములు. దర్శనమాత్రముననే కొందఱానందింతురు. వచశ్శ్రవణమాత్రంబుననే మఱికొందఱుబ్బిపోయెదరు. తమ ప్రియురాండ్రను గుఱించి పర రెవరైనఁ జెప్పుకొనుట విని సైతము ధన్యుల మని తలంచు మహాత్ము లున్నారు. తలుపు చాటున నుండియైన, నిముస మైన నామె ముఖమండలము గాన్పించినఁ జాలు నని విసుగులేకుండఁ దఱచుగ నా వీధినిఁ దిరుగువారు వందలకొలఁదిగ నున్నారు. ఆమె ధరించి పాఱవైచిన కుసుమమాలికలను, కేవలకుసుమములను గూడ నత్యానందముతోఁ దీసి యత్యాదరముతో నాఘ్రాణించి జాగ్రత్త సేయువారు గూడ నున్నారు. ఇఁక నామె చెప్పినపనులు చేయుటయందుమాత్రమే దినములు, మాసములు, సంవత్సరములు గూడఁ గడపివైచిన వారి విషయమున్న

భావనాబలంబున నే యామె కోర్కెల నూహించుకొని వెంటనే తీర్చువారి సంగతిని, నే హేతువువలన నైన నామె గ్రామాంతరము వెళ్లినచో నేదో యొక వంక పెట్టుకొని తాము గూడ నా గ్రామమున కరుగువారిని గుఱించి యిటుఁ జెప్పవలసిన పని యేమున్నది? అంత మాత్రమున నేమి ఫల మని మీరు మమ్ము ప్రశ్నింప వలదు. అది కాముకైక వేద్యము. మే మెట్లు చెప్పగలము?

కాముకవృత్తం బిట్టిదగుట నల్లాయుద్దీనుఁ డందులకే సంతోషముతో నంగీకరించెను. అతఁడు, యుద్ధము మాని సైనికుల నందఱను శిబిరములలో విశ్రమింప నాజ్ఞాపించెను. కోటలోఁ బద్మినీసందర్శనమునకు వలయు నేర్పాటు లన్నియు నిముసములో ముగిసెను. నిలువుటద్దమునఁ దురుష్కునకుఁ దన ప్రతిబింబమును జూపుటకుఁ బద్మిని మనస్ఫూర్తిగ నంగీకరించెనో, పురుషుల బలాత్కారము వలన సమ్మతించెనో చెప్పఁజాలము. ఎట్లయిన నేమి?

ఇంతలో రావచ్చు నని కోటలోనుండి వర్తమానము వచ్చెను. అది విని పరమానందభరితుఁడై చక్కఁగ నలంకరించుకొని యున్న యల్లాయుద్దీనుఁడు వెంటనే బయలుదేఱి యొంటరిగఁ గొండ యెక్కి దుర్గములోఁ బ్రవేశించెను. సంధి కుదిరినది గావున రాజపుత్రులు కొందఱాతని నుచితమర్యాదలతో నెదుర్కొని రంగస్థలమునకుఁ దీసికొనిపోయిరి. అట నొకదానిలోని ప్రతిబింబ మొకదానిలోఁ బ్రతిబింబించునట్లు నిలువుటద్దములు వరుసగ నమర్పఁబడి యుండెను. తరువాతఁ గొన్ని నిముసములకుఁ బద్మినీమోహనరూప మా దర్పణములయందుఁ బ్రతిబింబిత మయ్యెను. తురుష్కుఁ డది చూచి ఘూర్ణుఁడై కొంతవఱకుఁ బ్రతిమాకృతినిఁ దాల్చెను. పిమ్మటఁ

దెలివొంది, యామె తన మోహనరూపమును గాంచినచో నిప్పుడు గాకున్న మతియొకప్పుడైన వెనుదగిలి రాక మానదని భావించి, తన ప్రతిబింబ మామెకుఁ గాన్పించున ట్లద్దమున కెదురుగ నిలిచి యామె సౌందర్యమును మఱల నొకమాఱు చూచి నిశ్చిత వదనుఁడై మఱల యథాస్థానమునకు వచ్చి కూర్చుండెను.

పద్మినీరూపసందర్శన మింతటితో ముగిసెను. అల్లాయుద్దీనునకును రాజపుత్రులకును స్నేహ మొనఁగూడెను. ఎప్పటికి నీ స్నేహ మిట్లేయుండవలయు నని వారు కూడఁబలికికొనిరి. ఎల్లరి చెంతను సెలవు గైకొని యల్లాయుద్దీనుఁడు తన శిబిరమునకు బయలుదేఱెను. రాణా మున్నగువా రెల్లరు నచ్చటనే యుండిపోయిరి. పెద్దల యనుజ్ఞ చొప్పున భీమసింహుఁడు తురుష్కుని సాగనంపుటకు బయలుదేఱెను. వా రిరువురును మందహాసవదనులై యేమేమో మాట్లాడుకొనుచుఁ బ్రాకారము లన్నియు దాఁటి మెట్లమీఁదనుండి కొండ దిగసాగిరి. ఛీ! తన భార్యను దీసికొనిపోవుటకు వచ్చిన వానిని సగౌరవముగ సాగనంపుటా?

ఆ మాటయు నా మాటయు ముచ్చటించుకొనుచు, నడుమ నల్లాయుద్దీనుఁడు "మీ రొకసారి మా ఢిల్లీనగరమునకుఁ జనుదెంచి మమ్ము గౌరవింపఁ గోరుచున్నార" మని భీమసింహునితో ననియెను. "తీరికయైనప్పు డట్లే చేయవచ్చు"నని తురుష్కునకు భీమసింహుఁడు ప్రత్యుత్తర మిచ్చెను. వా రిట్లు మాట్లాడుకొనుచుఁ గొండమీఁదఁ జాల దూర మరిగిరి. భీమసింహుఁ డింక వెనుకకుఁ బోవలె నని తలఁచి యల్లాయుద్దీనుని యసంపూర్ణవాక్యమును దానే ముగించి "యింక సెలవు గైకొనియెద" ననియెను. "చిత్త" మని చెప్పి

చిన్నగవులోఁ దురుష్కుఁడు మార్గమున కిరుకెలంకులనున్న సాంద్ర లతాగుల్మములదెస దృష్టి సారించి కొంచెము దగ్గుట నభినయించెను. కనుమూసి తెఱచునంతలో నా పొదలచాటునుండి కొందఱు తురుష్క భటు లరుదెంచి భీమసింహునిఁ గదలకుండఁ బట్టుకొని కాలు సేతు లకు సంకెలలు తగిలించి కైదు చేసిరి. భీమసింహుఁ డది చూచి నిర్విణ్ణుఁడై పోయెను. ఔరా! ఎంత వింత!

అల్లాయుద్దీనుఁడు ద్రుతగమనంబున క్షణములో శిబిరమును జేరికొని భీమసింహునిఁ బ్రత్యేకశిబిరమున బంధించి "యిఁకఁ బద్మిని యెట్లు చేఁజిక్కదో చూచెద"నని యనుకొని తన తెలివితేటల కొక మాఱు గర్వించి, యుద్ధము సేయుటకు సైనికులను సర్వసిద్ధముగా నుండ నియమించి "పద్మిని నిచ్చినఁ గాని భీమసింహుని విడువ" మని రాజపుత్రులకు వర్తమానము చేసెను. అట్లు చేయకపోయినచో మఱల యుద్ధము ప్రారంభించుటయే గాక, "భీమసింహుని సంహరించివైచెద" మని కూడ నా వార్తలో సూచించెను.

కోటబురుజులమీఁదఁ గాపున్న భటులమూలమున భీమసింహుని బంధనవృత్తాంతమును విని తెల్లవోయియున్న రాణాయుఁ గులస్వాములు నల్లాయుద్దీనుని సందేశమును విని కొయ్యబాఱి పోయిరి. అంతఃపుర మంతయు గగ్గోలుపడసాగెను. తక్కిన వారెల్లరును గళవళపడఁజొచ్చిరి. రాణా చాల విచారించెను. పిదప నెల్లరును గూడి భీమసింహుని విడపించుట యెట్లని యాలోచింపఁ దొడఁగిరి. వారి కనేకోపాయములు తోఁచెను. కాని యన్నియుఁ బ్రతిహతములై పోయెను.

రాణా యగుట లక్ష్మణసింహునిపై నిప్పుడు చాల భారము పడినది. అల్లా యుద్దీనున కిప్పు డాతఁడే సమాధానము చెప్పవలసి యున్నది. మొదటి నుండియు నక్కృత్రిమప్రేమతోఁ గేవలము తన యభ్యుదయముకొఱకు జీవితము ధారవోయుచున్న భీమసింహుని విడిచిపెట్టుట న్యాయ్యమా? అతనికొఱ కాతని యాఱప్రాణ మగు పద్మినీదేవిని విడుచుట ధర్మమా? మేవాడు రాజ్యమునకుఁ బ్రతిష్ఠ వచ్చినను, నప్రతిష్ఠ వచ్చినను, జయము సేకూరినను, వినాశము సంప్రాప్తించినను నేఁటి యీ సమస్య వలననే యెల్ల నగును. ఇప్పుడు మేవాడు రాజ్యములోఁ గూడ వారిరువురను రక్షించితీఱ వలెను. ఏమి దారి?

అంతఃపురమునఁ బద్మిని సైత మిట్లే తనకును, దనభర్తకును, మేవాడు రాజ్యలక్ష్మికి నెట్టి యపాయము నొదవకుండ నీ యాపద నుండి దాఁటుట యెట్లని యాలోచించుచుండెను. పాప మీ సందర్భమున నామెకుఁ గూడ ననేకాలోచన లుప్పతిల్లి వెంటనే యన్నియుఁ బూర్వపక్షములై పోయెను. మఱల దీర్ఘాలోచనము ప్రారంభించెను. ఇంతలో "దర్శనమునకు నిరీక్షించి యున్నాఁడ" నని లక్ష్మణసింహుఁడు పరిచారికాముఖమున నామెకు సమాచార మంపెను. అప్పటి కామె యాలోచన పూర్తి యయ్యెను. "ఇఁక నిప్పుడు దర్శనమునకు రానక్కఱ లేదు. "మీకుఁ బద్మినీదేవి నిచ్చి వైచెదము. మీరు ముట్టడి మానివేయవలయును. మఱియుఁ బద్మినీ దేవి చాల గౌరవము గల దగుటవలన నామెను సాగనంపుటకై యేడువందల మేనాలలో క్షత్రియస్త్రీలు వచ్చెదరు. కావున వారి పల్లకు లెల్ల విడియుటకుఁ దగిన యేర్పాటులు గావింపవలెను. వారి

రాణివాసమున కేమియు భంగము గలుగఁ గూడదు. నా వా రెవ్వరు
నా డేరాచెంగట నుండ రాదు. అట్లయినఁ బద్మిని నీకుఁ దక్కు”
నని తురుష్కునకు సందేశ మంపవచ్చు” నని యామె కుమారునకుఁ
బ్రత్యుత్తర మంపెను.

అదివినిన వెంటనే లక్ష్మణసింహుఁడు నివ్వెఱవడెను; గాని
తోడనే యందలి మర్మార్థము నెఱింగి పినతల్లి వివేక గౌరవమునకుఁ
జాల సంతసించి కార్యసిద్ధి యైనట్లే భావించెను. ఆ వెంటనే యీ
వార్త నల్లాయుద్దీనునకుఁ దెలియఁజేసి ప్రత్యుత్తరము కొఱకుఁ బ్రతీ
క్షింపసాగెను.

అప్పు డల్లాయుద్దీనునకుఁ గలిగిన యానందమునకు మితి లేదు.
తాను వినినంతకంటె నెక్కుడు సౌందర్యవతియై యున్న పద్మిని
తన్ననుగ్రహించు నని తెలియవచ్చుటచే నత్తురుష్కుఁ డింకఁ దన
యంతటి యదృష్టవంతుఁడు భూలోకమున మఱియొకఁ డుండఁబోఁడ
నియు, నిలువుటద్దమున నామె కెదురుగ నిలిచి తాను గావించిన
ప్రేమసూచకం బగు కనుసన్న పూర్తిగఁ బనిచేసె ననియు, నామె
యా యద్దమున స్వీయప్రతిబింబమునకు సరసఁ బ్రతిబింబితంబైన
తన ప్రతిబింబము నారసి నిలువెల్లఁ గరఁగిపోయి యుండు ననియు,
నప్పుడే యామె యిప్పు డీ రసికశేఖరునితోఁ గలిసి సుఖించుట
సంభవించు నని యనుకొని యుండు ననియు, నట్లగుట నీ సమయ
మునఁ దాను భీమసింహునిఁ జెఱఁబట్టుట పద్మినికినిఁ దనకును గూడ
మంచిదే యైన దనియు భావించి యాతఁ డుప్పొంగిపోసాగెను.
ఈ యానందాతిరేకమువలన భావరహితములై పోయిన యాతని
చూడ్కు లప్పుడు విద్యుల్లతల వలె మెఱసిపోఁజొచ్చెను.

ఇట్లొక నిమిషము గడచిపోయిన తరువాతఁ బద్మినిని సాగనంపుట కేడువందల పల్లకీలలో క్షత్రియ స్త్రీలు వచ్చెద రనియు, వారికిఁ దగు విడిది యేర్పాటు చేయవలయు ననియు రాజపుత్రులు పంపిన సందేశము జ్ఞప్తికి వచ్చెను. వెంటనే యాతఁ డొక పెద్దడేరా నిర్మింపించి పద్మిని రాకకై చిత్తూరు దుర్గసింహద్వారము దెసకుఁ జూచుచుఁ గూర్చుండెను. అప్పు డాతఁడు "రాజపుత్రు లేమో మహాపరాక్రమశాలు లను నహంకారముతో నిఁకఁ బోరుటవలన లాభము లేదని తలంచి పద్మిని నొకమాఱు చూపినఁ జాలు నని తా ననుట చాలఁ బొరపాటుపని యనియు, నింకను రెండు దినము లిట్లే పోరాడినయెడలఁ దనకీ కళంకము రాకుండ నుండునదియే యనియు ననుకొని "యిఁక గతించిన దానిని గుఱించి విచారించుట వలనఁ బ్రయోజనము" లేదని మనస్సునకు సమాధానము చెప్పుకొనెను.

ఇంతలో దుర్గద్వారము తెఱవఁబడియెను. ఆయుధపాణు లగు కొందఱు కాల్బంటులు ముందు వచ్చిరి. వారి వెనుకఁ బట్టుతెరలతో మూయఁబడిన నాలుగువందల పల్లకులు వచ్చెను. పిదప నిశితాయుధములను ధరించిన సుందరీమణులచేఁ బరివేష్టింపఁబడి, ముత్యాల ఝాలరులతో నలంకరింపఁబడిన పట్టుబురకాచే నాచ్ఛాదిత మగు దంతపుఁబల్లకీయు, దాని వెనుక నతి మూఁడువందల పల్లకులును, వాని వెనుక సాయుధపాణు లగు కాల్బంటులును వచ్చిరి. ఒక్కొక్క పల్లకీకిఁ బదార్గురు బోయీ లేర్పఱుపఁబడి యుండిరి. ముందు వెనుకల నున్న కాల్బంటుల సంఖ్య యొక సహస్రమునకు మించి యుండెను. అది యంతయుఁ జూచి యల్లాయుద్దీనుఁడు "పద్మిని చాల మానవతి. నాకుఁ దగిన రాణి" యనుకొని, క్షత్రియ స్త్రీలకు విడిదిగా నేర్పఱుపఁబడిన డేరాచెంగటఁ బురుషు లెవ్వరును లేకుండ

నటు మీద నొక్క సరదారున కాజ్ఞయిచ్చెను. ఆ సరదారుడు యజమా నుని కంటెను మొగమోటలేనివాఁడు. పెద్దమనుష్యుఁ డగు నా సరదా రుఁ డాదొరకుఁ బురుష రేఖ్యయును జూడనే కూడ దని శాసించెను. క్షణములో నేఁడువందల పల్లకులును వచ్చి యా గుడారము ప్రవే శించెను. కాల్బంటులు గుడారము చుట్టును బారులు తీర్చి నిలిచిరి.

ఇది యంతయుఁ జూచి భావప్రపంచమున విహరించుచున్న యల్లాయుద్దీనుని యెదుట గంభీరగమనముతో వచ్చి యొక రాజపుత్ర యోధుఁడు నిలువఁబడియెను. అతనిచేత నొక నిశితఖడ్గమును నవ లక్నబంధమున దీర్ఘకరవాల మొకటియు నుండెను. అతని కోరమీస ముల వీఁడను, గంభీరదృష్టుల యందును వీరరసము పొంగి పొరలి పోవుచుండెను. అల్లాయుద్దీనుఁడు హఠాత్తుగ నాతనిం జూచి యులికి పడి యంతలో ధైర్యము తెచ్చికొని "ఎవరవు" వని ప్రశ్నించెను. అందుల కాతఁడు "నేను రాజపుత్రుఁడను. పద్మినీదేవి వెంట వచ్చి తిని. ఆమెను నీ యాధీనము సేయక మున్ను నీతో నొకటి చెప్పవలసి యున్నది." అని ప్రత్యుత్తర మిచ్చెను.

అది విని సుల్తాను నిర్భయుఁ డయ్యెను. అతని చిత్తచాంచల్య ముపశమిల్లెను. అప్పు డదియేమో చెప్ప వచ్చు నని మెల్లఁగఁ బలుక రాజపుత్రుఁ డిట్లనియెను. "త్రిలోకసుందరి యగు శ్రీమతి పద్మినీ దేవి యిప్పుడు నీ వశము గానున్నది. ఈ రూపమునఁ జాలఁగాలము నుండి కలసిమెలసి యున్న పద్మినీభీమసింహులకు వియోగము కలుగు చున్నది. నీ యంతఃపురముఁ జేరుటవలనఁ బద్మినీదేవికి సుఖమే కలుగ వచ్చును. కాని భీమసింహున కిఁక నీ యైహిక జీవితము కుంభీపాక నరకము కాకమానదు. కావున నామె నీ యంతఃపురము చొచ్చుటకుఁ

భాగ్యము మఱదృష్టవంతుఁ డగు భీమసింహున కామెతోఁ గొన్ని నిమిషములు మాత్రము మాట్లాడుట కవకాశ మీయవలెను. ఇది కానున్న నీ దేవి యగు పద్మిని యభిలాష"

"పద్మినీదేవి యభిలాషయా? అట్లయిన నభ్యంతర మేల? అట్లే చేయవచ్చును. పద్మిని యాజ్ఞ గొంచు రమ్మనులే" యని చెప్పుచు వెంటనే యల్లాయుద్దీనుఁడు భీమసింహుని రప్పించెను. రాజపుత్ర యోధుఁడు భీమసింహునిఁ దనతోఁ గూడ రమ్మని పిలిచెను. భీమ సింహున కది యేమియు నర్థము కాలేదు. అతని మొగమునఁ గ్రోధ రసము ప్రత్యక్షమయ్యెను; గాని యోధుఁడు కనుసన్న సేయుట వలన వెంటనే భీమసింహుఁడాతనితో బయలుదేఱెను. క్షణములో వారు పద్మిని విడిదిలోఁ బ్రవేశించిరి. మఱల యోధుఁడు వచ్చి యథా పూర్వముగ నల్లాయుద్దీనుని చెంగట నిలువఁబడియెను.

కాల మెంతసేపు నిలిచి యుండును? నిముసముల మీఁద నిముసములు వచ్చి పడిపోవుచుండెను. గడియ దాఁటెను. ఇఁక నొక యరగడియ గూడ దాఁటిపోయెను. "ఇంక నెంతసేపు మాట్లాడ వలయు" నని సుల్తాను వేగిరం పడసాగెను. ఇంతలో దేరానుండి కొన్ని పల్లకీలు కొండవెనుక బయలుదేఱెను. అది యేమని యాత్రముతో నల్లాయుద్దీనుఁడు ప్రశ్నించెను. "పద్మినిని సాగనంపవచ్చిన క్షత్రియస్త్రీలు తిరిగి దుర్గమునకుఁ బోవుచున్నా" రని రాజపుత్రుఁ డనెను. "వలనుపడదు. పద్మిని మా యంతఃపురమునకు వచ్చునంత దనుక నెవరును గదలఁ గూడ" దని సుల్తా నఱచెను. రాజపుత్రుఁడు దాని కేమియుఁ బ్రత్యుత్తర మీయక యున్నట్లే యుండి హఠాత్తుగఁ బద్మిని విడిది దెస కొకసారి దృష్టి సారించి, బ్రహ్మాండము

బ్రద్ద లగునట్లు "హరహరా!" యని యఱచి, సుల్తానుదెస కురికి బల్లెము విసరెను; గాని యాతనిచెంత నున్న తురుష్కసర్దారు లలోఁ గొందఱు రాజపుత్రుని వంకఁ దసోకదృష్టితోఁ జూచుచుండు టవలన నాతఁడు విఫలమనోరథుఁ డయ్యెను. అతని యేటు తప్పి పోయెను; కాని దానిచే నొక తురుష్కసర్దారుఁడు మాత్రము నేలఁగూలెను. వెంటనే తక్కిన వారు రాజపుత్రునిపైఁ బడి చిత్ర వధ గావించిరి. ఆలోపున మఱికొందఱు తురుష్కసర్దారులు కూలిరి. ఇంతలో డేరాచుట్టును నిలిచియున్న రాజపుత్రులు ముందున కురికిరి. సుల్తాను పలాయనము చిత్తగించెను. రాజపుత్రులు నిరంకుశులైరి. క్షణములో డేరాలోనుండి నాలుగైదువేల రాజపుత్రులు వచ్చి మొదటి వారికి సాయపడిరి. తురుష్కులు నమ్మి నట్లు పల్లకీలలో క్షత్రియస్త్రీలు రాలేదు. ప్రతి పల్లకియందును, కత్తి, కటారి, తుపాకి, బల్లెము, డాలు మున్నగు యుద్ధోపకరణము లుండెను. బోయీ లెల్లరును రాజపుత్రయోధులు. పద్మినితో మాట్లాడుటకు డేరాలోని కరిగిన భీమసింహుఁడు, పద్మినిని సాగనంపి క్షత్రియస్త్రీలు తిరిగి కోటలోనికిఁ బోవుచున్నా రనిన పల్లకులయం దొక దానిలోఁ గూరుచుండి యప్రతిహత మగు సహాయమును బన్ని తన మానప్రాణములు కోటలో నంతఃపురమున నుండియే కాపాడిన రమణీమణి యగు పద్మినీదేవితో మాట్లాడుటకుఁ బోయెను. "నిన్ను దీసికొనిపోవుటకు వచ్చి చాలలేక, నిలువుటద్దమున నీ ప్రతిబింబమును జూచి సాగనంపఁబోయినపుడు నన్నుఁ గైదుచేసిన తురుష్కుని బారినుండి నీ యనుగ్రహమువలననే తప్పించుకొని వచ్చితి నని భీమసింహుఁడు, పద్మినికిఁ గృతజ్ఞతఁ జూపుటకుఁ గాఁబోలుఁ

గానున్న సంగ్రామము మాట తలంపక రహస్యముగఁ బల్లకీలోఁ గూరుచుండి తప్పించుకొని పోవుట! అదిరా! పౌరుషము!

రాజపుత్రయోధుల కలకలం బాలకించియును, బలాయనము గావించిన యల్లాయుద్దీనునిచేఁ బ్రబోధితులైయును తురుష్కసైనికులు తొలుత రివ్వనడిరి గాని వెంటనే ధైర్యము తెచ్చుకొని దీన్ దీనను రణధ్వనులు మిన్నుముట్ట శీఘ్రవేగముగ వచ్చి క్షత్రియసైన్యమును దాఁకిరి. ఇంతలో దుర్గములోనుండి మఱికొందఱు క్షత్రియులు వచ్చి తమ వారితోఁ గలిసికొనిరి.

ఈ సంకులసమరము మతిభయంకరముగఁ బ్రవర్తిల్లెను. ఇరుతెగలవారును చాలఁ బట్టుదలతోఁ బోరిరి. రక్తపుఁగాల్వ లఖండముగఁ బ్రవహించెను. ఇది యాకస్మికముగఁ గారిల్లుటం జేసియు,నంతవఱకు రాజపుత్రులవలెఁ గాక తురుష్కు లిఁక యుద్ధముచేయవలసిన యగత్యము లేదని యుపేక్షించి యుండుటవలనను రాజపుత్రుల చేయి మీఁదయ్యెను. తురుష్కవాహిని క్షత్రియప్రతాపమునకోర్వఁ జాలక యింకిపోయెను. హతశేషులు పాఱిపోయిరి. అల్లాయుద్దీనుఁ డంతకుముందే యపజయము తప్పదని నిశ్చయించుకొని తిరిగి చూడకుండ ఢిల్లీకిఁ బాఱిపోయెను. భాగ్యవశమున విజయలక్ష్మి రాజపుత్రులనే వరించెను. కాని యీ సంకులసమరమున వారిలోని విఖ్యాతయోధు లనేకులు మడిసిపోయిరి.

పద్మినీదేవి సౌందర్యమును గనినపుడే యంకురించి, దర్పణమున నామె నిజరూపమును గనులారఁ గాంచినపిదపఁ బ్రవృద్ధమై వడవడలాడఁ దొడంగిన యల్లాయుద్దీనుని మోహాలత దుస్సహపరాభవఝంఝామారుతపాతిచేఁ బడిపోయి నలివం బయిపోయినను, మగుడఁ

దలయెత్తి విజృంభింప సాగెను. అతని హృదయము మఱలఁ జెదరి పోయెను. కంఠములోఁ బ్రాణము లుండఁగా నెన్నటికైన నయముననో, భయముననో పద్మినీదేవినిఁ గూడితీరవలె నని యాతఁడు నిశ్చయించుకొనియెను. నిరాయాసముగఁ దన్ను వంచించి పాఱఁద్రోలిన చిత్తూరురాజపుత్రులను దగునట్లు శిక్షింపకున్నయెడలఁ వారెగాక తక్కిన భారతీయరాజు లెల్లరును జులకన సేయుదు రనియు, నట్లయినఁ దన ఢిల్లీరాజ్య మొక్కటే గాక, భరతవర్షమున మహమ్మదీయులు సైతము నిలుచుట యసంభవ మనియు నా హేతువుల వలన మఱలఁ జిత్తూరువారికి గర్వభంగము సేయవలయు ననియుఁ గూడ నిశ్చయించుకొనియెను. ఈ నిశ్చయమువలన నాతని క్రోధాగ్ని మఱల నిముసములో నెగసెను. వెంటనే చిత్తూరుమీఁదఁ జైత్ర ప్రస్థానమును బ్రకటించెను.

రాజపుత్రులు మహాసంగ్రామమున నల్లాయుద్దీను నిదివఱ కొకమాఱోడించినవారగుటంజేసి వాని రాక కదలలేరు. మనుష్యుఁడు, ధైర్యములోఁ బోరాడిన భయపడఁగూడ దనియు, దీనముగఁ బ్రార్థించిన దయదలఁపరా దనియు నిశ్చయించుకొని వారు యుద్ధమునకు సిద్ధపడిరి.

మఱల యుద్ధము ప్రారంభ మయ్యెను. పరాభవదుఃఖమువలన మహమ్మదీయులును, విజయగర్వమువలన రాజపుత్రులు, నెడలు మఱచి పోరసాగిరి. భేరీకాహళాదిగంభీరధ్వానములవలనను, వీరుల సింహనాదములవలనను, గజఘీంకారములవలనను, హయహేషలవలనను, శస్త్రాస్త్రయుధముల భయంకర ఢాంఢాంనినాదములవలనను, కఠోరకరముల రిఁగివన్య మను ధ్వానములవలనను, బడిపోయిన వీరభటుల మూల్గులవలనను బ్రహ్మాండము ప్రతిధ్వనింపసాగెను. ఇట్లే

యుద్ధము చాలఘోరముగ జరిగెను. కొన్ని దినములు రాజపుత్రులకును, గొన్ని దినములు మహమ్మదీయులకును బలుపాటము నూపెను. తుదకు రాజపుత్రుల కపాయశంక పుట్టెను. ఇఁక జయము గలుగుట దుర్లభమని వారు నిశ్చయించుకొనిరి.

అయినను సంగ్రామరంగమునుండి వెనుదిరిగిపోవుటకు వా రంగీకరింపలేదు. "పారిపోవుట మన కులధర్మమునకు విరుద్ధము. శత్రులం జంపుదము. లేకున్నఁ జత్తు" మని వారు నిశ్చయించుకొనిరి; ఈ నిశ్చయమువలన వారి శౌర్యాగ్ని మఱింత దుస్సహ మయ్యెను. గాని మహమ్మదీయు లందులకుఁ జలింప లేదు. "విజృంభింపుఁడు. మనకు జయము గలుగుట యథార్థము. చిత్తూరుదుర్గముపైఁ జంద్ర ధ్వజమును నిలుపుట కల్లా యాజ్ఞ యైనది. చిత్తూరుదుర్గములో నచ్చరలను దలఁదన్నఁగల స్త్రీలు వేలకొలఁదిగ నున్నారు. విజృంభింపుఁ" డను నల్లాయుద్దీనుని ప్రోత్సాహమువలన వారి శౌర్యము నుత్సాహశక్తియు నిబ్బడి కాసాగెను.

చిత్తూరుదుర్గమునందలి మహారథికులలోఁ జాలమంది గతించిరి. లక్ష్మణసింహుని పండ్రెండుగురు పుత్రులలోఁ బదునొకండ్రు వీరస్వర్గము నలంకరించిరి. అంత రాణా తన ద్వితీయపుత్రుఁ డగు నజయసింహునిఁ జేరఁబిలిచి "వంశ మంతరించిపోకుండ నీవు పోయి యారావళీపర్వతములలో వసియింపుము. అటనుండి నీవు చిత్తూరు దుర్గముకొఱకుఁ బ్రయత్నింపుము. నీ జీవితకాల మంతయు నాప్రయత్నమునందే గడుపుము. మేవాడు రాజ్యము నీకు స్వాధీన మైనను గాకున్నను దాని స్వామ్యమును, నీ యన్న కొమరుఁడును, న్యాయ్యము ననుసరించి నా తరువాత నీ రాజ్యమున కధీశ్వరుఁడు నగు హామీరున

కిచ్చివేయుం" డని యాజ్ఞాపించి వీలయినంత ధన మొసంగి పంపి వేసెను. పిదప స్త్రీలకు జవహరువ్రతమున కాజ్ఞయిచ్చి పురుషుల నిఁక యుద్ధరంగమునుండి తిరిగి రాఁగూడ దని గూడ శాసించెను.

క్షణములోఁ గోటయం దంతటను చితులు పేర్చఁబడియెను. రాజపత్నులు, రాజకన్యలు, రాజస్నుషలు, సర్దారుల భార్యలు, సైనికుల యిల్లాండ్రను మున్నగు కోటయందలి స్త్రీలెల్లరు నగ్నికార్య ప్రయత్నములయందుఁ బ్రవృత్తులైరి. కోటయందలి పురుషు లాబాలగోపాలమును బచ్చని వస్త్రములు గట్టుకొని యొడలినిండ రక్తగంధములందికొని, రక్తకుసుమమాలాలంకృతులై, ఖడ్గపాణులై యుద్ధరంగమున కుఱికిరి.

రాజపుత్రుల నాఁటి సమరవేషములం గాంచి యవను లాశ్చర్యపడిరి; గాని వెంటనే యవి యన్నియు దాంభికవేషము లని తలంచిరి. ఒక్క మా ఱుభయపక్షములవారును దుపాను సమయమునందలి మహాసాగరము వోలె నటునిటు నూఁగిపోయిరి. అదియే యుద్ధమున కంతిమప్రయత్న మయ్యెను. యవనభటతరంగములలోఁ బడి రాజపుత్రు లదృశ్యులై పోయిరి. వారి విజయధ్వజము కూలిపోయెను. తురుష్కులు విజయప్రమత్తులై పేర్చియార్చుచుఁ గోటపైకిఁ బరువు లెత్తిరి.

తమవారి జయాపజయములను దెలిసికొనుటకు బురుజులపై నెక్కి చూచుచున్న క్షత్రియస్త్రీలు వెంటనే చితులచెంతఁ గనిపెట్టుకొని యున్న రమణీమణులతో నిఁకఁ ద్వరపడవలె నని చెప్పివేసిరి. అంత నేతికుడ్డలతో నిండియున్న చితు లన్నిటికిని నిప్పు ముట్టింపఁబడియెను. క్షణములో నగ్ని హోత్రుఁడు నిజరూపమును దాల్చెను.

పద్మినీ ప్రముఖులగు స్త్రీ లెల్లరును సంతోషముతో నగ్నిహోత్రమున లీనమైపోయిరి.

తురుష్కులు కోటలోఁ బ్రవేశించిరి. ఘోరాగ్రము లగు చితుల యగ్నిజ్వాలలు వారికి స్వాగత మొసంగెను. అశ్వారోహణము గావించి యత్యుత్సాహముతో నచ్చటికి రెండంజలలో వచ్చి చేరిన యల్లాయుద్దీనుఁ డచ్చట జరిగిపోయిన వ్యాపార మంతయుఁ జూచి, హతాశుఁడై, నిలువున నీరై, మొదలు నఱికిన చెట్టువలెఁ గ్రిందఁ గూలఁ బడెను. కొంతతడ వాతఁడు మూర్ఛపోయెను. తెలివి వచ్చిన తరువాత నాతఁడు పద్మినికొఱ కెంతో వగచెను. పద్మిని చిచ్చులో నుఱికి తన హృదయమునఁ జిచ్చువెట్టె నని పరితాప పడెను. తుద కల్లాయుద్దీనుఁడు మాలవదేవుఁ డను నొక రాజపుత్రునిఁ జిత్తూరుదుర్గమునకుఁ బాలకునిగా నేర్పఱచి ఢిల్లీకిఁ బోయెను.

ఇంతటితో నీ యాఖ్యానము ముగిసినది.

భీమసింహుఁడు, లక్ష్మణసింహుఁడు మున్నగు వారు దేహబలమునఁ గొంతవఱకు మనోబలమును గూడఁ గలవా రని యొప్పుకొనక తప్పదు. వారికిఁ గొఱవడినది బుద్ధిబలము. వెఱ్ఱియభిమానము దానిని దగ్గఱకే చేరనిచ్చినది గాదు. అది లేనందులకుఁ గలుగు ఫలమును వారు పూర్తిగ ననుభవించిరి.

అల్లాయుద్దీనునకుఁ బద్మినీదేవి ప్రతిబింబమును నిలువుటద్దమునఁ జూపినపుడు మానమో యని కొట్టుకొను వీరిమానమును, బద్మినీదేవిని సాగనంపి క్షత్రియ స్త్రీలు తిరిగి కోటలోనికిఁ బోవుచున్నారనిన పల్లకులలో నొకదానిలోఁ గూర్చుండి భీమసింహుఁడు కోట

లోనికిఁ బోయి ప్రాణము దక్కించుకొనినపుడు పౌరుషమో యని ప్రాకులాడు వీరి పౌరుషమును, పద్మినీదేవియు, నామెను సాగనంపుట కేడువందల పల్లకీలలో క్షత్రియస్త్రీలును వచ్చుచున్నా రని ప్రకటించి, దొంగవేషములతో వీరభటుల నంపినపుడు ధర్మమో యని దొర్లాడు వీరి ధర్మమును, సమూలముగ నాశమైపోయినవి. పద్మినీదేవినిఁ దీసికొనిపోవుటకు వచ్చిన యల్లాయుద్దీనుని నామె భర్త యగు భీమసింహుని చేతనే సాగనంపించినపుడు వారి సిగ్గులేని తనమును, జయ మింకఁ గలలోని ముచ్చట యని తోఁచినపుడు స్త్రీలకు జహార్వ్రతమున కాజ్ఞ యిచ్చి తా మందఱును యుద్ధములోఁ జచ్చినపుడు వీరి చేతగానితనమును, "పద్మిని నొకమాఱు చూపినను జాలు నని తురుష్కుఁడు ఘోర దీర్ఘాలోచనము చేసిచేసి తుదకు వల్లె యని యంగీకరించినపుడు వీరి పిఱికితనమునుఁ బూర్తిగఁ బట్ట బయలైనవి. వంశము నిలుచుటకై యొక్క యజయసింహుని మాత్రమే కోటదాఁటించి పంపివేసి యందఱును గుమిగూడి చచ్చుట వలనఁ బగసాధించుటలో వీరికిఁ గల పట్టుదల గూడఁ దేటతెల్ల మైనది. ఇఁక నొంటరిగఁ గోటలోనికి వచ్చిన యల్లాయుద్దీనునిఁ బూలలోఁ బెట్టినట్లు చాల గౌరవముతోఁ బంపివైచిన వీరి రాజనీతి ధురంధర్యమును వేఱుగఁ గొనియాడ నక్కఱ లేదు. అట్టి వీరినిఁ జరిత్రకారులు కొంద "అత్యుచ్చనీతితత్త్వమును పాటించిన వా"రని పొగడిపొగడి విడిచిపెట్టినారు. ఏమి నీతిరా?

ఇఁక మే మిపుడు చెప్పఁబోవునది యే మనఁగా? భీమసింహాదులు వట్టిశూరులును, వట్టిపరాక్రమవంతులును గాని నిర్మల-

శూరులును, నిర్దుష్టపరాక్రమవంతులు గారు; కావుననే వారి కట్టి గతి ప్రాప్తించినది. ప్రాస్యదృష్టికి వారి సంఘమరణము వీరమరణముగనే తోఁపవచ్చును; గాని రాజనీతిజ్ఞుల కంత యుత్కృష్టమరణముగాఁ గాన్పింపదు.

---

శ్రీరస్తు

# వీర పూజ



## ప్రథమ భాగము

---

### హమ్మీరసింహుఁడు

రాణేంద్రి యగు లక్ష్మణసింహుని యానతి చొప్పున నజయసింహుఁ డారావలీ పర్వతమునందలి కేల్వా డను స్థలమునకుఁ బోయి యచ్చట నివసించి యుండెను. అతని కుమారు లిరువురు, నన్న యగు నూరుసింహుని కొడుకు హమ్మీరుఁడును గూడ నాతని యొద్దనే యుండిరి. అల్లా యుద్దీనుఁడు చిత్తూరుపై నెత్తివచ్చి భగభగమండు చితులతో నిండి భయానకమై యున్న కోటను స్వాధీనము చేసికొనిన యపుడు హమ్మీరుఁడు తన తాతగారి యింటఁ బెరుగుచుండెను. అక్కటా తన నాతని కా యుద్ధమునఁ బ్రసక్తి గలిగినది గాదు.

నానూఁగు మీసములతోడను, సుదృఢబాహుదండములతోడను, విశాలఫాలతలములతోడను, గభీరనయనయుగ్మములతోడను, విజయలక్ష్మి సింహాపీఠము లన నొప్పు వక్షస్స్థలములతోడను వీరరసాపరావతారములో యనఁ దేజరిల్లు తన కుమారులను, హమీరునిఁ

జూచి యజయసింహుఁడు వేఁడి నిట్టూర్పులు విడువని క్షణములేదు. విశాలసామ్రాజ్యపాలనాసమర్థ మగు వివేకమును, యోధసహస్రముల నవలీలజయింపఁగల బాహుబలమును, వెదురుధాన్యము మున్నగు క్షుద్రాహారపదార్థములను సేకరించుకొనుటకును, వ్యాఘ్రాదిహింస్రపశువుల బాఱిఁ బడకుండఁ దమ్ము దాము కాపాడుకొనుటకు నే భగవంతుఁడు వీరికిఁ బ్రసాదించెఁ గాఁబోలు నని వగవని దినము లేదు.

ఈ విచారమువలనఁ బూర్వస్మృతియు, దానివలన నుత్కట విషాదము, నితరేతర ప్రవర్తకములై యాతని కుక్కిరిబిక్కిరి గలిగించుచుండెను. ఈ దుర్భరస్థితివలన నుత్సాహశక్తియు, మంత్రశక్తియు నశించిపోయెను. ఇఁక నే మున్నది? ప్రకాశవంతమై మహోన్నతము కాఁదగిన యా క్షత్రియవీరుని జీవితము గాఢాంధకారబంధురమై యధఃపతితంబై పోయెను. కష్టము వెంట సుఖమును, సుఖము వెంటఁ గష్టమును గలుగుట ప్రకృతిధర్మము. కష్టము వచ్చినప్పుడు క్రుంగిపోవుటయు, సుఖము వచ్చినపుడు పొంగిపోవుటయు వీరధర్మముగాదు; గాని యేలకో యీతని జీవిత మట్టిదై పోయినది.

ఆతని కుమారులకును, హమ్మీరునకును మాత్ర మిట్టి గతి సంభవింపలేదు. నూనూఁగు మీసములకు నైల్య మొదవిన కొలందిని, జాడ్కలయందును హృదయముల యందును గాంభీర్యము పొడసూపిన కొలందిని, ననవరతశింజినీసమాకర్షణమువలన సుకుమారబాహుదండములు కిణాంకితము లైనకొలందిని, వారికి నవశక్తియు, నవ్యభావములును బ్రభవించి దినదినప్రవర్ధమానములు కాఁజొచ్చెను. క్రమక్రమముగ వారికి శత్రుసంహారేచ్ఛయు, రాజ్యతృష్ణయుఁ గూడఁ గలిగెను. ఆ చిత్తూరే రాజధానిగఁ జేసికొని యా మేవాడు రాజ్యము నే

పరిపాలింపఁగలయూ నను దృఢదీక్ష గూడఁ గలిగెను. అంతటితో వారిజీవితనాటకమునఁ బ్రథమాంకము ముగిసి ద్వితీయాంకము ప్రారంభ మయ్యెను.

అప్పటినుండియూ వా రజయసింహుని, మేవాడు రాజ్యమును గుఱించియుఁ జిత్తూరుదుర్గమునుగుఱించియు, యుద్ధవిధానముల గుఱించియుఁ, దమ పూర్వుల శక్తిసామర్థ్యములను గుఱించియు, శత్రువుల బలాబలములనుగుఱించియు, వారి రాజనీతిపద్ధతులను గుఱించియుఁ దీవ్రముగఁ బ్రశ్నించుచుఁ దమలోఁ దాము చర్చించుకొనఁ బ్రారంభించిరి. దానిచే నజయసింహుని జీవితమున నంతలో నూతన మగు మార్పు గలిగెను. దుర్భరవిషాదమువలన వాడిపోయి రూపు మాయుట కున్ముఖములై యున్న రాజ్యప్రత్యాశాలతలు మఱలఁ బల్లవితములుం గాఁజొచ్చెను. తేజోవిహీన మైన యాతని ముఖమున నవలావణ్య మంకిత మయ్యెను. తండ్రి నారసి కుమారులును గుమారులను జూచి తండ్రియు మఱింత ధైర్యవంతు లగుచుండిరి. ఇది యంతయుఁ జూచుచున్న యజయసింహుని రాణి మఱలఁ దొంటి యౌన్నత్యము వచ్చితీఱు నను నమ్మకముతోఁ దన ముఖమండలమునఁ దాండవము సలుపుటకు దరహాసలక్ష్మి నాహ్వానము సేయ సాగెను. అదిచూచి యజయసింహుఁడు మేవాడురాజ్యలక్ష్మి తనపై నపాంగ నిరీక్షణములం బఱపుచున్న దని యానందింపజొచ్చెను.

తినుటకుఁ దిండియుఁ గట్టుటకు గుడ్డయు,నిలుచుటకు నీడయు లేని వానికి రాజ్యకాంక్ష గలిగినది. కత్తి చేఁబట్టి పోరాడుట కొక్క ఘటుకైన లేనివానికిఁ బ్రబలుం డగు వైరితోఁ బోర నిచ్ఛ గలిగి నది. వినాలో వెరికైన నిది పరిహాసపాత్రముగఁ దోఁచుచున్నదియాక

మేము దీనిని గుఱించి యేమియుఁ జెప్పఁ జాలము. తన వాంఛలను నెఱవేర్చుకొనుట కింక నజయసింహున కాంతరంగికము లగు నాధారము లేమి యున్నవో, యాతని భావయంత్ర మెట్లు పనిచేయుచున్నదో, తెలియదు. ఆతని యూహ లెట్లు పరిణమింపఁగలవో, ప్రయత్నము లెట్లు ఫలింపఁగలవో యూహించుట కైలిగాదు. అయిన నతఁడు రాజ్యతృష్ణ యధిక మైనకొలందిని రాజ్యసంపాదనమును గుఱించి యనేకోపాయములను బన్నసాగెను. ఆతని పుత్రులుం గూడ నా పనిమీఁదనే యుండిరి.

కాల మిట్లాలోచనలతోఁ గడచిపోవుచుండ నాతని కొక భిల్లునితో విరోధము సంభవించెను అది మాటలతోఁ దీరినది గాదు. కత్తులు కలుపవలసివచ్చెను. ఆటవికుం డగుటం జేసి భిల్లుఁ డందులకు జంక లేదు. క్షత్రియునకు మాత్రము జంకెక్కడ? వెంటనే ద్వంద్వయుద్ధము పొసఁగెను. హమీరుని ఖడ్గాఘాతమువలన భిల్లుని శిరము బంతివలె నెగిరిపోయెను. తోడనే హమీరుఁ డా శిరస్సును గొని వచ్చి పినతండ్రి పదనికటమున నుంచెను.

అది చూచి యజయసింహుఁడు, హమీరుని శౌర్యప్రతాపములను, దనయందలి భక్తినిఁ జాల మెచ్చుకొనియెను. ఈ సందర్భమున నజయసింహునకు వీరస్వర్గప్రయాణోన్ముఖుం డై జనకుఁ డగు లక్ష్మణసింహుఁడు చెప్పిన మాటలు జ్ఞప్తికి వచ్చెను. అప్పు డాతని హృదయకుహరమున "హమీరుఁడే మేవాడురాజ్యేశ్వరుఁ" డను మాట గంభీరముగఁ బ్రతిధ్వనించెను. వెంటనే యా హృదయము చేయి పెట్టి కలఁచినట్లు కలంగిపోయెను. వివిధము లగు ననేకభావము లుదయించి యాకల్లోలమున నొకదానిపై నొకటి పడి చిందఱవందఱలై

యాడుగంట మునిఁగిపోయెను. అంత నజయసింహుఁ డాఖిల్జుని శిరస్సు నుండి స్రవించు రక్తముతో హామీరునకు బొట్టువెట్టి "నీ జనకుఁడు నా కగ్రజుం డగుటంజేసియు, విశేషించి నా తండ్రి విధించుటం జేసియు, నీ సంతోషసహాయమున నీకు మేవాడరాజ్యాధిపత్యము నొసంగుచున్నాఁడను. అవశ్యంబుగ నీ వా రాజ్యమును జయించి కొని పెద్దకాలము కుశలయూహ్లోదకగంబుగఁ బరిపాలింతువుగాత"మని యాశీర్వదించెను. అతని కుమారు లిరువురును గూడ నందుల కంగీక రించిరి. ఇది జరిగిన కొలఁదిదినముల కజయసింహుని రెండవకుమా రుఁడు పరలోకగతుం డయ్యెను. జ్యేష్ఠపుత్రుం డగు సజ్జనసింహుఁ డిప్పుడైన మేవాడరాజ్యాధిపత్యముకొంకె హామీరునితోఁ బోరాడు నేమో యని తలంచి యాతఁడు "నీవు మేవాడ రాజ్యమును విడిచి యుండేనిఁ బో"మ్మని పెద్దకొడుకున కాజ్ఞాపించెను. సార్థకనాముఁ డగు సజ్జనసింహుఁడు పితృవచనమును వేదవాక్యముగా భావించి, వంశభూషణుండ వగు మని హామీరుని దీవించి, తలిదండ్రుల కెఱఁగి దక్షిణమునందలి మహారాష్ట్రదేశమునకు సంతోషముతో వెడలి పోయెను.

హామీరున కిట్లు మేవాడ రాజ్యాధిపత్యము చేకూరెను. కాని దానివలన నేమి ప్రయోజనము? పాలించుటకు రాజ్యమెక్కడ? తురుష్కుల యధీనమునం దున్న మేవాడ రాజ్యమున కజయసింహుఁడు హామీరునిఁ బ్రభువుగాఁ జేయుట యేమి సందర్భముగ నున్నది? ఇవి యన్నియుఁ జూచిన మా పాఠకమహాశయులు వింత పడక మానరు; కాని హామీరుఁ డెంతో యానందించెను. తన యొడలఁ జూపిన నెనరున కాతఁడు పినతండ్రి కనేక ధన్యవాదములను

సమర్పించెను. వెంటనే యాతఁడు మేవాడు రాజ్యసంపాదనమునకుఁ దగు ప్రయత్నములను బ్రారంభించెను.

లోకములో రాజ్యసంపాదన మైన తరువాత నాధిపత్యము సిద్ధించుచున్నది; గాని యాధిపత్యము సిద్ధించినతరువాత రాజ్యలాభము గలుగుచున్నట్లు వినము. ఈ వృత్తాంత మంతయు లోకాచారము నకు విపరీతముగ నున్నది. తండ్రి యభిప్రాయము నజయసింహుఁ డెంతవఱకర్థము చేసికొనెనో, యట్లు చేయుటలో నాతని యభి ప్రాయ మేమో, హమీరుఁడు రాజకుమారుఁడ నగు నేను రాజ నెట్లు కాకపోదు నని తలంచెనో, యదేమో చెప్పఁజాలము. మేవాడు రాజ్యేశ్వరుఁ డన్న హమీరుని బిరుదము సార్థకమైనదో, నామ మాత్రమైనదో చరిత్రలవలన మనము తెలిసికొందము.

ఇది జరిగిన కొలఁదిదినముల కజయసింహుఁ డీహలోకమును విడచిపోయెను. కన్న కొడుకుల కంటెఁ దన్నెక్కుడు ప్రేమతోఁ జూచిన యజయసింహుని మరణమునకు హమీరసింహుఁ డెంతో విచారించెను; గాని విచారించి యేమి సేయఁగలఁడు? హమీరు నీ కష్టసమయములో "నన్నో్యా! నీ కిట్టి దిక్కు తటస్థించినదా?" యని యూరడించుట కెవ్వఁడును లేఁడు. "ఏమైనను నీకు భయము లేదు. నీవు క్షత్రియవీరుఁడ" వని ధైర్యము చెప్పువా రంతకుముస్నే లేరు. పాపము మేవాడు రాజ్యాధీశ్వరుఁ డగు హమీరుఁ డిట్లు దిక్కులేక యారావళీపర్వతారణ్య వాటికలయందు సంచరింపవలసిన వాఁడై పోయెను.

లోకములో మానవుల కింతకంటె శోచనీయ మగు నవస్థ వేఱొకటి లేదు. తినుటకుఁ దిండి లేకపోయినను "నా" యన్నవాఁ

డొకఁ డుండినచో హృదయ వేదన కొంత యుపశాంతి కలుగ వచ్చును. అట్టి వారు లేకున్న వానికంటె దైవోపహతుఁడు వేఱొకఁ డుండఁబోఁడు. ఇప్పుడు హమీరుఁ డట్టివాఁ డై పోయెను. అయిన నాతఁ డిందుల కేమియు సంచలింపలేదు. అతని హృదయ మీ విషయమునే గమనింపలేదు. అప్పు డాతనిమనస్సు వేఱు విషయమున లీనమై యుండెను.

ఆ విషయ మేది? శత్రుసంహారము. మఱియు, రాజ్యసంపాదనము. వీని విషయమై యాతఁడు తీవ్రాలోచనము ప్రారంభించెను. రాజ్యసంపాదనమునకీ దిక్కులేనివానికే రాజైన సాయము సేయ వచ్చునా? అది వట్టి భ్రాంతి. అసంభవము. అట్లగుట నాతఁడు పర రాజుల నాశ్రయింపవలె ననుయూహ పొడమిన వెంటనే దానిని హృదయక్షేత్రమునుండి తొలఁగించివైచెను. "స్వయముగనే ప్రయత్నింపవలెను ఇతరులకు ఫలానుభోగము లేని కార్య మితరుల తోడ్పాటువలన నెఱవేఱఁ జాల"దని యాతఁడు నిశ్చయించుకొనియెను.

ఇట్లు నిర్ధారణము గావించుకొని వెంటనే యాతఁడు విల్లు నమ్ములు ధరించి యోధజీవనము గావించు నాటవికులను సైనికులుగాఁ జేర్చుకొనసాగెను. అచ్చటి భిల్లు లెల్లరు నా వీరాగ్రేసరుని నాయకత్వము నంగీకరించిరి. క్రమముగఁ గొలఁదిదినములలో నైదువేల భిల్లు లాతని నీడఁ జేరిరి. ఇఁక శత్రుసంహారమునకుఁ బ్రారంభము సేయ వచ్చునని యాతఁడు నిశ్చయించుకొనియెను.

ఈనిశ్చయము ననుసరించి పనిఁ బ్రారంభింపఁబోవునపు డాతనికి మఱల నీ విషయమున నపజయశంక పొడమెను. ధనలోపము వలన నానాబాధల ననుభవించు నిర్బలమునఁ దుపాకి ఫిరంగి

మున్నగు దీక్షాయుధములు లేని కేవలధానుష్కులగు నీ యైదువేల భిల్లుల సాయంబువలన బలాధికుఁడై యున్న శత్రువు లొంగుట కల లోని వార్త యని యాతనికిఁ దోఁచెను. అక్కతన వాఁడు దిల్లీరా జ్యమునఁ బ్రవేశించి యసంఖ్యధనము సంపాదించెను. ఆతఁ డా ధన మంతయు నారావళీపర్వతారణ్యవాటికలయందలి కేల్వా డను స్థలమునకుఁ జేర్చి, యంతకంతకుఁ బౌఁజు వృద్ధిచేసికొని క్రమక్రమ ముగఁ బట్టణములను దుర్గములను గూడ ముట్టడించుచుఁ దుదకుఁ జిత్తూరుదుర్గము దక్కఁ దక్కిన మేవాడురాజ్య మంతయు వశపఱు చుకొనియెను.

ఆతఁ డా స్థితికి వచ్చునప్పటికి గుఱ్ఱములు, ఏనుఁగులు, రథ ములు, తుపాకులు, ఫిరంగీలు మున్నగు రణపరికరములను గల బ్రహ్మాం డసైన్యము సమకూరెను. రాజపుత్రస్థానమునందలి భారతీయరాజన్యు లందఱితోడను బరిచయమును, గొందిగనో గొప్పగనో స్నేహము నొనఁగూడెను. మంత్రి ప్రధాని సచివుఁడు నమాత్యుఁడు మున్నగు ప్రకృతివర్గము గూడ నేర్పడెను. ఇట్లు దిక్కులేని హమీరుఁడు రాజయ్యెను. దీని కంతకును గారణ మాత్మగౌరవపౌరుషములో, యజయసింహుఁ డాతనికిఁ బట్టాభిషేకము గావించినప్పటి ముహూ ర్తపుఁ బ్రభావమో మేము చెప్పఁ జాలము.

అల్లాయుద్దీనుఁడు చిత్తూరుదుర్గమున మాలవదేవుఁ డను రాజ పుత్రునిఁ బ్రతినిధిగా నేర్పఱుచుట మా పాఠకులకు విదితము. ఇప్పుడు గూడ నాతఁడే చిత్తూరుదుర్గమున కీశ్వరుఁడై యుండెను; గాని దిల్లీశ్వరుఁడు మాత్రము మాఱిపోయెను. హమీరుఁడు మేవాడు రాజైన యీ సమయమున మహమూద్ ఖిల్జీయను వాఁడు దిల్లీశ్వరుఁడై

యుండెను. మేవాడు రాజ్యము నంతను స్వాధీనముచేసికొనుచున్న హామీరుని మాలవదేవుఁడు చాలఁ బడదన ఎదిరించెను; గాని ప్రయోజనము లేకపోయెను. తుద కెట్లో మాలవదేవుఁడు తన కొమార్తెను హామీరున కిచ్చి పెండ్లిచేయుట తటస్థించెను.

తన యజమానుని రాజ్యమును గొల్లగొట్టి హరించుచుఁ దన విరోధియైన హామీరునకు మాలవదేవుఁడు తన కొమార్తె నిచ్చుట కెట్లంగీకరించెనో, తురుష్కులకు దాసులైన వారి సేవగింపకొను హామీరుఁడు, తురుష్కుని సేవకుఁడను, దన సైన్యక మగు సింహాసనము నధిష్ఠించి తన్నేకపర్యాయము లెదిరించినవాఁడు నగు మాలవదేవుని కన్యను వివాహ మగుట కెట్లంగీకరించెనో తెలిసికొనుటకుఁ జారిత్రికము లగు నాధారము లేమియు లేవు. ఈ వివాహవార్త ఢిల్లీశ్వరునకుఁ దెలిసెనో లేదో, తెలిసిన నాతఁడు దీని కెట్లు సమ్మతించెనో గూడఁ దెలిసికొనఁజాలము.

ఈ వివాహసందర్భమున నింక నొక విశేషముగూడఁ గలదు. హామీరునకుఁ బెండ్లిచేయఁబడిన కన్య బాలవిధవ. కాని యీవిషయమును గప్పిపుచ్చి మాలవదేవుఁ డీ పెండ్లి గావించెను. దీనివలన మాలవదేవునకు హామీరునిఁ బరాభవింప నుద్దేశ మున్నట్లు తోఁచుచున్నది. ఢిల్లీశ్వరుఁ డీ వివాహమున కేమియు నాక్షేపణములు చెప్పకపోవుటకుఁ గూడ నిదియే హేతువై యుండవచ్చును. ఏది యెట్లయిన నీ రహస్యము మాత్రము దాఁగినది గాదు. హామీరున కంతయుఁ దెలిసిపోయెను. కాని యాతఁ డందుల కేమియు ననలేదు. మామగారి నేమియు దూషింపలేదు. భార్య నించుకయుఁ దూలనాడలేదు. ఏరి మీఁదను గోపము చూపలేదు. భార్య నాతఁ డెంతో ప్రేమించెను.

ఆ దంపతులు సీతారాములవలె నితరేతరానురక్తులై మెలఁగసాగిరి. హామీరుని మిత్రు లగు రాజపుత్రులు గూడ నీ వివాహమును గురించి యాక్షేపణలు చేసినట్లు కాన్పింపదు.

హామీరుఁడు, బాలవిధవ యని తెలిసియుఁ దన కూఁతు నధికానురాగముతోఁ జూచుచుండుటవలననో, హామీరునిఁ బరాభవింపవలయు నను నభిప్రాయమే లేకపోవుటవలననో, హామీరుఁడు మహాపురుషుఁ డని తెలిసికొనుటవలననో, మాలవదేవుఁడు హామీరునిఁ జాల గౌరవముతోఁ జూడసాగెను. తనకుఁ బిల్లనిచ్చిన మామగా రగుటం బూజ్యుఁ డనియే తలంచెనో, తన సైన్యాక మగు సింహాసనము నెక్కియుండె నను కోపమునే విడనాడెనో, చిత్తూరుదుర్గము నెడల నాశయే వదలుకొనెనో గాని హామీరుఁడు గూడ మాలవదేవు నెడలఁ జాల గౌరవముఁ జూపసాగెను.

కాల మిట్లు కడచిపోవుచుండఁగా మాలవదేవుఁ డొక సమయమున దారపుత్రులతోఁ బెద్ద సైన్యమును గూర్చుకొని ఢిల్లీశ్వరుని యాజ్ఞచొప్పున నెచ్చటికో యుద్ధము సేయఁబోవుట తటస్థించెను. అప్పుడు చిత్తూరుదుర్గము మీఁదఁ దత్రక్షణార్థము కొలదిసైనికులతో హామీరుఁడు నాతని భార్యయు నుండి రని చరిత్రలు చెప్పుచున్నవి. ఈ సమాచార మెంతో వింతగా నున్నది. దీనికిఁ జరిత్రకారుల కట్టి యాధారము లున్నవో తెలియదు. అట్టి యెడల హామీరుఁడు చాల యుక్తిపరుఁడు గావున భార్యకు నామె తండ్రిపైఁ బ్రబలవిరోధమును గలిగించి సైనికులను లోపుచేసికొని స్వస్థలము సంపలి తన సైన్యమును గొంత రప్పించికొని చిత్తూరుదుర్గము నాక్రమించితి నని మిత్రుల కెల్లరకును తెలియఁజేసెను.

చిత్తూరు దురుష్కుని యధీనమున నుండుటవలన రాజపుత్రులకుఁ జాల నిబ్బందిగా నుండెను. వారందఱును రాజపుత్రస్థానమునఁ దురుష్కుఁడు ప్రవేశించి వీరినిఁ దఱుము పెట్టునని యాలోచించుచుండిరి. అట్టివారగుటంజేసి హామీరుని సందేశమునకు వారెంతో యానందించిరి. ఇఁకఁ దురుష్కుని పీడ వదలుచుట విలాసమాత్ర మని భావించి వారందఱును "కలసినప్పుడు మా మా సైన్యములతో నీకు సాయము గా సిద్ధముగ నున్నా" మని హామీరునకుఁ బ్రత్యుత్తరము లంపిరి. అది చూచి యాతఁడు పదివేల యేనుఁగుల బలము వచ్చినట్లు సంతోషించెను.

ఇంతలో మాలవదేవుఁడు తా నరిగిన పని ముగించుకొని వెనుకకు మఱలి చిత్తూరుదుర్గమును సమీపించెను; గాని హామీరుని వీరభటులవలన నిరోధింపఁబడెను. అది చూచి మాలవదేవుఁడు నిర్విణ్ణుఁడై యంతలో నంతయుఁ దెలిసికొని, మఱియొక యుద్ధసందర్భమున హతశేషు లగు తన స్వల్పసైనికులతోఁ జిత్తూరుసైన్యమును దాఁకెను. కాని ప్రయోజనము లేకపోయెను. ఆ స్వల్పసైన్యము గూడ రూపుమాసెను. మాలవదేవుఁ డఱచేతఁ బ్రాణములు పెట్టుకొని దిల్లీకిఁ బోయెను.

అట దిల్లీశ్వరునితో నాతఁ డేమిచెప్పెనో తన కేమియు నపాయము రాకుండునట్లు చేసికొనియెను. వెంటనే మహామూదుఖిల్జీ యనంతసైన్యోపేతుఁడై చిత్తూరుదుర్గమును ముట్టడింప బయల్వెడలెను. ఈ సంగతి దెలిసికొని హామీరుని స్నేహితు లందఱును దమతమ సైన్యములతో వచ్చి చిత్తూరు చేరికొనిరి.

యుక్తసమయమున నిరుతెగలవారికిని జంబళానదీతీరమున సింగోలీ యను జనపదము దగ్గఱ సంకులసమరము ప్రారంభ

మయ్యెను. "మేము తురకబిడ్డలము. మమ్మెవరులం జెనకఁ గలరా" యని ఢిల్లీ సైనికులును, "మేము క్షత్రియవీరులము. ప్రపంచమున మా కెదురు గలదా? యని చిత్తూరు యోధులును జాలఁ బట్టుదలతోఁ బోరిరి. తుదకు మహమూద్ ఖిల్జీ క్షత్రియులచేఁ జెఱ పెట్టఁబడెను. హతశేషు లగు తురుష్కులు పాఱిపోయిరి.

చేఁజిక్కిన ఖిల్జీని వెంటఁబెట్టుకొని మిత్రులం గూడి హమ్మీరుఁడు జయజయధ్వనులతోఁ జిత్తూరుదుర్గము ప్రవేశించెను. పౌరు లెల్లరును యోధులకు స్వాగత మొసంగిరి. రాజాంతఃపురమున కరిగి నపుడు రాణి స్వయముగ మంగళహారతి నొసఁగి యాతనిని ధన్యునిఁ జేసెను.

పిదపఁ జిత్తూరుదుర్గమునఁ దన పూర్వు లెల్లరును సభదీర్చిన భవనమునందే కొలువుదీరి మిత్రుల నెల్లరను గౌరవించి సైనికుల కర్హబహుమానముల నొసంగి హమ్మీరుఁడు దేవేంద్రునివలె విరాజిల్లెను. రాజపుత్రస్థానమునందలి స్త్రీపురుషులు బాలగోపాలమును హమ్మీరుని దీవించిరి.

ఈ యుద్ధమున మాలదేవుఁ డేమైనదియుఁ దెలియదు. కాని యాతని పెద్దకొడుకు రణవీరుఁడు సంగ్రామరంగమునుండి తిన్నగ వీరస్వర్గమునకుం బోయెను. రెండవ కొడుకు వనవీరుఁడు హమ్మీరునిచే బద్ధుం డయ్యెను. హమ్మీరుఁడు వానిని గొలువుకూటమునకు రప్పించి బంధముక్తునిఁ గావించి "నీకును నాకును గల బంధుత్వము సంగతి యట్లుండ, మన మిరువురము నొక జాతికి, నొక మతమునకు జెంది యున్నాము. నీవు నీ స్వజాతియెడల గౌరవము గలిగి ప్రవర్తింపు" మని బుద్ధి చెప్పి యొక జాగీ రొసంగి పంపివేసెను.

మూఁడు నెలలు గడచిన తరువాత హామీరుఁడు ఖిల్జీని గుఱించి విచారణ ప్రారంభించెను. ఈ మూఁడుమాసములు శత్రురుఁడు చిత్తూరుదుర్గమునందే బద్ధుఁడై యుండెను. తుదకు, ఖిల్జీ హామీరున "కజమీరు, రణథంభోరు, నాగోరు, సుయీసోపూరు" అను ప్రాంతములును నేఁబదిలక్షల రూపాయలును, నూఱేనుఁగులును సమర్పించి "యిఁక ముందెన్నఁడును నేను మేవాడురాజ్యము మీఁదికేఁ గాని, యితర రాజపుత్రుల రాజ్యములమీఁదికేఁ గాని దండెత్తి రాఁగలవాఁడను గాను. ఇతరు లెవరైన దండెత్తివచ్చినయెడల నేను మీకు సాహాయ్యము సేయఁగల వాఁడ"నని చెప్పి యొప్పించుకొని బంధవిముక్తుఁడై ఢిల్లీ చేరికొనియెను.

రాజపుత్రస్థానమునందలి వా రెల్లరును హామీరసింహుని దివ్యపురుషునిగా భావించి గౌరవింపసాగిరి. మఱియు "నబూ, బుందీ, గ్వాలేరు, చందేరీ, రాయసహాను, సిక్రీ, కార్పే, జయపురము, జోదపురము సంస్థానాధీశ్వరులు సంతోషముతో నాతనికి సామంతులై కొలువసాగిరి. ఈ రూపమున రాజపుత్రస్థానమున నైకమత్యము మఱలఁ దలయెత్తసాగెను.

మహామ్మదీయు లీ దేశమునకు వచ్చుటకుఁ బూర్వము మేవాడు రాజ్యము చాల వైశాల్యము కలదియై యుండెను; గాని యది పిదపఁ గాఁ క్రమముగను, నంతకుఁ బూర్వపు రాజుల రాజకీయ విషయములయందలి యౌదాసీన్యము వలనను, చాలవఱకుఁ దగ్గిపోయెను. హామీరుఁడు సమధిక మగు పట్టుదలతోఁ బ్రయత్నించి మేవాడు రాజ్యమునకుఁ బూర్వవైశాల్యము గలిగించెను. అపారధన రాసులను సంపాదించి దివ్యమందిరము లనేకములు గట్టించి, యంత

వలకుఁ దన ప్రజలు తురుష్కులచే ననుభవించిన బాధలు మఱచి పోవుటకును, దారిద్ర్యసాగరమునుండి యుత్తీర్ణు లగుటకును దగు సౌకర్యములు చేకూర్చి బలిగా యనునట్లు పెద్దకాలము ప్రజాపాలనము గావించి, విపులైశ్వర్యమును విశాలరాజ్యమును దనయుఁడగు క్షేత్రసింహునకుఁ బట్టముగట్టి యా మహారాజు భౌతిక శరీరమును విడిచి స్వర్గమునకుఁ బోయెను.

ఈ హామీరసింహుని జీవితమును శ్రద్ధతోఁ బరిశీలించిన వారి కితని యభివృద్ధి యంతయు నిరవధిక మగు పురుషకారము వలననే కలిగిన దని తెలిసికొనియే యుందురు. ఖిల్జీ మొదలను, మఱియొకటి రెండువిషయములయందు నీతఁడు తన పూర్వుల నీతినే యవలంబించెను; గాని మొత్తము మీఁద నీతఁడు రాజకీయములయందుఁ జాల మెలఁకువతోడనే ప్రవర్తించెనని చెప్పవచ్చును. ఇఁక నీతని జీవితమునందలి విశేష మేమన?

తనకుఁ బెండ్లిసేయఁబడిన కన్య బాలవిధవ యని తెలిసికొనియు నీతఁ డామె సౌందర్యమును జూచియు, సద్గుణములను జూచియు నామెను జాల ననురాగముతోఁ జూచెను. వివాహకాలమున మాలవదేవుఁడు తన కూఁతురు బాలవితంతువని తెలియనీయక రహస్యముగ నుంచుటవలన నా కాలమున వితంతువివాహాచార మున్న దని సందేహించుట కవకాశము గాన్పించుటలేదు. అయినను హామీరుఁ డిది యనాచార మని జంకలేదు. రాజపుత్రు లెవ్వరును దాని కేమియు నాక్షేపములు చేసినట్లు తోఁపదు. పయింబయిగ వారెల్లరు నాతనిని జాల గౌరవించిరి. సాంఘికనియమములకు వ్యతిరేకముగ నడచిన హామీరునిఁ గేవల రాజకీయ సంబంధముల వలన వారు గౌరవించి

రని చెప్పుటకు వలనుపడదు. రాజా రెల్లరు నాతని వివాహము నా క్షేపింపక పోవుట యా కాలమున వితంతువివాహాచార మాచరణ ములో నున్న దని వాదించు వారి కొకింత యాధారముగా నుండ వచ్చును; గాని యంతమాత్రమున నా కాలపు సాంఘిక నియమము లను నిర్ధారింప నైతి గాదు.

---

శ్రీరస్తు

# వీరపూజ

## ప్రథమ భాగము

### సంగరాణా

రాయమల్లుఁ డనన్య సామాన్యపరాక్రమశాలి. ప్రజాహిత చింతకుఁడు: మహేంద్రవైభవము ననుభవించిన రసికశేఖరుఁడు. ఈతఁడు తన ప్రతాపమున కుదాహరణముగ బహిలో లనుఢిల్లీ పాదుషా నొకమాఱును, మాళవదేశపు సులతానగు ఘియాసుద్దీన్ ఖిల్జీ యను వాని నింకొకసారియు జర్జరితాంగులం జేసి పాఱఁద్రోలెను. తమ యెడ నధికానురాగమును జూపుచుండుటవలనఁ బ్రజ లీతనిని దేవుఁడని పూజించుచుండిరి. రాజపుత్రస్థానమునం దంతటను రాయమల్లుఁడనఁ జాల గౌరవము గలిగి యుండెను.

కాని పాప మీతని చరమదశ దైవదుర్విపాకమువలనఁ గష్టభూయిష్ఠంబై పోయెను. ఈతనికి ముివ్వురు పుత్రులు గలిగిరి. జయమల్లుఁ డగ్రజుఁడు. పృథివీరాయఁడు ద్వితీయుఁడు. సంగుఁడు కడగొట్టు పట్టి. వీరు మువ్వురును వివేకమహితులే. కాని విధిప్రాతికూల్యమువలన వారొకరితో నొకరు కలహించుకొనఁ బ్రారంభించిరి.

ఈ కలహమును నివారింప రాయమల్లుఁడు చాలఁ బ్రయత్నించెను. అయినను బ్రయోజనము లేక పోయెను. తుద కాతఁడు విసిగి వేసారి ముగ్గురు కొడుకుల నిలువెడలఁ గొట్టెను.

అంతటితో నాతని కష్టముల కంతము గలుగలేదు. ప్రపంచ మంతను జయింపఁగల మూవురు పుత్రులను గలిగి యుండియు నపుత్రకుని మాదిరి నుండవలసివచ్చెఁ గదా యను నూతనవిచార మను భవించుచుండఁ బరలోకమున జయమల్లపృథివీరాయ శిశువును నిహలోకమును విడిచిపోయిరి. పిడుగువంటి యీ వార్త విని రాయ మల్లుఁడు గూడఁ బరమపదించెను.

సోదరులు చనిపోవుటవలన నిగతారిర్హై యున్న సంగుఁడు పితృమరణానంతరము రాజాయయ్యెను. తండ్రివలెనే యీతఁడు గూడ మహాశూరుఁడును; చతురుఁడు. బాలుఁ డయ్యును బ్రజాపాలన మును జక్కఁగఁ బ్రారంభించెను. ఇతని యేల్బడిసైతము సౌఖ్యభూయిష్ఠం బగు నని ప్రజ లానందింపసాగిరి. తోటి రాజు లెల్లరు నీతనితోఁ గోరి మైత్రి చేయసాగిరి. అవక్రపరాక్రమవంతుఁ డగుట వలన నీతనికి యుద్ధ మనిన నెంతో సంతోషము. అశ్వారోహణమునందును, ఖడ్గప్రహారమునందును, శరసమ్మోక్షణమునందును భల్లప్రఘాతమునందును గడుఁ గుశలుఁడు. అగుట నీతఁ డెనిమిదివేల గుఱ్ఱపురౌతులును, నేడుగురు గొప్పరాజులును, దొమ్మండ్రు రావులను యోధాగ్రేసరులును, నూటనలుగురు ఠాకురు, రావత్తను సరదారులును, నైదువందల యేనుఁగులును, నసంఖ్యాకు పదాతివర్గంబునుగల మహాసైన్యమును గూర్చుకొని పరభయంకరుఁడై యుండెను.

ఇది యంతయుఁ జూచి దిల్లీశ్వరుఁడును, మాళవదేశప్రభువును, నీతని యెడ నౌదాసీన్యము వహించి యుండరా దని తలంచి యిరువురు నిరుదెసలనుండియు నొక్కమాఱుగ నీతనిపై దండెత్తి వచ్చిరి. అదిచూచి సంగుఁ డేమియు జంక లేదు. అఖండధైర్యముతోడను, ననంత శౌర్యముతోడను సాహసించి వారి నిరువురినిఁ దాఁకి రొమ్ముడించి పాఱఁద్రోలెను. పరాభవఖిన్నులై కొంచెము సేద దేర్చికొని వారిరువురు మఱల దండెత్తివచ్చిరి. సంగుఁడు మఱలఁ దఱిమెను. మొత్తము మీఁద వారిద్దఱు విడువక యీతనిని సాధించితీఱవలె నని పట్టుపట్టి పదునెనిమిదిసార్లు దండెత్తి వచ్చిరి. కాని పదునెనిమిది మాఱులు నోడిపోయిరి. అంతియ గాదు. ఒకప్పుడు సంగుఁడు దిల్లీశ్వరుని పుత్రునిఁ జెఱపట్టి చిత్తూరు తీసికొనివచ్చి విడిచిపెట్టెను.

ఈ రూపమున సంగుని ప్రతాపము చాల విరాజిల్లెను. కీర్తిలతలు దశదిశలం బ్రాఁకెను. భారతీయు లగు రాజు లెల్లరు నాతని యెడల భయభక్తులు చూపసాగిరి. సంగుని యాజ్ఞ కెందు నభ్యంతరము లేదయ్యెను. మేవాడురాజ్యము చాల విస్తృతం బయ్యెను. కొలఁదిదినములలో మఱల భారత సామ్రాజ్యము తలయెత్తు సూచనలు పొడసూపెను.

ఈ సమయమున దిల్లీశ్వరుఁ డగు నిబ్రాహీములోదీ పరాక్రమహీనుం డగుటవలన నాతని సరదారు లెల్లరు నసంతృప్తులైరి. ప్రజలు తిరుగఁబడ నారంభించిరి: ఈ రూపమున మఱల భారతభూమిలోఁ గల్లోలము ప్రారంభ మయ్యెను. లాహోరునందలి సుబేదారుఁ డగు దౌలత్ఖానుఁడు స్వతంత్రుఁడు కా నూహించి దిల్లీశ్వరునితోఁ బోరాడి పరాభూతుఁడై, తన యభీష్టము నెఱవేఱుటయందున

నెట్లయిన ఢిల్లీశ్వరుని శాసన మందింపవలయు నని ప్రతిజ్ఞ పూని కాబూలు దేశమునకుఁ బోయి తయమూరు వంశజుఁడగు బాబరను వానిని భారతదేశమునకుఁ దీసికొనివచ్చెను.

వెంటనే బాబరు నిబ్రాహీమును దర్పోద్ధతులై పానిపత్తను చోటఁ దలపడిరి. లోదీ పఠానుఁడును, బాబరు మొగలుజాతివాఁడు నైనను నీ యుద్ధము చాల భయంకరముగ జరిగెను. కాని లోదీ బాబరువలెఁ బరాక్రమశాలియు వివేకవంతుఁడును గాకపోవుటవలన బాబరునకే జయము చేకూరెను. లోదీ నిహతుం డయ్యెను. ఢిల్లీసామ్రాజ్యము మొగలుల స్వాధీన మయ్యెను.

ఈ విజయము వలన బాబరు రాజ్యతృష్ణ మతింత వృద్ధియయ్యెను. భారతదేశమున కంతకును జక్రవర్తి కావలె నని యాతఁడు నిశ్చయించుకొనియెను. చక్రవర్తి కావలె నను నాశ యాతనికిఁ జిన్నప్పటి నుండియుఁ గలదు గాని పైతృక రాజ్యమును జ్ఞాతు లందఱును హరించి యాతని నిలువవెడలఁ గొట్టిరి. అక్కఱతన నాతఁడు స్వదేశమును విడిచి యఫ్ఘనిస్థానమునకు వచ్చి సైన్యమును గూర్చుకొని కాబూలు రాజ్యమును జయించి, మధ్యాసియాయందలి పైతృక రాజ్యము నెడల నిరాశ గావించుకొని భారతదేశముపై నుఱికెను. ఢిల్లీ రాజ్యము స్వాధీన మైన వెంటనే దానికంటెఁ బ్రతాపవంత మైన మేవాడు రాజ్యమును గెలుచుకొనవలయు నని యాగ్రామీదుఁగా బయలుదేఱి మున్ముందు సంగరాణామీఁదికిఁ బదునైదు వందల గుఱ్ఱపు రౌతుల నంపెను.

తమ యజమానుని యభీష్టమును నిర్వహించుట కా గుఱ్ఱపు రౌతులు యుక్తకాలమున వచ్చి సంగరాణాను దాఁకిరి. వారల

మూలమున దేశదేశములయందలి వార్తల నన్నిటినిఁ దెలిసికొను చున్నాఁడు గావున రాణా యీ యాశ్వికసైన్యము రాకమున్నే యుద్ధసన్నాహములం గావించుకొని యెదుర్కొనెను. పిదప నుభయ పక్షములవారును సాయంకాలముగఁ దలపడిరి. ఈ తుములయుద్ధ మెంతో ఘోరముగ జరిగెను. విజయలక్ష్మి సంగుని వరించెను. రాజపుత్రులు బాబరు నాశ్వికబలమును జీల్చి చెండాడిరి.

ఈ పరాభవమువలన బాబరు ప్రతాపోష్మ కొంత చల్లారెను. అతఁ డప్పుడు రాజపుత్రులు తా ననుకొని నట్లు నిస్తేజులు గా రనియు కేవల బాహుబలమువలన జయము గలుగఁజాల దనియు గ్రహించి ప్రయాణ మాపివేసెను. తనతోఁగూడ నున్న ప్రచండ సైన్యము చుట్టును శత్రువు లాకస్మికముగ మీఁదఁ బడకుండ గంభీర మగు కందకమును ద్రవ్వించి యొకచో విడిసెను. మఱియు, “సంగా రాణా మోడిపోయి మేవాడు రాజ్యము స్వాధీన మగునెడల దేవున కన యిచ్చెద నిది యిచ్చెద” నని మ్రొక్కుచుఁ దుదకు మిత్రభేదమువలన గార్యము సాధింపఁ దల పెట్టి యందులకుఁ దగు నుపాయముల నాలోచింపసాగెను.

అట సంగరాణాయు, శత్రువాహిని గాంభీర్యము నెఱింగి వచ్చుటకు గుప్తచారులను నియమించి చాలఁ గనుగలిగి యుండెను. ఈ యవసరమున నెట్లు సంఘటిల్లెనో యిరు తెగలవారును సంధిప్రయత్నములయందుఁ బ్రవృత్తులైరి. ప్రజాక్షయమును, బ్రజాపీడయుఁ గలుగకుండవలె నని సంధికొఱ కిరువురులు దమతమ రాయబారులను నియమించిరి. సంగుఁడు సిసోదీ యను రాజపుత్రుని బాబరు చెంతకుఁ దన రాయబారిగాఁ బంపెను.

సిసోదీ రాజనీతియందుఁ జాల సమర్థుఁడు. సంగరాణా చెంతకు బాబరుచే నంపఁబడిన పురుషుఁడు గూడ రాజ్యతంత్రమున నసామాన్యుఁడే. ఆ రాజనీతిధురంధరు లిరువురును దమతమ పక్షముల కెట్టి నష్టమును గలుగకుండు నట్లు సంధి నియమములను గూర్చింపసాగిరి. ఈ సందర్భమున రాజ్యతంత్రమున వీ రిరువురకంటెఁ గడు సమర్థుఁడగు బాబరు సిసోదీతో నూఁటిదారిని మాట్లాడఁ దొడఁగెను. రాజపుత్రుల గుట్టు తెయుఁ దనకుఁ దెలిపి సంగరాణాను దన కొప్పగించినయెడల నసంఖ్యధనము నొసంగెద నని యాతఁడు సిసోదీతో బేర మాడెను. ఆ వ్యాపారసరళి యంతయు మన కప్రస్తుతము. పర్యవసాన మేమనఁగా? సిసోదీ బాబరు వినోదముగఁ బెంచుకొను కుక్కయైపోయెను. అతఁడు సంగునితో సంధినియమము లింకను నిశ్చితములు గాలేదనియు, స్వల్పవిషయములలో మాత్ర మింకను గొంచెఁ దగవు జరుగుచున్న దనియు, సంధి తప్పక కుదురు ననియుఁ జెప్పి యాతనిఁ జల్లగ జోకొట్టెను.

లెక్కలేనన్ని యుద్ధములలో గెలుపొందిన సంగుఁడు తన ప్రతాపమును దలంచికొని గర్వపడెనో, బాబరుని జయించుట సాధ్యము గాదని యూహించెనో, ప్రజాపీడకును సైన్యవినాశమునకును జంకెనో, యుద్ధప్రయత్నమున నశ్రద్ధవహించెను. ఆ సమయమున సిసోదీ హఠాత్తుగ బాబరునిఁ దీసికొనివచ్చి సంగునికంఠముపైఁ గూర్చుండఁజేసెను. అప్పుడు సంగునకు బుద్ధివచ్చెను. అతని కూపి రాడినది గాదు. విల్లెక్కువెట్టి బాణము వదలుటకైన వీలులేకుండునట్లు ఖరాసురుఁడు శ్రీరాముని మీఁదికి వచ్చినట్లు మహమ్మదీయులు మీఁదఁబడుటవలన రాజపుత్రులకు యుద్ధసాధనములను జేతఁ బట్టుటకైన వీలు చిక్కినది గాదు. అక్కడిన వారిలో ననేకులు శత్రువులను మార్కొనక

పూర్వమే కూలిరి. సిసోదీ ప్రత్యక్షముగ బాబరుపక్షమున రాజపుత్రుల మీఁదఁ గత్తి విసరెను. తుదకు హతశేషులతోఁగూడ సంగరాణా యప్పటికిఁ దప్పించుకొని పోవలసిన వాఁడయ్యెను. తురుష్కులు జయించిరి. మేవాడు రాజ్యమునందలి చాలభాగము వారి వశమయ్యెను.

డొంగరపురాధీశుఁడగు నుదయసింగురావలు తన రెండువందల సహచరులతోడను మడిసెను. భోండావంతు లనఁబడు తన మూఁడునందల సర్దారులతో సాళుంబ్రాధీశుఁడగు రత్నఠాకురును మాన్వాడ రాజపుత్రుఁడగు రాయమల్లరాఠోడును, మేఁటువా రగు ఖేతసీరతాన్ యను వారును, సోన్గడ రాజగు రావు రామదాసుఁడును, ఝాల్వాడ రాజగు జోఝా గోకులదాసప్రమారుఁడును జవాన్వంశీయు లయిన చంద్రబాణమాణిక్యచంద్రు లను వారును, స్వధర్మసంరక్షణమునకై తమ ప్రాణముల నొసంగిరి. ఇదియంతయుఁ జూచియుఁ దనకుఁ జాల గాయములు తగులుటవలనను బరాజయము సంభవించుటవలనను వ్యాకులుఁడై సంగుఁడు బాబరునోడింపకుండఁ జిత్తూరు దుర్గమునఁ గాలిడ నని ప్రతిన పూని మేవాడు దేశపుఁ బర్వతారణ్యవాటికలయందు వాసము చేసెను.

అచ్చట నాతనికి శరీరస్వాస్థ్యము చెడిపోయెను. దానికిఁ గారణము పరాభవదుఃఖ మని కొందఱు, నచ్చటి జలవాయువులు పడ లేదని మఱికొందఱు నూహించిరి. విషాయుధప్రహారణ మని వేఱొకకొందఱు భావించిరి. అనేకరాజవైద్యు లౌషధసేవ సేయించిరి. దేనివలనను బ్రయోజనము గలుగ దయ్యెను. వ్యాధియంతకంత కతిశయించెను. అతనికి జీవితాశ తగ్గెను. సహచరులుగూడ నట్లే యెంచిరి. తుద కదియే నిశ్చయ మయ్యెను.

అతనిచే నమ్మ యాతని కొఱకే తమ మానప్రాణముల సమర్పింపఁ దలఁచిన మంత్రులు, సర్దారులు నాతని చుట్టును

శేరి యుండిరి. ఆతని కుమారు లగు రత్న సింహుఁడును, విక్రమాజి తుఁడును నుదయసింహుఁడును గూడ దగ్గఱనే యుండిరి. సంగ రాణా తన పరలోకప్రయాణ మిఁకఁ గొన్ని నిముసములలో నున్న దనఁగా నిట్లు చెప్పెను. "నే ననేకయుద్ధములు చేసితిని. అనేక శత్రులం గెలిచితిని; గాని నా జీవితము నోడిపోయి నను నపవాద మనుభవించుచు విడిచిపెట్ట దలసి వచ్చినది. నే నెన్ని తడవ లెంతటి గొప్ప రాజులను గెలిచినను బాబరుని జయింపకుండఁ జనిపోవలసి వచ్చినందులకు సిగ్గగుచున్నది"

ఇది విని యాతని పుత్రులు "మీ రిందులకై వగవఁ బని లేదు. మీ చేతికి శేషించినది మేము చేసెద" మని యెలుగెత్తి పలికిరి. అది విని యా మహారాజానందములోఁ బ్రాణములు విడిచెను. పిదప నెల్లరును దుఃఖసముద్రములో మునిఁగిరి.

సంగరాణా మహావీరుఁడని చరిత్రకారులు వర్ణించియున్నారు. ఈతఁ డొకమా ఱన్నగారితోఁ బోరునపు డొక చేయి పోయెను. మఱియొక యుద్ధమున గుండు తగిలి కాళ్ల కపాయము కలిగెను. ఇవి గాక యీతని శరీరమున నెనుబదిగాయపు మచ్చ లుండెను. ఇవి వీరున కలంకారములు గదా! అన్ని విధముల నీతఁడు మహా వీరుఁ డని యంగీకరింపక తప్పదు. ఈతఁడు లోదీయెడలను, మాళవదేశపు సుల్తాను నెడలను, ఢిల్లీశ్వరుని పుత్రుని యెడలను దన పూర్వులనే యనుసరించి ప్రవర్తించెను.

ఈ సందర్భమున మనము సిసోదీని మఱచిపోఁ గూడదు; గాని యాతని గుణములను గీర్తించుటకు మా కిట స్థలము చాలదు.

---

శ్రీరస్తు

# వీరపూజ

## ప్రథమ భాగము

---

### ప్రతాపసింహుఁడు

ప్రతాపసింహుని తండ్రి యుదయసింహుఁడు. తల్లి వీరాబాయి. తండ్రియంతటి పిఱికిపంద లేఁడు. తల్లియంతటి శౌర్యభూషితులు లేరు. ఒకప్పు డక్బరు దండెత్తివచ్చి యుదయసింహునిఁ జెఱపట్టెను. వెంటనే వీరాబాయి భయంకరకాళికామూర్తియై యక్బరునిఁ దఱిమికొట్టి భర్తను జెఱ విడిపించుకొని వచ్చెను. ప్రతాపసింహుఁడు పరస్పరసామ్యము లేని యిట్టి దంపతుల కుద్భవించెను. అతఁడు తండ్రివంటి పిఱికిపందయే యయ్యెనో, తల్లివంటి శౌర్యనిధియే యయ్యెనో మనము చరిత్రములవలనఁ దెలిసికొందము.

యథాన్యాయ్యముగ నుదయసింహుని తరువాతఁ బ్రతాపసింహుఁడు రాజ్యమునకు వచ్చెను; గాని యేలుటకు రాజ్యమును, పోరుటకు సైన్యమును, సైన్యమును గూర్చుటకు ధనమును లేవయ్యెను. ఉపాయము చెప్పుటకుఁ గాని సహాయము చేయుటకుఁ గాని స్నేహితులు గూడ లేకపోయిరి. పఱుంబయిగ ఢిల్లీశ్వరుం డగు నక్బరు

ప్రతిస్పర్థియై యుండెను. అతని బలమును జూతమా? బొక్కసము లన్నియు ధనరాసులతో నిండి యుండెను. చతురంగబల మసంఖ్యమై యుండెను. ఇంతవఱకు మేవాడురాజులకు ముఖ్యస్నేహితులుగా నున్న జోధపురము, నంబేర, బికానీరు, బుంది మున్నగు సంస్థానాధీశు లెల్లరు నక్బరు పదదాసులై యుండిరి. విశేషించి సాగరజీ యను ప్రతాపుని తమ్ముఁడు గూడ నక్బరు పక్ష మవలంబించి యుండెను. దీని నంతను బట్టి యీశ్వరుఁడు ప్రతాపునకుఁ బ్రతికూలుఁడై యుండె నని చెప్పుట కేమి యాభ్యంతరము?

ప్రతాపసింహుఁడు మేవాడు రాజ్యమున కధీశ్వరుఁడే. అందులకు సందేహములేదు; గాని యాతని నివాస మారావళీపర్వతారణ్య వాటికలయందు. అతని యాజ్ఞాప్రచార మచ్చటి భిల్లులయందు మాత్రమే. భిల్లులచే నిర్మింపఁబడిన గుడిసెలయందే కాఁపురము. ఒక్కొక్కపుడు చెట్లక్రిందనే. అతని యాహార మొక్కొక్కప్పుడు గోధుమరొట్టెలు. ఒక్కొక్కపుడు కొఱ్ఱలు రాగులు మున్నగు క్షుద్రధాన్యములతోఁ జేయఁబడిన రొట్టెలే. ఒక్కొక యవసరమున నవి గూడ భుజించుటకు వీలు లేకుండెను. శత్రుల రాక విని ముందు వడ్డింపఁబడి యున్న యా రొట్టెలను గూడ దిగవిడిచి భార్యాపుత్రులను నిరపాయ మగు స్థలమునకుఁ జేర్పఁగలసి వచ్చుచుండెడిది. అతని రాణిగారే యాతని పరిచారిక. అభయసింహాదు లగు కుమారులే పరిచారకులు. భర్తచేతను బుత్రులచేతను బ్రేమగౌరవములతోఁ జూడఁబడు రాణి తనకుఁ దానే పరిచారిక యైయుండెను. పరస్పరానుకూల్యముతో నా దంపతులును, బ్రేమానురాగములతోఁ దనయులును గూడి కూడి యుండుటవలన, వారి కా యరణ్యవాటికలే యుద్యానవనవాటికలుగను, బర్ణశాలలే దివ్యభవనములుగను దోఁచుచుండెను.

ఇది మేవాడుదేశాధీశ్వరుం డగు రాణా ప్రతాపసింహుని సాంసారిక స్థితి. ఇఁక నాతని మానసిక స్థితి నొకింత పరికింతము.

ఆతఁ డా యరణ్యమున సంచరించుచు వీరరసప్రధానము లగు తన పూర్వుల యితిహాసములును, భట్రాజకృతము లగు పూర్వవీర యశోగీతములును, సతతము బఠించుచుండెను. తన్మూలమునఁ దన పూర్వుల ప్రతాపమును, శత్రుకోటియెడల వారు చూపిన తిరస్కార మును, విపత్సమయములయందుఁ బ్రకటపఱిచిన ధైర్యసాహసాది కములును, కులగౌరవరక్షణమునందలి పట్టుదలయు, భౌతికశరీరముల యందలి నిర్మమతయు, వీరవిహారమునందును, సద్యశస్సముపార్జనము నందును గల యధికాసక్తియు, నాతనికిఁ దేటతెల్లముగఁ దెలిసి విరో ధులయెడల ద్వేషమును, స్వమతమునెడల భక్తియు, స్వకులము నెడల గాఢాభిమానమును, స్వధర్మమునెడలఁ బ్రబలానురక్తియుఁ బ్రవృద్ధములు గాఁ జొచ్చెను.

ఈ రూపమున నాతనికి వీరవిహారమునం దాసక్తి పొడమెను. ఎల్లప్పుడు నాతని చిత్తవృత్తి రణరంగమునందే సంచరింప సాగెను. తాను బ్రబలచతురంగబలముతో నక్బరుసైన్యమును దాఁకినట్లును, మానసింహాదులు తన సైన్యమును జెండాడ వచ్చి యోపలేక వెన్నిచ్చి పలాయనము సేయుచున్నట్లును, వారినిఁ బ్రోత్సహించుచు ముందునకు వచ్చిన యక్బరు, తా నాడుగఱచి రౌద్రమూర్తియై యెదిరింప సన్న సన్నముగ భటుల చాటుననుండి యవ్వలకు జాఱుచున్నట్లును, నది చూచి దేవతలు తనపైఁ బుష్పవర్షము గురిపినట్లును, విజయానంద మున నరసాక్షియున్న తన పాదకమలముల నంటి యంతఃపురమునకుఁ దనయెడ లాఘవబుద్ధితో నున్న శత్రుకోటిలోని కొందఱు రాజ

పుత్రులు "కులభూషణా! మాపై ననుగ్రహము( బూనుము. మమ్ము నీ బిడ్డలనుగా భావించి, నీశ్వేతాతపత్రచ్ఛాయకు( జేర్చి రక్షింపు" మని ప్రార్థించుచున్నట్లు నాతని కవచాశ్రయమునందును గూడ స్వప్నములు వచ్చుచుండెను. సాతత్యంబు లగు నిట్టి స్వప్నముల వలనను, బూర్వప్రతాపస్మరణము వలనను, నాత( డప్పుడపుడు భయంకరవదనుఁడై కత్తి దూయఁబోవుట తటస్థించుచువచ్చెను.

తండ్రి నికటమున( గూరుచుండి శాత్రవరహస్యములును వైరిబలాబలంబులును, వ్యూహనిర్మాణవిధానములును, రాజ్యతంత్ర రహస్యములును వినుచున్నపు డభయసింహాదులు సైత మచ్చె ప్రవర్తించుచుండిరి. ఈ విషయమున( దండ్రికంటె( గొడుకులును గొడుకులకంటె( దండ్రియు నత్యుత్సాహముతో నుండిరి.

అయిన నాత( డిట్టి శౌర్యోద్రేకమువలన( గేవలము హృదయ వికారమునకు లోనగుటతో నూరకుండ లేదు. శత్రుసంహారమును గుఱించియు రాజ్యసంపాదనమును గుఱించియు ననేకవిధముల నాలోచించుచు నేయుండెను. కాని యాతని యోచన లన్నియు నమిత దారిద్ర్యమువలన విచ్ఛిన్నము లై పోవుచుండెను.

అంతమాత్రమున నాత( డేమియుఁ జలింపలేదు. సాన( బట్టిన కొలఁది మాణిక్యమునకు వన్నెలు హెచ్చునట్లాతని కాపదలు సంభవించినకొలఁది ధైర్యస్థైర్యము లధికము కాఁజొచ్చెను. ఇదియంతయు జూచి ధైర్యవరుం డగు నప్పరొకింత సంచలించెను. చరిత్రములు చదివినవారి కప్పరు స్వభావము, నాతని రాజనీతియుఁ జక్కఁగఁ దెలిసియే యుండును. అతఁడు, ప్రకృత మేమియుఁ జేయలేక

పోయినను ప్రతాపసింహుఁ డసహాయశూరుఁ డనియు, వానివలన నెప్పుడైనఁ దనకు మహావిపత్తు గాక మానదనియుఁ, బ్రక్కలోని బల్లెమై యున్న యాతనిని దండోపాయమున నిగ్రహించుట కల్ల యనియు, భావించి సామంబునఁ గార్యసాధనము సేయ నూహించి "నీవు నాకు శరణుఁజొచ్చెద వేని నీ రాజ్య మంతయు నీ కిచ్చి వేసెదను. నీకుఁ జాల బహుమతు లొసంగి, నా కొలువున నగ్రస్థాన మిచ్చి, యందఱికంటె నెక్కుడుగ గౌరవించెద" నని ప్రతాపునకు వర్తమానము చేసెను.

ప్రతాపసింహుఁ డది చూచి యక్బరును గుఱించి "చూచు చుండఁగనే కనులలో దుమ్ముకొట్టు మాయకాఁడు. కొందఱు రాజపుత్రుల యాభిజాత్యమును మంటఁ గలిపిన వంచకుఁడు. పరస్త్రీలకు మానభంగము గావించుచు, జారశిఖామణియై, మహాత్ముఁ డని పేరు వడిన యవినీతుఁ" డని భావించి తనలోఁ దాను నవ్వుకొనియెను. మఱియుఁ, బరుల భుజాబలమువలనఁ "బ్రతాపమహితుఁడ" నని గర్వించి యున్న యక్బరు నందఁ జేయుటవలన సత్కీర్తికి భంగమే గాని లాభము లేదనియు, స్వప్రతాపమువలన నార్జించిన విజయము నక్బరున కారోపించుట నిస్తేజు లగు మానసింహాదులకుఁ దగిన పని గాని తనకుఁ దగనిదనియు, నక్బరున కంకితుఁడై వానిచే మహావీరుఁ డని పిలిపించుకొనుటకంటెఁ దన వీర్యమును లోకమునకు స్వయముగ [illegible]డించుటయే యుత్తమ మనియు నిశ్చయించుకొని యాతఁడు "బాప్పారావలువంశమునఁ బుట్టి తురుష్కునకు లోఁబడి నా వంశమున కపఖ్యాతి తెచ్చెడి కార్యము నావలనఁ గాలత్రయమందును గాఁజాల" దని యక్బరునకుఁ బ్రత్యుత్తర మంపెను.

ఇంతటి నిస్సహాయస్థితిలోఁ గూడ నిసుమంతయుఁ జలింపక, యక్బరునంతవానిని "నీ వెంత" యని ధిక్కరించుటవలనఁ బ్రతాప సింహుని యశోగీతము లారావళీపర్వతగుహాలు మార్మ్రోగెను. అంత వఱకు నసమానుల మని విఱ్ఱవీఁగు క్షత్రియవీరులు కొంద ఱాతనిని మహావీరుఁడని ప్రశంసింపసాగిరి. అక్బరది విని వివర్ణుఁ డయ్యెను. ఆతని యాస్థానమునందలి మానసింహాదులు వెల్లవోయిరి. విజయగర్వమువలన మిన్నును మన్నును గానక సంచరించు తురుష్కసైనికు లులికిపడిరి.

ఇది విని కొందఱు రాజపుత్రులు ప్రతాపుని మాహాత్మ్యమును గుఱుతెఱింగి యాతనికి సాయము సేయకుండుట చాలఁ దప్పని భావించి, యాతని మహారాజత్వము నంగీకరించి యాతనికొఱకును, స్వమతముకొఱకును—స్వధర్మము కొఱకును, ఢిల్లీశ్వరు నెదిరించి పోరుటకు సంసిద్ధులైరి. వారిలోఁ బ్రతాపుని సవతితమ్ముని కుమారులును, సాళుంబ్రాధీశుఁ డగు టోండావంశీయరాజును, దెల్వాడాధీశుఁ డగు చిన్నసంస్థానికుఁడును, ముఖ్యులు. ఇంకను జిన్న చిన్న రాజు లనేకు లుండిరి.

వారి రాకకుఁ బ్రతాపుఁడు చాల సంతసించి వారివారికి దగునట్లు గౌరవించి "స్వధర్మముకొఱకుఁ బ్రాణముల నొసంగెదము" అని వారిచే శపథములు చేయించెను. అప్పుడు "నౌరోజాఉర్సు" అను పేరున భారతరమణులకుఁ గావించు మానభంగమునుగుఱించి ప్రతాపుఁడు ముచ్చటించినపుడు వారు ప్రళయకాలరుద్రులవలె మండిపడిరి. పిదప వారిలో దూరదర్శులు ననుభవముగలవారు నగు

కొందఱు రాజులను మంత్రిమండలముగాఁ జేర్చికొని ప్రతాపుఁడు మేవాడురాజ్యమును సాధించుటకు సమకట్టెను.

కొందఱు రాజులు సాయము వచ్చుటచే వారి సైన్యము తన చేతిక్రిందికి వచ్చినను నది యంత ప్రబలము కాకపోవుటంజేసి ప్రతాపున కక్బరునిఁ బ్రత్యక్షముగ నెదిరించుట కవకాశము చిక్కినది గాదు. అక్కతన నాతఁడు తన మంత్రివర్గముతో నాలోచించి శత్రురాజ్యమునందలి సంపన్నము లగు జనపదములను గొల్లగొట్టుటకు సైనికుల కాజ్ఞాపించెను. వెంటనే వారు నిరంకుశులై లెక్కలేనంత ధనమును దీసికొనివచ్చి ప్రతాపునకు సమర్పించిరి. ఆ ధనముతో నాతఁడు "కుమలమేరు, గోగుండా" యను స్థలములయందు బలిష్ఠము లగు దుర్గములను గట్టి మఱికొంత క్రొత్తసైన్యము సంపాదించెను. ప్రతాపుఁడు తన సైనికులకు శత్రురాజ్యముపైఁ బడుటకు మఱలఁ గన్నుఁ గీఁటెను. మఱియొకవాఱుగూడఁ గన్నుఁ గీఁటెను. ప్రతాపుని భాండాగారములు ధనముతో నిండిపోయెను.

ప్రతాపుని భటులు త్రొక్కిన స్థలము లన్నియు విధ్వస్తము లైపోయెను. గ్రామము లన్నియు నిర్జనము లయ్యెను. "వ్యవసాయము లన్నియు నశించెను. పంటలు పండవలసిన పొలములలో నిలువెడెత్తు గడ్డి పెరిగెను. జనులతోడను, రథవాహనములతోడను ద్రొక్కుడు పడుచుండవలసిన త్రోవ లన్నియు దుమ్ములతోడ నిండిపోయెను. రాజమందిరములలోను, ధనికుల గృహములలోను హింస్ర మృగములు వాసముచేయఁ దొడఁగెను.

ఇట్లాప్రదేశ మంతయుఁ జిట్టడవి యైపోయెను. అక్బరునకు రావలసిన పన్నులు చెల్లకుండెను. అంతియ గాక, యా త్రోవనుండి

పోయెడి ఢిల్లీపాదుషాలను, వస్తుసామగ్రి మున్నగు నితరవస్తువులను గొల్లగొట్టుటకుఁ బ్రతాపుని సైనికులకుఁ జాల వీలయ్యెను. అప్పు డక్బరునకుఁ గావలసిన సీమసరకు లన్నియు నీ ప్రాంతమునుండియే ఢిల్లీకిఁ బోవలసియుండెను. అక్కతన వానిలో నొక్కటియైన ఢిల్లీశ్వరున కందకుండఁ ద్రోవయందే ప్రతాపుఁడు కొల్లగొట్టింపసాగెను. ఈ విధముగా నాతఁడు తన ప్రబలశత్రుని బాధపెట్టఁదొడఁగెను.

ఒకనాఁటికంటె నొకనాఁ డాతఁడు ధనమునందును వశము నందును గూడఁ బ్రబలుఁడు కాసాగెను. సంతతవిజయములవలన నాతనికి సాయమువచ్చిన వారికిని బ్రోత్సాహ మధికము కాసాగెను. మేవాడురాజ్యము స్వాధీన మగు సూచనలు పొడసూపఁదొడఁగెను. అదియంతయుఁ జూచి ప్రతాపుఁడు సహచరులతో "మన ప్రయాణము నిర్విఘ్నముగఁ గొనసాగుచున్నది. మన గర్వస్థానపు శిఖరములు గోచరించుచున్నవి. మేవాడు రాజ్యలక్ష్మి సంతోషముతో మనల నాహ్వానించుచున్నది. వీరులారా! ధైర్యముతోఁ బ్రవర్తింపుఁ" డని ప్రబోధింపఁజొచ్చెను.

పిదపఁ బ్రతాపుఁడు క్షత్రియజాతియందు నవీనము లగు కొన్ని యేర్పాట్లు గావించెను. రాజపుత్రులు కొందఱు ఉద్యోగముల కొఱకును, సంపత్తులకొఱకును దురుష్కులకుఁ దమ యాఁడుపిల్లలను గానుకగా నిచ్చి యుండిరి. ప్రతాపుఁడు "తురకలకుఁ బిల్లల నిచ్చిన క్షత్రియులతో నితరులు సంబంధబాంధవములు సేయఁగూడ" దని శాసించెను. దాని కాతని యనుయాయు లందఱును సమ్మతించిరి. రాజపుత్రస్థానమునందలి తక్కిన క్షత్రియులలోఁ గూడఁ గొందఱు సమ్మతించిరి.

ఈ నిబంధనమువలనఁ బ్రతాపుని శత్రుసంఖ్య మఱింత వృద్ధి యయ్యెను. తురుష్కులకుఁ దమ కన్యల నిచ్చిన క్షత్రియు లెల్లరు నాతనిపైఁ దీవ్రశత్రుత్వము వహించిరి. వారియం దెల్ల మానసింహుఁడు ముఖ్యుఁడు. జోధపురాధీశుఁడు గూడ నట్టివాఁడే యయ్యెను. తన మేనత్త నక్బరు తండ్రి యగు హుమాయూనునకును జెల్లెలి నక్బరునకు నిచ్చి యున్నందున మానసింహునకుఁ బ్రతాపసింహునిపైఁ జాలఁ గోపము వచ్చెను; గాని యది యంతయు హృదయమునందే దాఁగియుండి క్షణక్షణమునకును బెరిగిపోవుచుండెను. మానసింహుఁ డెప్పటికైనఁ బ్రతాపుని యాభిజాత్యమునకుఁ గళంకము గలిగించి యాతని గుడ మణఁచివేయవలయు నని నిశ్చయించుకొనియెను.

ప్రతాపుఁడు, మతనిబంధనము గావించినందులకు మానసింహాదులు తనపై నత్యంతాగ్రహముఁ బూని యున్నా రని గ్రహింపకపోలేదు. అక్బరు బానిసలై యుండి, యిదివఱకే తనకు విరోధులై యింతవఱకు వా రేమి సేయఁగలిగిరో యిఁక ముందు నదియే చేయు నిమ్మని యాతఁడు మానసింహాదులయెడల నైస్వ్యము వహించి యూరకుండెను.

పిదప నొకప్పు డక్బరు నాజ్ఞ నంది మానసింహుఁడు సోలాపురప్రాంతమును జయించుటకై యరిగి, యా యుద్ధమున విజయము గాంచి, యా జయము నక్బరునకు సమర్పింప ఢిల్లీనగరమున కరుగుచు మార్గమధ్యమునఁ గుమలుమేరు సమీపమున విడిసి, యచ్చటఁ బ్రతాపుఁ డున్నాఁ డని విని యాతనిం జూచుటకై పరిమితపరివారముతో నశ్వారూఢుఁడై కుమలుమేరున కరిగెను.

మానసింహుని రాకకుఁ బ్రతాపుఁడు చాల వింతపడెను. అప్పు డాతని హృదయాకాశమున ననేకభావవిద్యుల్లతలు మెఱసిపోయెను. మానసింహుఁ డగ్బరు నాజ్ఞమెయి సంధి సేయ వచ్చెనని యాతనికిఁ బ్రప్రథమమునఁ దోఁచెను. ఇంక నేమేమో తోఁచెను. తురకుల మత నిబంధనము జ్ఞప్తికి వచ్చెను. అట్టి మతనిబంధనము సేయుటవలన వళి మానము గలిగియుండు ననియు, దానివిషయమై మాట్లాడుటకు వచ్చి యుండు ననియు, నదియే నిజమగునెడల నప్పుడు వాతనికిఁ గల దేశ్యసేవకరూప మగు స్నేహము గతార్థమైపోయి యుండు ననియు మంత్రిమండలి యందలి కొందఱు చెప్పిరి. ఎన్నితలంపులు గలిగి నను దొంటి సందేహము శిలాకృతి నట్లె యుండెను. తుద కంతయు నింటికి వచ్చినవారికి గౌరవము సేయకుండుట మర్యాదగాదని నిశ్చయించుకొనిరి.

మానసింహుఁడు లోనికి వచ్చెను. దేశకాల ప్రాణములను జక్కఁగ నెఱింగిన ప్రతాపుఁ డాతని కన్నములకు మర్యాదలు గావించెను. ఇరువురును జాల శాంతముగ మాట్లాడుకొనిరి. ఎట్లు సంఘటిల్లెనో చెప్పఁజాలము గాని మానసింహుఁడు ప్రతాపునింట విందుగుడుచుట తటస్థించెను.

అంతయు సిద్ధమయ్యెను. తళతళ మెఱసిపోవు వెండిపాత్రములయం దాహారపదార్థములు వడ్డింపఁబడియెను తుద కొక విషమ సమస్య ప్రత్యక్ష మయ్యెను. దాని పర్యవసానము శుభముగ ముగిసి నది గాదు. మానసింహుని పక్షము వారికి మాత్రమే యాహారపదార్థములు వడ్డింపఁబడియెను. అదిచూచి వారు చాల సందేహించిరి. తురకలతో సంబంధమును జేసినవారి సహపంక్తిని మే మెట్లు భుజింతుమని ప్రతాపునిపక్షమునఁ బ్రత్యుత్తర మీయఁబడెను. దానివలన

వహ్నిలో నేయి పోసిన ట్లయ్యెను. మానసింహుని ముఖమండల క్రోధాగ్ని జ్వాలలవలనఁ గమలిపోయెను. వెంటనే యాతఁడు మేఘగంభీరభాషణములతో "నన్ని ట్లగౌరవపఱిచినందులకు నీకుఁ దగిన ప్రాయశ్చిత్తము చేసెద నుండు" మని చెప్పి యాఁవలె భోజనశాల వెలువడి వచ్చి యశ్వారోహణము గావించెను.

మానసింహుని చేష్టలకును, మాటలకును బ్రతాపునకు నవ్వు వచ్చెను. కులఘ్నునకే యంత యభిమాన మున్న సత్కులప్రసూతున కెంత యభిమాన ముండును? మానసింహుని యుత్తరములకుఁ బ్రతాపుఁడు "నీవు యుద్ధమునకు వచ్చునప్పుడు నీ మేనల్లునిఁ గూడఁ దీసికొని రమ్మని సోత్ప్రాసముగఁ బ్రత్యుత్తర మిచ్చెను. మానసింహుఁడు మఱింత యవమానమునకుఁ బాల్పడెను. అతని వీరసత్వంతము మీసములు మెలిపెట్టుచుండే చల్లిపోయెను. "నీకు మానభంగము గావించి మానసింహుఁడను నా పేరు సార్థకపఱిచెద" నని చెప్పుచు నాతఁడు గుఱ్ఱము నడాయించెను.

ప్రతాపుఁడు లేన నేలిక యగు నక్బరునకుఁ బ్రక్కలోని బల్లెమే యైనను, నింతకాలకు మానసింహుఁ డాతని నంతగా లెక్క సేయలేదు. ప్రతాపుఁడు మతనిబంధనము గావించిన పిదప నాతని హృదయమునఁ గ్రోధాగ్ని రగుల్కొనియెను. ఇప్పు డది యొక్క మాఱుగ భగ్గున మండెను. ఆ జ్వలనజ్వాల లాతని శాంతమంత్రమును భస్మము గావించివైచెను. అతని మాటలును, నిశ్వాసములును గూడ నా యగ్ని కీలలవలన మాడిపోయినట్లే ప్రకాశము లగుచుండెను. లోహశకలము చేరువ నైనకొలఁది నయస్కాంతమున కాకర్షణ శక్తి యెట్లు

విజృంభించునో యట్లే దిల్లీ సమీపించినకొలఁది వాయగ్నికి మంట లెక్కు డయ్యెను.

యుక్తసమయమున మానసింహుఁడు కొలువుకూటమున వస్తుసందర్శనము గావించి తాను కైకొనివచ్చిన విజయలక్ష్మి నక్బరు పదములకడ సమర్పించెను. అందుల కెంతయుఁ బ్రీతుఁడై యా యకబరుఁడు "మానసింహా! యోధాగ్రేసరా! నీ రాజభక్తికి మా కానంద మైనది. అపజయ మెట్టిదో యెఱుంగని నీ ప్రచండ చంద్రహాస మద్వితీయముగ వెలుంగుఁ గాక. మేఘనాదానుకారి యగు నీ సింహనాదము వైరికాంతాగర్భనిర్భేదక మగుఁ గాత" మని పొగడిపొగడి వెలగల పసదనము లిచ్చి శ్రమదీఱునట్లు జోకొట్టెను.

మానసింహుఁడు తటి గనిపెట్టి యక్బరు హృదయమునఁ గ్రోధాగ్ని రగుల్కొల్పెను. కాని యా యగ్ని యక్బరుచేఁ గత్తి దూయింపలేకపోయెను. సాధ్య మైనంతవఱకు స్వయముగ యుద్ధరంగమున కరుగకపోవుటయే యక్బరు రాజనీతిపరిజ్ఞానపుఁ బ్రథమ ప్రకాశము. అనుజీవులు మోసము చేసెదరేమో యని యాతని కనుమానములేదు. తన జోలపాట వారి యాత్మజ్ఞానమును దుప్పటిముసుఁగువెట్టి మఱల లేవకుండ జోకొట్టిన దని యాతని కెఱుకయే. ప్రతాపునిపై మానసింహునకే కత్తి దూయవలసివచ్చెను. ప్రతాపుని సలహా వ్యర్థము కాలేదు. మానసింహుఁడు తన మేనల్లుని వెంట నిడికొనియే బయలుదేఱి శంఖ మూఁదెను.

మానసింహుఁడు ప్రథమమునఁ గుమలుమేరుదుర్గమును ముట్టడించెను. అదిచూచి ప్రతాపుఁడు "మానహీనున కిప్పటి కభిమానము పుట్టినదీ ఎంత వింత!" యని నవ్వుకొనియెను; గాని వెంటనే "యిది

సదభిమానము గాదు. దురభిమానము. ఇదియే భారతీయులను చీల్చి పిప్పిచేయుచున్నది" యని వగచెను. ఈసందర్భమున నాతని చూడ్కులు తొలుదొలుత ఢిల్లీదెసకును, దరువాత భరతవర్షమునందంతటను బ్రసరించెను. తోడనే యాతని హృదయము చేయివెట్టి కలఁచినట్లు కలఁగిపోయెను. అప్పు డాతఁ డొక్క వేఁడినిట్టూర్పు విడిచి మంత్రిమండలిదెసకుఁ జూచెను.

ప్రతాపుని గభీరదృష్టి తమ దెసఁ బ్రసరించినంతనే మంత్రులందఱు నొక్కపెట్టునఁ "బరాభవాగ్ని యక్బరుమానసింహుల హృదయములయందుఁ దీవ్రముగ రగుల్కొనినది. దురభిమాని యగు మానసింహుఁడు మీ రనినట్లే మేనల్లునిఁ గూడఁ దీసికొనివచ్చినాఁడు. సంగతిసందర్భము లన్నియుఁ జూడఁగా నీ యుద్ధము ఘోరముగ జరుగక మాన దనియు, దీర్ఘకాలము ప్రవర్తిల్లక తీఱ దనియుఁ దోఁచుచున్నది. ఇఁక నాలసించుట నీతి గాదు. క్షణక్షణము ఢిల్లీనుండి క్రొత్తఫౌఁజు వచ్చెడి నని తోఁచుచున్నది. ఎప్పటిదండు నప్పుడే రూపుమాపకున్న శ్రమపడవలసివచ్చు"నని చెప్పిరి. వెంటనే తగు నేర్పాటులన్నియు ముగిసెను. ప్రతాపుని సింహనాదము మానసింహుని శంఖారావమును సిగ్గుపఱిచెను.

ఉభయపక్షములవారికి నీ సంగ్రామదీక్ష నెలలతోఁ దీఱినది గాదు. ఈ మహాయుద్ధమున ననేకాంతర్యుద్ధములు జరిగినవి. అనేక పర్యాయములు మొగలుసైనికు లోడిరి. అనేకప్రయత్నములలోఁ బ్రతాపుఁ డోడెను. మానసింహునకును, యువరాజు సలీమునకును దల్లప్రాణము తోఁకకు వచ్చెను; గాని యంతమాత్రమునఁ బ్రతాపునకేమియు ఫలము గలిగినదిగాదు. అతని కింకను మంచిదినములు రాలేదు.

ఆతని నెత్తిపైఁ దాండవ మాడుచున్న దురదృష్టదేవత యింకను దొలఁగిపోలేదు. ఈశ్వరున కింక నాతనిపై ననుగ్రహము గలుగలేదు.

ఈ యుద్ధము ప్రారంభ మగునప్పటికిఁ బ్రతాపుని చేతిక్రింద నిరువదివేల సైన్యముండెను. శ్రావణశుద్ధ సప్తమినాఁడు హాల్దీఘాట్టను చోట జరిగిన సంకులసమరములో నసంఖ్యసైనికులు ననేక సేనానులును మడిసిరి. అనగాఁ బండ్రెండువేల భటులు వీరస్వర్గమును జూఱకొనిరి. తన యసామాన్యవీరకవిత్వముచే రాజపుత్రులకే గాక శత్రువులకుఁ గూడ నుద్రేకము గొలుపు ప్రతాపుని యాస్థానకవియు, భట్టకులతిలకుఁడు నగు భాణుఁడను నాతనిని దేవేంద్రుఁడు తన యాస్థానకవిగాఁ గొంపోయెను. కమలమేరుదుర్గము మొగలుల స్వాధీన మయ్యెను.

ప్రతాపునకుఁ గష్టములును, సైన్యవినాశమును, దారిద్ర్యమును హెచ్చిపోయెను. తినుటకుఁ గంచమును, నిద్రించుటకు మంచమును లేని యవస్థ వచ్చెను. స్త్రీలకును, శిశువులకును నివాసములు గలుగకుండ నిక్కడనుండి యక్కడకు, నక్కడనుండి యిక్కడకును బరువెత్తవలసివచ్చెను. ఎంతయైనను బ్రతాపునకు భయము గలుగలేదు. ఆతని మనస్సు వెనుదిరుగ లేదు. "నా తలిదండ్రులు [illegible] బ్రతాపసింహుఁడను నామము నే యభిప్రాయముతోఁ బెట్టిరో దివ్యమగు నా యభిప్రాయ మప్రతిహతమై వెలయుఁగాక. నేఁడు భయంకరాకారముతో వెఱపించుచున్న కాలము రేపు సుకుమారాకారముతో దాస్యము చేయక మాః" దని ప్రతాపుఁడు ధైర్యము వహించి యుండెను. ఈ సందర్భమున శత్రువులతోఁ గలిసియున్న సాగరజీ బుద్ధి తెచ్చుకొని యన్న యగు ప్రతాపుని పాదసన్నిధికిఁ జేరికొనియెను.

ఇది యంతయుఁ జూచి ప్రతాపుని ధైర్యసాహసాదుల కాశ్చర్యపడి యక్బరు నాతని మంత్రులు, నాతనిని ధన్యుఁ డని మెచ్చుకొన సాగిరి. అందు నక్బరు ముఖ్యమంత్రియు, గుణగ్రాహియు, మహాకవియు నగు ఖానఖాన నను నాతఁడు, ప్రతాపుని యుత్కృష్టగుణముల కానందమును బట్టఁజాలక యీ క్రింది యుత్తరమును గవితాబద్ధము గావించి ప్రతాపున కనిపెను.

“మానవుని సంపత్తియు నధికారమును నశ్వరములు. ఇది సృష్టి క్రమము. కాని మానవుని సద్గుణములయొక్కయు, సత్కీర్తియొక్కయుఁ బ్రశంస లోకములోఁ జిరకాల ముండును. కావునఁ బుత్రా! నీవు ధన్యుఁడవు. ఏల యన? నీవు సంకటావస్థలో నుండియుఁ, బాదుషాకు శరణురాక నీ కీర్తియు, గౌరవమును రక్షించుకొనుటకు యోగ్యమైన ప్రయత్నములను జేయుచున్నావు. ఈ గుణములు భారతీయరాజులయెడల నసాధారణములు. కావున నీవు నీ స్వజాతియొక్క యాభిమానమును వన్నెనీయముగ రక్షించుచున్నావు. నీవు రాజ్యవైభవమును సుఖప్రాప్తిని గడ్డిపరకలవలెఁ జూచి వందనీయమగు నీవంశముయొక్క కీర్తి నాచంద్రస్థాయిగఁ జేయుచున్నావు.” *

ప్రబలు లగు శత్రుపక్షమువారే ప్రతాపు నిట్లు పొగడినప్పుడు మిత్రపక్షమువా రెంత మెచ్చుకొందురో వ్రాయ నక్కఱలేదు; గాని యీ పొగడ్తలవలనను నీ మెప్పులవలనను నేమి ప్రయోజనము? దైవ మాతనియెడ నింకను బ్రాతికూల్యము వహించియే యుండెను. ఏ పనిచేసినను గలిసిరా దయ్యెను. శత్రువుల యొత్తిడి వలన నూపిరి తిరుగకుండెను. అక్కఱతనఁ బ్రతాపుఁడు సైన్యాదికములను జేర్చు

* మహాత్మ్యవి[illegible]ము. ౩౦౮ పుట.

కొనుటకుఁ గాని, మఱిదేమిచేయుటకుఁ గాని తోఁపక విసిగిపోయి తుదకు "యుద్ధమునకుఁ గొంత వ్యవధి యీయవలసిన" దని యక్బరు నకు వర్తమాన మంపెను.

ఈ వార్త నక్బరు, సభలో వినిపించెను. అందఱు నక్బరుకత్తి కెందు నెదురు లేదని కొనియాడిరి. ఆ సభలోఁ బృథివీరాజను నొక రాజపుత్రుఁ డుండెను. అతఁడు బికానీరు రాజు సోదరుఁడు; మఱియు సేనాధిపతి. అక్బరు సభలో నాతఁ డొక సరదారుఁడై యుండెను. అతఁ డా వార్త విని చాల విచారించెను. అతఁ డక్బరునకు దాసుఁడైనను బ్రతాపుఁ డనినఁ జేయెత్తి మ్రొక్కును. అకృతివ నంతటి సభలో ధైర్యముతో లేచి యక్బరు నుద్దేశించి "ప్రతాపుఁడుం మీకు శరణుజొచ్చుట యబద్ధము. ప్రతాపసింహుని శత్రు వెవఁడో మీ కీ వార్త తెలిపి యుండును. ప్రతాపుఁడు ఢిల్లీపట్టణము కట్టినను నిట్టిపని కంగీకరింపఁ డని నా నమ్మకము. కావున నేను నా విశ్వాసపాత్రుఁడైన సేవకు నంపి నిజమగు వర్తమానమును దెలిసికొనియెద" నని చెప్పెను. పిదప నాతఁడు కవితాబద్ధమైన యొక యుత్తరమును బ్రతాపున కంపెను.

"రాణాప్రతాపసింగ్ జీ! భారతీయుల మగు మే మెల్లరమును మీవంటి పరాక్రమశాలులగు భారతీయ రాజపదధారులనే నమ్మియున్నాము. ఇతర రాజులవలన మా యాశలు నిరాశలు చేయఁబడినను ప్రతాపసింగు రాణావలన నట్టి పని జరిగి యాతఁ డక్బరునకు శరణు వచ్చుట యత్యంతదుఃఖాస్పదము. (మేమైతే దైవోపహతులమై మా పరాక్రమమును, మా స్త్రీల పాతివ్రత్యమును గోలుపోయితిమి. మా యభిమానమును మా స్త్రీల పావిత్ర్యమును మే మక్బరున కమ్మితిమి. కాని వాతఁడు వాడుకొనియెను.)' కాని యుదేసింగుపుత్రు

లైన మీరు మాత్రము రాజపుత్రుల లజ్జయు స్త్రీల పాతివ్రత్యమును మీ వంశములో నిదివఱకు రక్షించినారు. వానిని నట్లే యిఁకముందు గూడ రక్షింపుఁడి. రాజా! ఏమి చెప్పుదును? "నౌరోజా ఉత్సవము" తిరునాళ్లలో నే రాజపుత్ర స్త్రీయొక్క మర్యాద దక్కినది? ఎవరి మర్యాదయుఁ దక్కలేదు. కావున సుప్రసిద్ధులును, మానధనులును, నగు సిసోదియాకులముయొక్క మర్యాద యీ "నౌరోజా ఉత్సవ"ములో నమ్ముటకుఁ దేవల దని నా ప్రార్థన. అంతయుఁ బోఁగొట్టుకొని దరిద్రుడ నైతి నని యనుకొనుచున్నారేమో; గాని యట్లను కొనవలదు. మీరు పోఁగొట్టుకొన్నా నన్న దంతయు యశోభివృద్ధిచే మీ కున్నట్లే యెంచుఁడి. నిరాశచే క్షత్రియకులోద్భవు లనేకు లవమానజనితదుఃఖము ననుభవించిరి. కాని యట్టి యవమానము, నపకీర్తియు, హామీరవంశజు లైన మీ పాలిట నిది వఱకుఁ బడ లేదు. లోకసంతతియు నాశచే మీ వైపు చూచుచున్నది. భారతీయుల గౌరవము వెలువడుటయు, భారతీయుల మర్యాదను గాపాడుటయు మీవలననే జరుగు నని లోకులు నమ్మియున్నారు. మీ కులమునకును, రాజవంశమునకును, నేఁటివఱకుఁ గలుగని యపకీర్తి యెన్నటికిని గలుగఁ గూడ దని మా కోరిక. ఆత్మగౌరవపూరిత మగు మీ యంతరాత్మయు, జయశాలి యగు మీ ఖడ్గమును మీకు ముఖ్యసహాయకర్తలు. వాని సహాయముగొని మీరు క్షత్రియుల పౌరుషమును రక్షింపవలయును. ............ పాదుషాకు శరణనినందువలన లాభ మేమియు లేదు. మీ పౌరుషమునకును,యశస్సంపాదనమునకును నీశ్వరుఁడు తోడ్పడుఁ గాక" †

---

† మహమ్మదీయ కాలము 30౬ పుట.

ఈ యుత్తరమును జూడఁగనే ప్రతాపుని శౌర్యాగ్ని మఱలఁ బ్రదీప్తం బయ్యెను. ఇంతవఱకును నిర్భయముగ నష్టము నెదిరించి యిప్పు డిట్లు కోరుట చాలఁ దప్పుపని యనియు, నపకీర్తి యెట్టిదో యెఱుంగని తన కీ గొప్ప కలంకము వచ్చెననియుఁ భావించి యాతఁడు వగచెను. తాను వ్యవధి యీయవలసిన దని కోర శరణుఁజొచ్చినట్లు తలంచెఁ గాఁబోలు నని యగ్బరు మౌఢ్యమునకు నవ్వుకొనెను. పృథ్వీరాజు జాబువలన లోకమును క్షత్రియబృందమును దన యెడలఁ జూపుచున్న గౌరవమును దెలిసికొని తన యాభిజాత్యమునకు గర్వ పడెను. అగ్బరు నాస్థానమునందలి క్షత్రియులలోఁ గొందఱు తన యొద్దల నింతటి పూజ్యభావమును గలిగి యుండుట చాల మంచి దని తలంచెను. వెంటనే దిగ్గజము లులికిపడునట్లు సింహనాదము గావించి, దురూహపైఁ గట్టఁబడిన యగ్బరు విజయప్రాసాదమును గూలఁ ద్రోసెను.

ఈ ప్రయత్నమువలనఁ గూడ నాతని కేమియుఁ బ్రయోజనము గలుగలేదు. విశేషించి ద్రవ్యనష్టమును, బలవినాశమును గూడ సంభవించెను. అన్ని విధముల నాతని ధైర్యకంచుకము సడలి పోయెను. ఇఁకఁ బోరుటవలన నెంతమాత్రమును ఫలము లేదని విరక్తి గలిగెను. ఇంతచేసినను జయము గలుగకపోవుటచేఁ దన యభాగ్యతను నిందించుకొనుచు ఖడ్గవ్యాపారముపై నసహ్యముగలుగ, దేశత్యాగము గావించి సింధునదీతీరమునకుఁ బోవలె నని తలంచి బయలు దేఱెను.

• ప్రతాపుఁడు బయలుదేఱిన నాఁడే యారావళీపర్వతమును దాఁటిపోయెను. సాయంకాలమున భార్యాపుత్రులతోడను, బరిమిత పరివారముతోడను, నొక పర్వతపాదమున విడిసెను. అవి మేవాడు సీమాంత్యభూములు. నాఁటిరాత్రి భోజనానంతర మాతఁడు పటకుటీర

ప్రాంగణమున విశ్రమింపఁ బరుండెను. పుత్రులలో నొకరిద్దఱును సేవకులలోఁ గొందఱు నాతని చుట్టును జేరి కూర్చుండి యుండిరి. పటకుటీరాంతర్భాగమున, దీపపువెలుతురులోఁ గపోలన్యస్తహస్తయై దీనాననయై, నిట్టూర్పులు విడుచుచు రాణి యాతని కెదురుగ శయ్యపైఁ గూర్చుండి యుండెను.

అప్పుడు ప్రతాపుని హృదయాంతరాళమున రాశీకృతమై నిరాశారూపమున నున్న గాఢాంధకారమును భేదించుకొని యొక నవీన తేజ ముదయించెను. క్షణములో నా తేజము ప్రవృద్ధమై యంతరంగమును ప్రకాశవంతము గావించెను. తేజోమయం బైన యాతని హృదయమున వివిధభావసంఘట్టనము ప్రారంభ మయ్యెను. అంత యవశమైపోయిన మనస్సుతో నాతఁ డాకస్మికముగ లేచి కూర్చుండెను. అపుడు విచారములో నూర్ధ్వముఖియై యున్న రాణి యాతని కంటఁ బడెను.

తోడనే మేవాడు రాజ్యలక్ష్మి యాతని స్మృతిపటమున నంకిత మయ్యెను. సిసోదియావంశమునఁ బ్రభవించి పూర్వుల శౌర్యసాహసముల కుదాహరణముగ నింతవఱకుఁ బ్రబలప్రతిస్పర్థి నెదిరించి పోరి, నేఁ డాత్మగౌరవమును మంటఁగలిపి నిరాశవలనఁ దాను విదేశములకుఁ బోవుచుండుటఁ గాంచి యామెయుఁ దనరాణివలె దీనాననయై పరితపించుచున్నట్లును, మఱల నంతలో నాత్మయాభిజాత్యమును స్మరించుకొని యారక్తనేత్రయై, యామె తన్నతి ఘోరముగ శపింప నుద్యుక్త యగుచున్నట్లును, దన తల్లియగు పీరాబాయి భయభ్రాంతయై కాళ్లు గడగడ వడఁక "తల్లీ! రక్షింపుము. నాబిడ్డని రక్షింపు" మని వార్చుకొనుచు నతిరభసంబున వచ్చి యామె పాదములపై వ్రాలి "దేవీ! శాంతింపుము. నా బిడ్డవలన నపరాధ మైనది.

నిజముగ నది నా తప్పే యగును. వీరస్వర్గసుఖానుభవము వలనఁ బ్రమత్తనై నే నింత వఱకు సంకటావస్థలోఁ బడియున్న నా గారాబు కొమరుని హృదయక్షేత్రమును దొలంగియుంటిని. ఓ మేవాడురాజ్యలక్ష్మీ! క్షమింపుము. నీకును నాకును గూడ నా బిడ్డఁ డొక్కఁడే దిక్కయి యున్నాఁడు. సిసోదియావంశమును నిర్మూలము గావించితివేని నేనును, నా పూర్వులును గతిలేనివార మైపోదుము. నీవు ధర్మభ్రష్ట వైపోదువు. తల్లీ! అచ్ఛమైన రాచకొలమును నిలుపుము. భారతధర్మమును గాపాడుము. పల్లనిచాపలనొలయఁ జేసి నాకుమారునకు బలము నొసంగుము. నిరాశవలన నజ్ఞానాంధకారకూపమునం బడి నిరుత్సాహమువలన నధఃపతితుఁడైపోయిన నా యనుంగుపట్టినిఁ బ్రేమతోఁ జేయూఁత నొసంగి యుద్ధరింపు" మని ప్రార్థించుచున్నట్లు, నందుల కంగీకరింపక "మానవతీ! నీవు తొలంగియుండుము. ఇపుడు నీ ప్రశక్తి లేదు. నీ యంశము ప్రతాపునియం దంకితము గాలేదు. నిష్కళంక మగు సిసోదియావంశము నీతోడనే యంతరించినది. నీ పూర్వులతోఁ గూడ నీ వింటినుండి శౌర్యహీనుఁడు, ధర్మభ్రష్టుఁడు నగు ప్రతాపునిచే విడువఁబడు నివాపజలమున కాశ వదలుకొనుము. ఆ పౌరుషశూన్యుని రక్షింపఁ బ్రార్థింపకుము. నీ వా యధీరుని మీఁది మమతను విడువఁజాలవేని యక్షయం బగు వీరస్వర్గమునుండి విభ్రష్ట వైపోదువు. ఓశూరనారీరత్నమా! నీవు తొలంగియుండు"మని రాజ్యలక్ష్మి తన తల్లిని నిరాకరించుచు శాపోదకములను గ్రహింపఁబోవుచున్నట్లు నాతనికిఁ దోఁచెను. వీరాధివీరులై వీరస్వర్గమున స్వచ్ఛందవిహారము గావించుచున్న తన పూర్వులుం దన భీరుత్వము నారసి మొగమెత్తలేక వగచుచున్నట్లు గూడఁ దోఁచెను.

తోడనే వివిధభావోదయములవలనఁ గలఁగిపోయిన యాతని హృదయము బద్ధ లైపోయెను. ఈ సంక్షోభమువలన నప్రయత్నముగఁ గన్నులు మూఁతపడెను. భయంకరకాళికామూర్తియై యున్న మేవాడురాజ్యలక్ష్మి యతని కన్నులయందే ప్రవేశించెను. వెంటనే యాందోళనం బధిక మయ్యెను. ప్రాపంచికస్మృతి తప్పిపోయెను. అపుడు "రాజ్యలక్ష్మీ! శపింపుము. పాపాత్ముని, ధర్మభ్రష్టుని ఘోరముగ శపింపుము. పూర్వుల మార్గమునకుఁ దప్పినవానిని, సత్సాహప్రభుమంత్రశక్తులచే వచింతుఁడైనవానిని, నీతిబాహ్యునిఁ గులకలంకునిఁ దల వ్రక్కలై పోవునట్లు శపింపుము. పుట్టగతులు లేకుండఁ బోవునట్లు శపింపుము. ఆలసింపకుము. శాపోదకములను ద్వరగ విడువు"మను మాట లప్రయత్నముగ నాతని యోష్ఠపుటము నుండి జాఱెను.

ఈ మాటలు విని చెంతనున్నవారు నిర్విణ్ణులైరి. రాణియు నాశ్చర్యచకితయై తటాలున వచ్చి బొమ్మవలె నట నిలువఁబడి పోయెను. ప్రతాపుని కనుదమ్ము లింకను వికసింపలేదు. హృదయ మింకను దేఱికొనలేదు. రాజ్యలక్ష్మి యింకను శాంతింపలేదు. ఆమె విశాలనయనయుగ్మముపైఁ గ్రోధరసము పొంగి పొరలిపోవుచునే యుండెను. అపుడు ప్రతాపుఁడు "మేవాడురాజ్యలక్ష్మీ! తన పూర్వుల పవిత్రరక్తధారలచేఁ దడిసిన జన్మభూమిని విడిచి వెళ్లుటకుఁ బ్రయాణమైన మానహీనునిఁ, దనపైఁ గల కార్యభారము నెఱుంగఁజాలని వివేకరహితుని, వైరివీరుని ప్రచండమండలాగ్రశోచిఃపుంజమ్ములవలన మిఱుమిట్లుగొని, దిగ్భ్రాంతుఁడై రణరంగము నుండి పలాయనము సేయు పిఱికిపందను శపింపుము. ఓ దేవీ! తడయకుము శాపోదకములను విడువు"మని మఱలఁ బల్కెను.

అప్పటికి రాజ్యలక్ష్మికోపము చల్లారెను. ఆమె వీరాబాయిని ప్రేమతో లేవనెత్తి "సతీమణీ! ఊరడిల్లుము. నీ కుమారునకు బలము నొసంగుచున్నాను. అతనికి విజయము చేకూఱు"నని పలికినట్లును, వదినని తన తల్లి పరమానందభరితురాలై మరల నంతలోఁ దాను గౌరవము వహింతునో లేదో యని దీనముగఁ దనదెసఁ జూచినట్లు నాతనికిఁ దోఁచెను.

వెంటనే యాతని మనస్సు నిశ్చలం బయ్యెను. కనుదమ్ములు వికసించెను. నిస్తేజమైపోయిన యాతని ముఖముపై జీవకళ ప్రత్యక్షమయ్యెను. రక్త మంతయుఁ గవోష్ణ మయ్యెను. విరోధిపై మరలఁ గ్రోధాగ్ని రగుల్కొనియెను. ప్రతాపుఁడు తనయెదుటఁ జిత్రప్రతిమ వలె నిలిచియున్న రాణి నారసి దేవీ! యని పిలిచెను.

వెంటనే యామె చెంతకువచ్చి దూరముండి పతిహస్తములం బట్టుకొని మెల్లఁగ "నాథా!" యని పలుకరించి ముఖముకంకఁ జూచెను. అప్పుడు ప్రతాపుఁడు పుత్రులను, మొదటినుండియుఁ దన్నెడబాసియుండని సరదారులను గూడ సంబోధించి "వివేక భ్రష్టుఁడనై నేను మేవాడురాజ్యలక్ష్మియెడలఁ జాల నపరాధము చేసితిని. కాని తుద కామెకు నాపైఁ బరిపూర్ణానుగ్రహము కలిగినది. మనము మరల స్వదేశోన్ముఖులమై పోదము. మేవాడుగద్దె మన కొఱకు నిరీక్షించుచున్నది. అక్బరున కపజయము నిశ్చయము. మానసింహున కవమానము తప్పదు. ఇదే మనము పోయి శత్రువుల నోడిరింత"మని చెప్పెను.

ఆ మాట లేవియు వారి కర్థము కాలేదు. ప్రతాపుఁడు యావద్వృత్తాంతము నెఱిఁగించెను. అది విని యెల్లరును జమత్కృతులైరి. అందఱును నూతనోత్సాహభరితులై బయలుదేఱి స్వదేశమునకుఁ బోయి చేరికొనిరి.

ఏ క్షణమున వివిధభావోదయము వలనఁ బ్రతాపుని హృదయము కలఁగిపోయినదో యా క్షణమునందే యాతని యభ్యుదయము ప్రారంభ మయ్యెను. అప్పుడు ప్రతాపుని పూర్వ మంత్రి యగు భామాసా యను వాఁడు తన యజమానుని దురవస్థ యంతయు విని మిగుల వగచి తన చెంతనున్న యసంఖ్యధనమును దీసికొనివచ్చి యాతని కర్పించెను. ఆ ధనముతోఁ బ్రతాపుఁ డిరువదియైదువేల సైనికులను జేర్చికొని శత్రువు నెదిరించి పోరసాగెను.

అది మొదలు ప్రతాపుఁడు దయ యను మాటనే మఱచి పోయెను. "ఎట్లు గాపించినను బరపినాశమే రాజున కవశ్యాచరణీయ" మను నీతి నిప్పు డాతఁ డవలంబించెను. ప్రప్రథమమున వాతని కప్పుడు సరదారుఁ డగు శహాబాజను వానితో యుద్ధప్రసక్తి గలిగెను. అందుఁ బ్రతాపునకే విజయము లభించెను.

పిదపఁ బ్రతాపుఁడు కుమలు నేరుదుర్గమును ముట్టడించెను. అప్పటి కిల్లేదారుఁ డగు నబ్దుల్లా యను వాఁడు ప్రతాపుని ఘోర ముగ నెదిరించెను. తుద కబ్దుల్లా యల్లాచరణసామీప్యమునకుఁ బోయెను. హతశేషులగు వాని సైనికులు పిక్కబలిమిం జూపించిరి. కోట ప్రతాపుని స్వాధీన మయ్యెను.

ఈ నూతనోత్సాహము వలనఁ బ్రతాపుఁ డొకటి తరువాత నొకటి వొప్పున నచిరకాలమున ముప్పదిరెండు దుర్గములను గెలిచికొనియెను. అజమీరు, చిత్తోడు, మండలగడము నను మూఁడు దుర్గములు తక్క మేవాడురాజ్య మంతయు స్వాధీన మయ్యెను. పిదపఁ బ్రతాపుఁడు తన కిన్ని కష్టములం గలిగించిన మానసింహుని, వాని రాజధాని యగు జయపురమును దోపించి పరాభవించెను.

తుద కుదేపురము గూడ స్వాధీన మయ్యెను. "ఇట్లు జయ శ్రీలచే వలగారుచున్న ప్రతాపుఁ డగ్బరుమంత్రి యగు ఖానఖానునిచే మఱలఁ గొనియాడఁబడియె."

కాని యీవిజయములవలనఁ బ్రతాపునకుఁ దృప్తి గలుగలేదు. మేవాడురాజులకుఁ జితోడుదుర్గ మనిన నెంతో ప్రీతి. ప్రథమము నుండియు వారి కదియే రాజధాని. వారి శౌర్యము, పౌరుషము నభిమానము, నాభిజాత్యమును, నందే మూర్తీభవించి యున్నవి. వీర స్వర్గమును జూఱగొన్న తమ పురుషులచెంతకుఁ బోవుటకు రమణీ మణులు జోహారు సేయుటవలన నది పరమపవిత్రమై యున్నది. అందలి ప్రతిష్ఠలమును సిసోదియావంశమువారి యశస్సును గీర్తించు చున్నది. అట్టి చిత్తూరుదుర్గమును గెలువనంత కాలము తన ప్రతాపము వన్నె కెక్కదని భావించి ప్రతాపుఁ డందులకుఁ దీవ్రప్రయత్నములం బ్రారంభించెను.

అంతయు సిద్ధ మయ్యెను. సిద్ధాంతులు జైత్రప్రస్థానమునకు శుభముహూర్తము నిశ్చయపఱచిరి. సరివారు లెల్లరును జిత్తూరుదుర్గము నందలి మహామ్మదీయులపై నెప్పు డుఱుకుదుమా యని త్వరపడు చుండిరి. రాణి కులదేవతలం బూజించుచు ముత్తైదువలకు సమస్త దానములు సేయుచుండెను. భట్రాజులు తమ యనర్గళకవితాలహరిం బ్రవహింపఁజేసి వీరభటుల నందఱఁ దేలియాడించుచుండిరి. క్రొత్తగా సాంసారికసౌఖ్యములను బ్రసన్నములు గావించుకొనిన ముద్దరాండ్ర హృదయములను దైన్యము నానందమును మిళితములై కలంచివేయు చుండెను. ప్రౌఢాంగనలు తమ ముద్దుబిడ్డలం గొనివచ్చి భర్తల కాళ్లకుఁ బెనఁగించుచుండిరి. మధ్యనాయికలును వారిభర్తలును సాభి ప్రాయముగఁ జూచుకొనుచుండిరి. వృద్ధాంగనలు గద్గదకంఠలై యుండిరి.

ఇంతలో రాజపుత్రులయం దొక దుఃఖకర మైన వార్త వ్యాపించెను. ననలెత్తుచున్న యా వల్లీకాలత తెగిపోయినది. ఆయా నందవాహిని యాగిపోయెను. ఆ యుత్సాహతరంగిణి రుద్ధంబై పోయెను. ఆ వర్ధమానచంద్రునకు వినీలనిబిడ మేఘమాలిక యడ్డు వచ్చెను. ఉన్నట్లుండఁగాఁ బ్రతాపున కుద్ధృతరోగము సంభవించెను. రోగనివారణముకొఱ కనేక వైద్యులు ప్రయత్నించిరి. అంతయు బూడిదలోఁ బోసిన పన్నీ రయ్యెను. తుదకు జైత్రప్రస్థానమునకు బదులుగాఁ బ్రతాపుని పరలోకయాత్ర నిశ్చితం బయ్యెను. అంతటను విచారతరంగిణి పొంగి పొరలి ప్రవహింపఁజొచ్చెను.

అమరసింహాదికుమారులును, సేనాధిపులును, మంత్రిమండలి వారును, రాజబంధువులును, బ్రతాపుని చుట్టును మూఁగియుండిరి. రాణి పదములకడఁ గూర్చుండి యుండెను. అప్పుడు ప్రతాపుఁడు చాల వేదన ననుభవింపసాగెను.

అందఱును బాధానివారణకొఱ కౌషధపానము సేయవలసిన దని ప్రతాపునిఁ బ్రార్థించిరి; గాని యాతఁ డందుల కంగీకరింపక "యీ బాధ యౌషధసేవనలనఁ దీఱునది గాదు. ఖడ్గవ్యాపారమును జేయవలయును. చిత్తూరుదుర్గమును జయింపవలెను. దానిపై నెగురుచున్న చంద్రధ్వజమును గూల్పవలెను. ఆ దుర్గమును మేవాడు రాజ్యలక్ష్మికి విలాసభవనము సేయవలెను. ఇఁక నీ పని నావలనఁ గానేరదు. నా తరువాత నా యంతటి వారు మీ రున్నారు. మీ రేమి చేసెదరు? మీ కవశ్యకర్తవ్యమైనదానిని గుఱించి ప్రయత్నించెదరా? చేతగా దని యూరకుందురా? ఇప్పుడు చెప్పుడు. ఇఁకఁ బ్రాణము లెట్లును నిలువవు. చింతమాత్రము పోదు. చింతాక్రాంతునకు సద్గతి గలుగదు. నేను వీరస్వర్గమున కాశ వదలుకొనవలయునా!

కుంభీపాకనరకమునఁ బడి యాతన పడవలయునా? నా పూర్వుల గతికి నేను తప్పినవాఁడ నైపోదునా? నా తల్లి వీరమాత కాదను నపకీర్తికిఁ బాల్పడునా? అంతయు మీ చేతిలో నున్నది. మీరు చిత్తూరు జయించెదరేని నా వీరత్వము దేవతలచే నంగీకృతమగు" నని చెప్పి యూరకుండెను.

ఇది యెల్లరును వినిరి. వారి రక్తనాళము లుబ్బిపోయెను. ఏదో వాఁడిబాణము వచ్చి తటాలున నల్లగుండెకుఁ దాఁకినట్లయ్యెను. ఆ సమయమున నందఱు నభయసింహుని వైపుఁ జూచిరి. అతని ముఖము నవీనకాంతి వహించెను. అందఱముఖములును ప్రఫుల్లము లయ్యెను. వారి కనీనికలు మెఱసిపోయెను. అప్పు డభయసింహుఁడు గొంతెత్తి "మీ రేమి విచారమక్కఱలేదు. చిత్తోడుదుర్గమును నేను జయించెద" నని ప్రతిజ్ఞపట్టెను.

వెంటనే ప్రతాపుని దీవానముపై సానందలక్ష్మి తాండవ మాడెను. అచ్చటివా రెల్లరును బళిబళీ! యని పొగడిరి. ప్రతాపుఁడు ఫల్గుని వీఁపుతట్టుచుఁ "భ్రాతా! చిరాయుష్మంతుఁడ వగుము. శత్రుంజయుఁడవుగమ్ము. అని మొన రుద్రేంద్రాదులు నీకు బాసటలై నిలుతు"రని పలికి కన్నులు మూసెను. ఎల్లరును చిత్రప్రతిమ లైపోయిరి. ప్రతాపమార్తాండుఁ డస్తపర్వతము నధిరోహించెను.

నిర్వివాదము లగు కేవలగుణములతో నలంకరింపఁబడిన మహా వీరుని జీవితమునందలి ఘటనను వివరించి చెప్పవలసిన యావశ్యకము లేదు. భారతభూమి నలంకరించిన వీరాధివీరులలో నుత్తమస్థానమును గైకొన్న యోధశిఖామణులలోఁ బ్రతాపసింహుఁ డొకఁడని చెప్పుటలో నతిశయోక్తి యేమియు లేదు. యుద్ధమునకు వ్యవధి

యిష్టుని శత్రునిఁ గోరుటయు, శత్రువుల యొత్తిడి కోపలేక విజయము నెడల నాశ వదలుకొని విదేశములకుఁ బోవఁ బ్రయాణ మగుటయుఁ బ్రతాపునివంటి వీరునకుఁ దగనివియే యైనను నవి యందును గుణసన్నిపాతమునఁ బడి మునిఁగిపోవు నవియే యని వాదించుట కవకాశమున్నది.

ప్రతాపుని జీవితమున ధ్రువతారాతుల్యముగఁ దళతళమని ప్రకాశించు గుణరత్నములలో మొదటిది యాత్మగౌరవము. రెండవది పురుషకారము. మూఁడవది ధైర్యము. నాల్గవది స్థైర్యము. ఎట్టి యంతరాయము సంభవించినను ప్రారంభించిన కార్యమున బ్రహ్మాస్త్రమువలె నిగ్రహముగఁ బనిచేయువాఁడు గావుననే నిలుచుటకు నీడలేక యల్లాడిన ప్రతాపుఁ డక్బరువంటి జిత్తులమారియగు వైరిని గడగడలాడింపఁ గలిగెను.



# ఆర్యపుస్తకాలయము - రాజమండ్రి

| | | |
|---|---|---|
| వీరభుజ (శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిది) | 2-వ కూర్పు | 1- 0-0 |
| శ్మశానవాటిక | ,, | 1- 0-0 |
| మిథునానురాగము | ,, | 0-12-0 |
| వారకాంత | (రెండవకూర్పు) | 0- 8-0 |
| రామదేవవిజయము | ,, | 0- 6-0 |
| సాహసిక రాజపుత్రము | ,, | 0- 6-0 |
| శృంఖల | ,, | 0- 6-0 |
| విజయనగర రాజులకథలు | ,, | 0- 3-0 |
| చిత్తూరు రాజులకథలు | ,, | 0- 4-0 |
| ఢిల్లీ చక్రవర్తులకథలు | ,, | 0- 4-0 |
| గోల్కొండ నవాబుకథలు | ,, | 0- 2-0 |
| భారతీరమణీమణులు | ,, | 0-12-0 |
| మహాభక్తవిజయము | ,, | 4- 0-0 |
| భేతాళునికథలు | | 0- 6-0 |
| భోజునికథలు | | 0- 6-0 |
| విక్రమార్కునికథలు | | 0- 6-0 |
| వైద్యులకథలు | | 0- 3-0 |
| వరాహపురాణము (నందిమల్లయ్య, ఘంట సింగయ్య) | | 1- 0-0 |
| వేణీసంహారము (వడ్డాది సుబ్బారాయుడుగారిది) | | 1- 0-0 |
| రాణీసంయుక్త (వేలాల సుబ్బారావుగారిది) | | 0-12-0 |
| మహాపురుషులజీవచరిత్ర | 1-వ భాగము | 0-12-0 |
| (చిలకమర్తి | 2-వ ,, | 0-10-0 |
| లక్ష్మీనరసింహముగారిది) | 3-వ ,, | 0-12-0 |

ఇంకను అనేక సంస్కృతాంధ్ర గ్రంథములును, మ్యాపులు, కాలేజీ, ఇంగ్లీషు పుస్తకములు దొరకును.

ఒకసారి సిరాపోసిన సుమారు 50,000 పదములను వ్రాయునట్టియు,
5 సం॥ముల వరకు గ్యారంటి ఇవ్వబడునట్టి మేలైన

# ఫౌంటెన్ పేనా ఉచితము.

5 అణాలు మాకుపంపి, 4 చీట్లను పుచ్చుకొని, వాటిని రూ|| 1-4-0 కు అమ్మి, మీరంపిన 5 అణాల నెత్తుకొని, మిగిలిన 15 అణాలను మాకు పంపి ఫౌంటెన్ పేనాను పుచ్చుకొనుడు. ఇదే ప్రకారము ఒక్కొక్కరికి 4 చీట్లు పంపబడును. మీరుచేసిన ప్రకారము వారును చేసినచో ఒక్కొక్కరికి పేనా యినాముగావచ్చును. మీరు తీసికొన్న ప్రయాసకుగాను 12 గురు 12 పేనాలను తెప్పించినచో, మీకొక 6 రూపాయల వెలగల మంచి గడియారము ఉచితముగా నిచ్చెదము. రైల్వే కగులేటరు వెండి చేతిగడియారములు కూపన్లు కూడ మావద్ద సిద్ధముగా నున్నది. మంచితరుణమును పోగొట్టుకొనకుడు.

## యూనైటెన్ ఫ్యాక్టరి, చిత్తూరు.

---

ఇనాం ! ఇనాం !! ఇనాం!!!

# ఇంగ్లీషు లీవర్ గడియారము



ఈ చిన్నగడియారము మిగుల మేలైనది. చూచుటకు అందముగా నుండును. ఇండియా దేశమంతటను ప్రఖ్యాతి పొందియున్నది. ఈ నెలలోగా తెప్పించుకొనువారికి మేలైన ఫౌన్టన్ పేనా బహుమాన మిచ్చెదము. త్వరపడుడు. గడియారము ఒకటికి బహుమానముతో రూ. 3-8-0. 4 సంవత్సరములు గ్యారంటీ. మేలైన ముంజేతి గడియారము తోలుపట్టతో సహా రు. 5-12-0. మేలైన ముంజేతి గన్ మెటల్ గడియారము 7-0-0.

**W. R. Triumph & Co., 24, Bunder St, Madras**

# మన్మథమోహినిలేహ్యము



ఈ లేహ్యము వీర్యవృద్ధి, రక్తవృద్ధి గలిగించు అనేక మూలికలతోను, అంబరు, శిలాజిత్తు, సాలామిశ్రి, అక్రోటు, మొదలగు యూనాని మందులను చేర్చి శాస్త్రోక్తముగా తయారు చేయబడినది. ప్రతిదినము ప్రొద్దున సాయంత్రము 1 తులము సేవించిన, అజీర్ణమును హరింప జేసి, రక్తవృద్ధి, నరముల పుష్టి, వీర్య పటుత్వము, బలము, జ్ఞాపక శక్తి మొదలైన వానిని వృద్ధిపరచి సంతోషమును గలుగజేయును. 25 తులాలు గల డబ్బి రు. 2-0-0.

# రాజభృంగామలక తైలము

ఈ తైలము అనేకమూలికల యొక్క పుష్పరాజముల యొక్క సారములను, సరకులను చేర్చి శాస్త్రోక్తముగ తయారు చేయబడినది. ఈ తైలము పిల్లలు పెద్దలును తలంటుకొని స్నానము చేసిన తలను దేహమును నంతను చల్లపరచి శరీరమునందు ఉష్ణము, శిరోవాతము, తల తిరుగుట, తలనొప్పి, పార్శ్వపు నొప్పి, మాడుపోటు మెదడు పోటు, కండ్లమంట, తలలో నాదములు నిద్ర చక్కగా పట్టక పోవుట, కంటిలో కారుట, పుసులు కట్టుట, శరీరతాపము మొదలయిన వ్యాధులను శీఘ్రముగ నివర్తి చేయుటయందు వజ్రాయుధము.

ఆర్. నరసింహారావు. రెడ్డి వీధి, విల్లివాకం పోస్టు,

మజరా — పెరంబూరు, మదరాసు.

# శ్రీ విజ్ఞానవినోదిని.

ఇందు రెండుమాసముల కొకటి చొప్పున, వినోదకరమైనవి, చారిత్రకమైనవి, నిరూపకమగునవి, నవలలు నాటకములు, దేశీయ చరిత్రలు, మహాపురుషుల చరిత్రలు ప్రచురింపబడి చందాదారుల పద్ధతిని పంపబడుచుండును. చందాదారులు అన్ని గ్రంథములు కొనుచుండవలయును. వీరికి తక్కువ క్రయమునకు గ్రంథములు పంపుచుందుము. ఇతరులకు 100 పేజీలు 0-6-0; చందాదారులకు యుద్ధము ముగిసి కాగితము చౌకయగునంతవరకు 100 పేజీలు 0-5-0 చొప్పున ఆపైని 0-4-0 వంతునను క్రయము కట్టబడును. ఆంధ్రభాషాభిమానులందరు చేయూత నొసంగెదరని నమ్ముచున్నాము.

## ప్రకటింపబడినవి.

| | | | | |
|---|---|---|---|---|
| వనజాక్షీ చరిత్రనవల | చందాదార్లకు | 0-8-0 | ఇతరులకు | 0-12-0 |
| వ్యాసమంజరి వ్యాసములు | ,, | 0-8-0 | ,, | 0-8-0 |
| బొబ్బిలి చరిత్రనవల | ,, | 1-0-0 | ,, | 1-4-0 |

## ముందు రాబోయెడి నవలలు.

తార, భయంకరమఠము, రమామణి.

విలాసము:—

విజ్ఞానవినోదనీ కార్యాలయము,

25 నమ్మాళ్వారువీధి,

మద్రాసు.

సంపాదకులు

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

వ్యవస్థాపకులు

మల్లిడి సత్తిరెడ్డిగారు

# కలాభివర్ధని

ఈగ్రంథనిలయమునుండి సంవత్సరమునకు నాల్గింటికిఁ దక్కువగాకుండ జక్కని కాలిక్షేపము చేయఁబడిన నవలలు ప్రకటింపఁబడును. మా గ్రంథములన్నియు నద్భుతకథాకల్పనా విలసితములై, మనోహరవర్ణనాబంధురములై, సముదారభావపూరితములై మనోజ్ఞపదలలితమగు శిష్టభాషలో వ్రాయఁబడి తళతళలాడు వెండిరేకులవంటి కాగితములమీఁద మిలమిలలాడు ముత్యములఁబోలు నక్షరములతో ముద్దులు మూటగట్టునట్లు ముద్రింపఁబడును. గ్రంథములన్నియుఁ జందాదారులకు తపాలాకూలిగాక నూటుపుటలకు ౦-౮-౦ చొప్పున వెల యేర్పఱుపఁబడును. చందాదారులు ౦-౮-౦ ప్రవేశకట్నము మీయవలెను. చందాదారుల సంఖ్య వృద్ధియై మాకుఁ బ్రోత్సాహము కలిగిన కొలఁదిని ప్రతి పుస్తకమునందును జాలపటములు చేర్పఁబడును.

**కలాభివర్ధనీ గ్రంథనిలయము**

**రాయవరము - గోదావరిజిల్లా**